అపరాధ పరిశోధన అనుబంధం—158

# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## హనుమాయమ్మ గ్రంథాలయం

రచన: వసుంధర

## అడకత్తెర

రచన: వి. యస్. రావ్

## హైజాకర్స్

రచన: సుంకరి రాంప్రసాద్

అన్వేషణ - ఎనిమిదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—158
ఫిబ్రవరి, 1987
వెల: రు. 7-00
ఏడాది చందా: 84 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. వీ. మోహన్రావ్
కొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# హనుమాయమ్మ గ్రంథాలయం

## వసుంధర

రామకృష్ణా మిషన్ బీచ్ దగ్గర కూర్చుని సముద్రంవైపే గంభీరంగా చూస్తున్నారు శాస్త్రి, శర్మ.

"మనమేదో ఒకటి చేయాలి. ఇలా ఖాళీగా వుండిపోతే దేశానికి ప్రమాదకరంగా మారిపోతాం" అన్నాడు శాస్త్రి.

"అబ్బ! ఒక్క క్షణం మౌనంగా వుండలేవు కదా! కాసేపు నన్ను సముద్రాన్ని చూడనీ!" అన్నాడు శర్మ విసుగ్గా.

"అదేపనిగా హోరు పెడుతున్న సముద్రం నీకు విసుగనిపించటంలేదు. నా మాటలు విసుగనిపించాయా?" అన్నాడు శాస్త్రి.

"సముద్రం ప్రకృతి. ప్రకృతి అందాలు విసుగురావు."

"ఏం—మనిషి మాత్రం ప్రకృతి కాదా?"

"శాస్త్రి-నువ్వూ ప్రకృతివేనని ఒప్పుకుంటాను. నన్ను విసుగించకు."

"నేను విసుగించావంటే లోపం నా మాటలది కాదు. నీ మెదడుది. పనిలేక అది దెయ్యానికి కర్మాగారమయింది. నా మతిలూరికే పుట్టవు. నా మాట విను. మనం మెదడుకు పదును పెట్టాలి."

శర్మ సముద్రం నుంచి దృష్టిని శాస్త్రివైపు మళ్ళించి- "ఏమిటి నీ రొద—ఇప్పుడేం చేయాలో చెప్పు...." అన్నాడు.

"ఏదైనా మంచిపని చేయాలి...."

"మంచిపని అంటే...." అని ఓ క్షణం ఆలోచించి "పాపం ఇంటాయన కద్దె యివ్వాలి. మన దగ్గర డబ్బుందిగా యిచ్చేద్దాం" అన్నాడు శర్మ.

"అద్దె ఫస్టుకివ్వాలి. ఇంటాయనకు మనం బాకీ ఏమీ లేముగదా—ఫస్టు దాకా ఆగే యిద్దాం" అన్నాడు శాస్త్రి.

"నేను చెప్పేది ఇప్పటాయన కాదు. పాత ఇంటాయన మాట" అన్నాడు శర్మ.

"ఓహో ఇప్పుడు గతాన్నెందుకు తవ్వుతావు శర్మా! అది నేనెప్పుడో మర్చిపోయాను" అన్నాడు శాస్త్రి.

"గతమనకు సేందుకది జరిగి జస్టు టూ మంత్సు.... అంతేకదా! పాపం ఆయన బాకీ తీర్చేద్దాం"

"పాపం అని ఆయనమీద జాలిపడ్డానికి ఆయనేమన్నా మనని కనికరించాడా? రేపట్లోగా నా అద్దె బకాయి చెల్లించకపోతే ఇల్లు ఖాళీచేసిపొండి అన్నాడు. సమయానికి వేరే యిల్లు దొరక్కపోతే ఏమైపోదుం?" అన్నాడు శాస్త్రి.

"దొరికింది కాబట్టి ఖాళీచేసిపోయాం. దొరక్కపోతే ఆయన కాళ్ళు పట్టుకుందుం—ఆయన చాలా మంచివాడు.

మన సామాను కూడా ఉంచుకోలేదు."

శాస్త్రి నవ్వి "ఉంచుకుందుకు పనికొచ్చే సామాను మన దగ్గరేముంది?" అన్నాడు.

శర్మ ఆదోలా మిత్రుడివంక చూసి "నువ్వు చెప్పింది నిజం. మనకు పనిలేకపోతే దుర్మార్గులమైపోతాం. నువ్వు మన పాతయింటి యజమానిలో బొత్తిగా పంచితనాన్ని చూడలేకపోతున్నావు పద....ముందాయనకు పాతబాకీ తీర్చివద్దాం" అన్నాడు.

"పాతబాకీ తీర్చితే మనదగ్గర డబ్బు కరిగిపోతుంది."

"కరిగిపోతే మెదడు పదునెక్కుతుంది. సానబెట్టిన వజ్రానికి ఎప్పుడైనా మంచి ధర పలుకుతుంది. ఊరికే కూర్చుని ఉన్నదనుభవించడం మన కచ్చిరాదులే...." అంటూ తను లేచి నిలబడి స్నేహితుణ్ని రెక్కపుచ్చుకుని లేపాడు శర్మ.

శాస్త్రి లేచి నిలబడి "నువ్వు చెప్పింది బాగానే వుంది కానీ అంత సులువుగా డబ్బివ్వడానికి నేనొప్పుకోను. బయల్దేరగానే మనకు శుభసూచన కనబడాలి" అన్నాడు.

"సరే" అన్నాడు శర్మ.

ఇద్దరూ వీధిరోడ్డు మీదకు వచ్చారు.

"ఇప్పుడెటు వెళ్ళాలి?" అన్నాడు శాస్త్రి.

"ఏం—ఆ యిల్లు నీకు తెలియనిదా?" అన్నాడు శర్మ చిరాగ్గా.

"చెప్పానుగా—ఆయన గురించి పూర్తిగా మర్చిపోయానని!"

"మర్చిపోయానంటే కుదరదు. గుర్తు చేసుకో వలసిందే"

ఉన్నట్టుండి "అటుపోదాం" అన్నాడు శాస్త్రి.

"బాగానే గుర్తుక తెచ్చుకున్నావు" అన్నాడు శర్మ మెచ్చుకోలుగా.

శాస్త్రి మాట్లాడలేదు. ఇద్దరూ అటువైపుగా నడక సాగారు. నడుస్తూంటే శర్మ—ఇంటివాళ్ళ బాకీలు తీర్చడంలోని ప్రయోజనాల గురించి చెబుతున్నాడు.

"నీ కబుర్లు కట్టిపెట్టి శాస్త ముందుకు చూడు. ఇందాకా నువ్వు చూసిన సముద్రం కంటే అందమైన ప్రకృతి కనబడుతుంది" అన్నాడు శాస్త్రి.

శర్మ ముందుకు తీక్షణంగా చూసి "అరె" అన్నాడు.

చిత్రకారుడు గీసిన గీతల్లా వున్నదామె శరీరం. ఆ శరీరానికి చక్కగా అమరినట్లు కట్టుకున్న చీర. రెండు జడలు లయబద్ధంగా నడకకు కదుల్తున్న ఆమె పిరుదలపై నాట్యం చేస్తున్నాయి.

ఆమె ముందు నడుస్తోంది.

శాస్త్రి, శర్మ ఆమె ననుసరించి వెడుతున్నారు.

"చూశావా ప్రకృతి అంటే ఇలాంటివి చూడాలి!" అన్నాడు శాస్త్రి.

"వెతకబోయిన తీగ కాలికి తగిలింది" అన్నాడు శర్మ.

"ఉత్తతీగ అనకు. మెరుపుతీగ అను" అన్నాడు శాస్త్రి.

"మన పాతయింటి యజమానిని మెరుపుతీగ అనమన్నావంటే నీవు చాలా మంచివాడివై పోయావు. ఇది శుభసూచన" అన్నాడు శర్మ.

"మధ్య ఇప్పుడాయన ప్రసక్తి ఎందుకు?" అన్నాడు శాస్త్రి చిరాగ్గా.

"డబ్బివ్వాలని బయల్దేరాం. అందుకంచు కాయసే

ఎదురొస్తున్నాడు. నీ కింకా కనబడలేదా?" అన్నాడు శర్మ.

శాస్త్రి ఉలిక్కిపడి "నిజంగానా?" అన్నాడు.

"అదిగో చూడు!" అన్నాడు శర్మ.

"అయితే ఆయన క్కనబడకుండా దాక్కోవాలి"

"అది డబ్బులేనప్పుడు చేసేపని. అలవాటులో పొర పాటంటే యిదేనేమో! ఇప్పుడు మనం ధైర్యంగా దర్జాగా ఆయనముందు నిలబడొచ్చు."

"ధైర్యంగా దర్జాగా ఆయన ముందు నిలబడాలని నాకేమీ సరదాగాలేదు. ఆయన రాజకీయ నాయకుడూ కాదు, శ్రీదేవిలాంటి గ్లామర్ తారా కాదు."

"అయితే ఏమంటావ్?"

"దాక్కుందాం...."

ఎందుకో ముందు నడుస్తున్న అమ్మాయి ఆగింది. ఆమె కెదురుగా వస్తున్న ఇంటాయనా ఆగాడు.

ఆమె ఆయన్ను ఏమడిగింది.

ఆయన చెప్పి అక్కడే వుండిపోయాడు.

"పద ఆయనకు డబ్బిచ్చేద్దాం" అన్నాడు శర్మ.

"అబ్బా దాక్కుందామంటే!" అన్నాడు శాస్త్రి.

"చూడు—అన్నీ శుభసూచనలు కనబడితే ఆయన బాకీ తీర్చేద్దామని అన్నావు. నీకో అందమైన అమ్మాయి కనబడింది. ఆయనింటికి వెళ్ళే శ్రమలేకుండా తనే ఎదురొచ్చాడు" అన్నాడు శర్మ.

"సరే—అందమైన అమ్మాయి వెంటబడిపోతున్నప్పుడు ఇంటాయన ఎదురవడం శుభసూచనెలాగౌతుంది? అదీకాక ఇంటాయన కిక్కడ డబ్బు లివ్వడంవల్ల మనకేం లాభం? వాళ్ళావిడ సంగతి నీకు తెలిసిందే కదా!

ఆ మెకు భయపడే ఆయన మనని అద్దెకోసం పీడించే వాడు. ఆయనకు పెళ్ళామంటే చచ్చేంత భయం. ఇప్పుడు మనం డబ్బిచ్చినా ఆయన పెళ్ళానికి చెప్పకుండా పాకెట్ మనీ కింద దాచుకుంటాడు. ఆతర్వాత అవి దెప్పరైనా ఎదురయిందంటే మన ప్రాణాలు తీస్తుంది. విధం చెడ్డా ఫలం దక్కాలి. బాకీ తీర్చినా ఆవిడ బాధ వదలకపోతే అందువల్ల మనకు ప్రయోజనమేమిటి?"

"అయితే ఏమంటావ్?" అన్నాడు శర్మ విసుగ్గా.

"ఇప్పుడాయ నింటికి వెడదాం."

"డబ్బావిడ కిచ్చేద్దామా?"

శాస్త్రి కోపంగా మిత్రుడివంక చూసి "ఆయన పెళ్ళానికి బానిస కావచ్చు. అంతమాత్రాన ఇంటద్దె ఆవిడ కిచ్చి ఆయన్నవమానించలేను. ఆ యింటికి ఆయనే యజమాని. నే నాయన్ను గౌరవిస్తాను. ఆయనకే బాకీ తీరుస్తాను" అన్నాడు.

"మీరాయన యింటిదగ్గర వుండడు కదా!" అన్నాడు శర్మ.

"ఆయనున్నాడా అనడిగి లేదంటే వెళ్ళిపోదాం."

"ఆవిడంత సులభంగా వదులుతుందా? ఒకసారి కళ్ళబడ్డామంటే పురాణం విప్పుతుంది. తీఃకూర్చుని ఆవిడ కళ్ళ డడ మెందుకూ?"

"అదే నేనూ చెబుతున్నాను. కానీ నువ్వే పట్టుబడుతున్నావు "

శర్మ తెల్లబోయి మిత్రుడివంక చూశాడు.

ఈలోగా ఇంటాయన ఆ మెను దాటుకుని ముందుకు వచ్చాడు. మిత్రులిద్దరికీ తప్పుకునే సమయం లేకపోయింది.

శర్మ జేబులో చేయిపెట్టాడు. శాస్త్రి నమస్కారం

పెట్టడానికి సిద్ధంగా వున్నాడు.

అయితే ఇంటాయన వీరివంక చూడలేదు.

ఆయన ఉత్సాహంగా తనలో తానే నవ్వుకుంటూ ముందుకు వెళ్ళిపోయాడు.

"చాలా ఆశ్చర్యం! ఒకప్పుడు మన వాసన పసిగట్టి వచ్చేసేవాడు. ఇప్పుడెదురుగా కనబడ్డా గుర్తుపట్టలేదు!" అన్నాడు శర్మ ఆశ్చర్యంగా.

"ఇందులో ఆశ్చర్యమేముంది! అంతా ప్రకృతి మహిమ. మనం వెంటబడ్డ ఆ అమ్మాయి చాలా అందంగా వుండివుంటుంది. ఆమె పలకరించి పేరడిగి నాలుగు కబుర్లు చెప్పేసరికి గురుడికి మతి, గతి తప్పినట్లుంది. ఆయన్ని అంతలా మరిపించిన ఆ అమ్మాయిని మనం చూడక తప్పదు. ముఖం చూద్దాం—పద!" అన్నాడు శాస్త్రి.

శర్మ మాట్లాడలేదు.

మిత్రులిద్దరూ వేగంగా అడుగులు వేస్తూ ఆమెను దాటుకుని వెళ్ళి ఓసారి వెనక్కు తిరిగి చూసి చటుక్కున ముందుకు ముఖం తిప్పేశారు.

అమ్మాయి అందమైందే—కానీ....

"బాడ్ లక్! మనకు బాగా తెలిసిన అమ్మాయి" అన్నాడు శర్మ.

"ఆ పాతింటాయన కనబడ్డప్పుడే అనుకున్నాను. వెధవ శకునం" అంటూ నిట్టూర్చాడు శాస్త్రి.

ఈలోగా వెనుకనుంచి "ఏమండోయ్!" అన్న కేక వినబడింది.

ఆ కేక తమను కాదన్నట్లుగా ముందడుగు వేశారు మిత్రులు.

"శాస్త్రి గారూ! మిమ్మల్నే—ఆగండి...." అందా అమ్మాయి మళ్ళీ.

"శర్మా ఆమె నన్నాగమంటోంది. నువ్వు నడుస్తూండు. నే నిప్పుడే ఆమెతో మాట్లాడి వస్తాను" అన్నాడు శాస్త్రి.

"నాకు కాళ్ళు లాగుతున్నాయి. కాసేపిక్కడే నిలబడతాను" అన్నాడు శర్మ మొండిగా.

"విధవ శకునం వచ్చింది. నీ వంటి బుద్ధిమంతులు కూడా తిరగబడుతున్నారు. ఎరిగున్నమ్మాయిని పలకరిస్తే బాగుండదని తటపటాయిస్తే వెతికబోయిన తీగ కాలి కెదురైనట్లు ఆమే నన్ను పిలిచింది. కానీ ఏం లాభం.... నువ్వు పక్కనుండగా నే ఆమెతో మాట్లాడాలి" అన్నాడు శాస్త్రి.

శర్మ కులిక్కకుండా మొండిగా అలాగే నిలబడ్డాడు.

ఈలోగా ఆ అమ్మాయి వారిద్దర్నీ సమీపించింది.

శాస్త్రి ఆమె ఎవరో ఎరుగనట్లు చూశాడు.

"నేనండీ మీ ఎదురింటి అమ్మాయిని. నా పేరు శశిరేఖ" అందామె తన్ను తా నతడికి పరిచయం చేసుకుంటూ.

"అలాగా" అన్నాడు శాస్త్రి యిబ్బందిగా.

ఆమె కొద్దిగా చిన్నబుచ్చుకుని "శాస్త్రిగారు నన్ను చాలాసార్లు చూశారు. మీకు గుర్తు లేకపోయినా వారికి నేను గుర్తుంటాను" అంటూ శర్మవైపు తిరిగి "శాస్త్రిగారూ! మీతోనే నాకు పనుంది" అంది.

"నా పేరు శర్మ. శాస్త్రి అతడు" అన్నాడు శర్మ.

"ఓహో—మీ యిద్దర్లో ఒకరు శాస్త్రి, ఒకరు శర్మ అని తెలుసు. ఎవరు శాస్త్రో, ఎవరు శర్మో తెలియదు.

అయాం సారీ శర్మగారూ!" అందామె.

శర్మ గంభీరంగా "శాస్త్రీ! కాసేపలా పక్కకు వెళ్ళు. మేమిద్దరం మాట్లాడుకోవాలి" అన్నాడు వెంటనే.

శాస్త్రి ముఖం చిన్నబోయినా "చాలా అర్జంటు పనిమీద వెడుతూ మీరు పిల్చారని ఆగాను...." అని తన మాటలు తనకే అసందర్భంగా తోచి ఆగిపోయాడు.

"ఫరవాలేదు. ఆయనకూడా వుండొచ్చు—" అంది శశిరేఖ.

"సరే....నువ్వూ వుండు—" అన్నాడు శర్మ తన అనుమతిని తెలుపుతూ.

"మనం అలా ఇసుకలో కూర్చుని మాట్లాడుకుందాం" అందామె.

బీచి—ఆడపిల్ల....

శాస్త్రి మనసులో ఉత్సాహపడ్డాడు. శర్మ మాత్రం గంభీరంగా—"పదండి—" అన్నాడు.

ముగ్గురూ సముద్ర కెరటాలకు దూరంగా ఇసుకలో కూర్చున్నారు.

"నా అదృష్టం—వెతకబోయిన తీగ కాలికి తగిలింది" అంది శశిరేఖ.

"మీకు తీగ తెలుసుకానీ తీగ పేరు తెలియదు—" అన్నాడు శాస్త్రి.

"తీగ పేరుతో నాకేమి నిమిత్తం. నాక్కావలసింది పువ్వు—" అంది శశిరేఖ.

"పువ్వా?" అన్నాడు శర్మ ఆశ్చర్యంగా.

శాస్త్రి ఓసారి చెవులు తడుముకొని—"నా దగ్గర పువ్వులేవు—" అన్నాడు.

"గుమ్మడికాయల దొంగలంటే భుజాలు తడుముకున్నట్లే పువ్వన్నగానే చెవులు తడుముకునేవాళ్లూ వుంటారన్నమాట! అయినా నేను పువ్వడిగింది మిమ్మల్ని కాదు. శాస్త్రిగారిని—" అంటూ శశిరేఖ శర్మ వంక చూసింది.

"నేను శర్మను. శాస్త్రిని కాను...." అన్నాడు శర్మ అదోలా.

"ఏమిటో—మిమ్మల్ని చూడగానే మీ పేరు శాస్త్రి అనిపిస్తోంది...."

శాస్త్రి కలగజేసుకొని—"శాస్త్రి అంటే పిలవడానికి ముద్దుగా వుంటుంది. శర్మంటే అదేం కర్మరా బాబూ అనిపిస్తుంది" అన్నాడు.

శర్మ వెంటనే—"ముద్దుగా వుండే పేరు నాకెలప్ప నీకు నప్పదని శశిరేఖగారి అభిప్రాయం—" అన్నాడు

"బాగా చెప్పారు. పువ్వు మీ దగ్గరుంది గాబట్టి బాగా చెప్పగలగడం మీకు సాధ్యపడింది—" అంది శశిరేఖ.

శర్మ తనూ అప్రయత్నంగా చెవులు తడుముకొని—"పువ్వు నా దగ్గరుండడమేమిటి?" అన్నాడు.

"పువ్వంటే మీకర్థమైనట్లులేదు. అది కిరణ్మయి నవల. మహోద్భుతమైన నవల—" అంది శశిరేఖ.

"అయ్యో—మీరు నవలల గురించి మాట్లాడుతున్నారా? నేను నవలలు చదవను. అందులోనూ తెలుగువి అసలే చదవను—" అన్నాడు శర్మ.

"కానీ ఆ నవల నేను మీ చేతిలోనే చూశాను...." అంది శశిరేఖ.

"ఎప్పుడు?" అన్నాడు శర్మ ఆశ్చర్యంగా.

"సరిగ్గా రెండ్రోజుల క్రితం...." అందామె.

"అసాధ్యం—" అన్నాడు శర్మ.

"నేను కళ్ళతో చూసిన విశేషం అసాధ్యమంటా వేమిటి?"

"ఒకొక్కప్పుడు మన కళ్ళే మనని మోసం చేస్తాయి-"

"నా కళ్ళు వస్తెప్పుడూ మోసం చేయవు...."

"మోసం చేయకపోతే నా చేతిలో పువ్వెలా మారాయి?"

"శర్మా! ఆమెతో వాదించకు. ఆమె చెప్పింది రైటు" అన్నాడు శాస్త్రి.

"నిన్నెవ్వరూ సలహా అడగలేదు. నా తప్పొప్పులు నాకు తెలుసు...."

శాస్త్రి గంభీరంగా చూస్తూ—"ఇక్కడ నేను కూడా వుండడం మంచిదయింది. లేకపోతే ఒక నిజం అబద్ధంగా మారిపోయుండేది—" అన్నాడు.

"ఇది పువ్వులోని డైలాగు. మీ కెలా తెలుసు?" అంది శశిరేఖ.

"ఎలా తెలుసంటే—నేనా నవల చదివాను కాబట్టి. కిరణ్మయి నా అభిమాన రచయిత్రి—...." అన్నాడు శాస్త్రి.

"కిరణ్మయి ఆడదికాదు—మగాడు...." అందామె వెంటనే.

"నాకు తెలుసు. అయినా అతడు నా అభిమాన రచయిత్రి—"

"వాక్యంలో ఏదో తప్పున్నట్లుంది—" అన్నాడు శర్మ.

"మగాళ్ళాడపేర్లతో కథలు రాస్తే వ్యాకరణం తప్పులు తప్పవు కానీ—నువ్వు కాసేపు నోరు మూసుకుని

నన్ను మాట్లాడనీ. లేకపోతే ఒక నిజం అబద్ధంగా మారి పోతుంది—" అన్నాడు శాస్త్రి.

"మీరు నవలలు చదువుతారా?" అంది శశిరేఖ.

"చదువుతాను. అందులోనూ తెలుగువి. మళ్ళీ అందులో యెక్కువగా కిరణ్మయివి చదువుతాను...."

"మీ అభిరుచి నాకు నచ్చింది. నేను మిమ్మల్నే శాస్త్రి అని పిలుస్తాను—" అంది శశిరేఖ.

"అందులో విశేషమేముంది? నేను నిజంగా నే శాస్త్రిని!"

"మనిషి గుర్తింపుకోసం పేరు పెట్టుకుంటాడు. కానీ పేరువల్ల అందరికీ గుర్తింపురాదు. నానోట పలికిన ప్రతి పేరూ మనిషికి గుర్తింపు తెచ్చింది—" అంది శశిరేఖ.

"ఇదికూడా పువ్వులోని డైలాగే—" అన్నాడు శాస్త్రి.

"మీరు నిజంగానే ఆ నవల శ్రద్ధగా చదివారు. మిమ్మల్ని తప్పకుండా శాస్త్రి అని పిలవాలి—" అంది శశిరేఖ.

"నా పేరుతో నన్ను పిలవడమే ఒక ఫేవర్ అన్నట్లు మాట్లాడుతుండేమిటి?" అనుకుంటూనే—"ఇంతకీ మీరు నన్నెందుకు పిలవాలనుకుంటున్నారు?" అన్నాడు శాస్త్రి.

"ఏదైనా అడగాలనుకుంటే మనిషిని పిలవాలికదా!"

"ఏమడగాలనుకుంటున్నారు?"

"పువ్వు...."

"పువ్వు మీరు చదివేశారుగా!"

"చదివితే మళ్ళీ చదవకూడదా?" అందామె.

"ఒకో నవల విడివిడిగా ఒకేసారి చదువుతూనే

పాఠకులు చెడిపోతున్నారు. అలాంటి దొంకే నవల రెండేసి సార్లు చదివితే పాఠకులు తాము చెడిపోవడమేకాక తమ స్నేహితుల్ని కూడా చెడగొట్టేస్తారు—" అన్నాడు శర్మ.

"శర్మా! నువ్వు చెడ్డావేమో—ముందు చెప్పు...."

"నేను నవలలు చదవను కాబట్టి చెడిపోయే అవకాశం లేదు నాకు—"

"అది కాదులే—నేను పువ్వు రెండుకాదు—మూడు సార్లు చదివాను. అందువల్ల నా మిత్రుడిగా నువ్వేమైనా చెడిపోయావా అనడుగుతున్నాను...."

శశిరేఖ చప్పట్లు కొట్టి—"మీ తెలివి అద్భుతం. నేను మిమ్మల్నే శాస్త్రి అని పిలుస్తాను—" అంది.

శాస్త్రి విసుగును మనసులోనే దాచుకొని—"పువ్వు నా దగ్గర లేదు—" అన్నాడు.

"మరెవరి దగ్గరుంది?"

"అది చెప్పి లాభంలేదు. మీరా పుస్తకం లైబ్రరీ నుంచి తెచ్చుకోండి—" అన్నాడు శాస్త్రి.

"అయ్యో! మీమీద కొండంత ఆశలు పెట్టుకున్నానే! వెతకబోయిన తీగ కాలికి తగులుతుందనుకున్నానే!" అంది శశిరేఖ బాధగా.

"సారీ—నేను లైబ్రరీకి వెళ్ళి ఆ పుస్తకం తెచ్చి పెట్టనా?" అన్నాడు శాస్త్రి.

"అయ్యో! అది లైబ్రరీలో వుండదు. నలుగురూ చదివే పుస్తకాలు లైబ్రరీల్లో కొనరని మీకు తెలియదా?"

"అయితే రెంటెడ్ షాప్సులోంచి తెచ్చిపెట్టనా?"

"కిరణ్మయి రాసేవి చౌకబారు నవలలు కావు—రెంటెడ్ షాప్సునుంచి తెచ్చిపెట్టడానికి...." అన్నది

శశిరేఖ.

"నేను తెస్తానుగా—...." అన్నాడు శాస్త్రి.

"అంటే కిరణ్మయి చౌకబారు నవల్లు రాస్తుందని ఋజువు చేస్తానంటారు. నాకు మీ దగ్గరున్న పుస్తకమే కావాలి...."

"చదువుకుందుకేదైతే నేం?" అన్నాడు శాస్త్రి.

"ఉత్తమ గ్రంథాల నుత్తమ సంస్కారం కలవారి దగ్గరే తెచ్చుకొని చదవాలి—" అంది శశిరేఖ.

శాస్త్రికి ఛాతీ ఉబ్బింది—"మీకసలు నా దగ్గరా పుస్తకమున్నదని ఎలా తెలుసు?"

"ఈ ఊళ్ళో ఆ నవల దొరకలేదు. ఉన్నవాళ్ళివ్వడం లేదు పోతుందన్న భయంతో! పబ్లిషర్సుకి రాస్తే పది కాపీలు ఆర్డరిచ్చినవారికే పుస్తకం పంపుతామంటున్నారు. నాతోపాటు అయిదారుగురు స్నేహితురాండ్రీ పుస్తకం కోసం ప్రయత్నిస్తున్నారు. ఆ సమయంలో రెండ్రోజుల క్రితం మీ స్నేహితుడి చేతిలో ఆ నవల చూశాను. అప్పుడు నేను మా యింటరుగుమీద వున్నాను. ఎంత దూరాన్నుంచైనా పువ్వును అట్ట చూసి గుర్తుపట్టేయగలను. పరుగున వచ్చి అడుగుదామంటే అమ్మ పక్క కుర్చీలోనే వుంది. అదీకాక మీరిద్దరూ హడావుడిగా వెళ్ళిపోతున్నారు...." ఆగిందామె.

"నాకు గుర్తొచ్చింది. నవల ధోరణిలో పడి నా మిత్రుడు ముఖ్య విషయాలేమీ పట్టించుకోకపోతే వళ్ళు మండి నవలను సముద్రంలో విసిరిపారేస్తానని బయల్దేరాను...."

"అప్పుడు నేను నవల నాలుగోసారి చదువుతున్నాను. నవలను కాపాడుకుందుకు నా మిత్రుణ్ణనుసరించాను—"

అన్నాడు శాస్త్రి.

"పువ్వుని పుస్తకంలో పెట్టి దాచుకోవాలిగానీ సముద్రంలోకి విసురుతుంటారా—ఎవరైనా?" అంది శశిరేఖ కోపంగా.

"నేను విసురుతుంటాను—" అన్నాడు శర్మ

"శాస్త్రిగారూ— మీరు పుస్తకాన్ని కాపాడుకున్నారా?" అంది శశిరేఖ

"కాపాడుకోలేకపోయాను...." అన్నాడు శాస్త్రి.

శశిరేఖ ముఖం ఎర్రబడింది—"అంత మంచి పుస్తకాన్ని సముద్రంపాలు చేసినవాణ్ణి, అలా చేస్తుండగా చూస్తూ ఊరుకున్నవాణ్ణి కూడా నేను క్షమించలేను—"

"మీ క్షమను కోరేవారిక్కడెవ్వరూ లేరు—" అన్నాడు శర్మ.

"నేనున్నాను—" అన్నాడు శాస్త్రి—"శశిరేఖగారూ! ఆ పుస్తకం సముద్రంలో పడకుండా నా ప్రాణాలకు తెగించి పోరాడాలనుకున్నాను. కానీ విధి బలీయం. అప్పుడే దారిలో మాకు హనుమాయమ్మగారెదురైంది-"

"హనుమాయమ్మగారంటే—పక్క వీధిలో ఉండే ఆమేనా?" అంది శశిరేఖ.

శాస్త్రి ఆమె ముఖంలోని నిరుత్సాహాన్ని చదువుతూ "అవును. ఆవిడే! ఆవిడ శర్మ చేతిలోని పువ్వును చూసి—బాబూ—ఒక్కసారి చదివిచ్చేస్తా—నాక్కావాలి—అనడిగి తీసుకుంది. సముద్రంలోకి విసరడంకంటే ఆవిడకివ్వడంవల్లనే తన లక్ష్యం నెరవేరుతుందని గ్రహించి శర్మ వెంటనే ఆ పుస్తకాన్నావిడకిచ్చేశాడు—" అన్నాడు.

"గోడకు కేసిన సున్నమైనా తిరిగిరావచ్చుకానీ హనుమాయమ్మగారిల్లు చేరిన పుస్తకం వెనక్కురాదు-" అన్నాడు శర్మ కసిగా.

"అయ్యో! అనవసరంగా మిమ్మల్ని శాస్త్రి అని పిలిచానే—" అంది శశిరేఖ.

"అనవసరమేమిటి? అదే నా పేరు...." అన్నాడు శాస్త్రి.

"శాస్త్రిగారూ — అంతమంచి పేరు పెట్టుకున్న మీరు నాకోసం హనుమాయమ్మగారింటినుంచి పువ్వు తెచ్చిపెట్టలేరా?" అంది శశిరేఖ.

శాస్త్రికి ఛాతీ మరింత ఉబ్బినా హనుమాయమ్మను గురుతు తెచ్చుకొని మాటిచ్చే ధైర్యం చేయలేకపోయాడు.

"శాస్త్రిగారూ — మాటివ్వండి ప్లీజ్—" అంది శశిరేఖ.

"నిలబెట్టుకోలేని మాటిచ్చి ప్రయోజనమేముంది?" అన్నాడు శాస్త్రి నిస్పృహగా.

"నాకోసం మాటిస్తే మీరు తప్పకుండా నిలబెట్టుకో గలుగుతారు. ఎదురింటి అమ్మాయిని. ముద్దుగా అడుగు తున్నాను. కాదనకండి—" అంది శశిరేఖ.

"ఇదీ పువ్వులోని డైలాగేనా?" అన్నాడు శర్మ చిరాగ్గా.

"బాగా ఊహించారే—" అంది శశిరేఖ మెప్పు కోలుగా.

## 2

శశిరేఖ వెళ్ళిపోగానే — "నువ్వాటే యేమిటో అనుకున్నాను. మన పాతిటాయనది నిజంగానే మా బిడ్డ శకునం. ఈపిల్లెవరూ మహాజిడ్డులా పట్టుకుని బోరు కొట్టే

సింది—" అన్నాడు శర్మ.

"అందమైన ఆడపిల్లను బోగసడం మన వయసుకు తగదు. పలకరించడానికే భయంవేసేది. అలాంటిదాంత సేపు కబుర్లు చెప్పుకున్నాం—మైము గంటలు సెకన్లలా గడిచిపోయాయి...." అన్నాడు శాస్త్రి.

"పుస్తకం తెచ్చిస్తానని ఆమెకు మాటిచ్చావు. ఏం చేస్తావు—ఎలా సాధిస్తావు?" అన్నాడు శర్మ.

"గొప్పవాళ్ళు స్వయంగా ఏదీ చేయరు. రాముడికి హనుమంతుడున్నట్లు నువ్వు నాకున్నావుగా" అన్నాడు శాస్త్రి.

"నేను నీకు సాయపడను—" అన్నాడు శర్మ.

"ఎందుచేత?"

"నన్ను హేళన చేసిన పిల్లకు నావల్ల ప్రయోజనం కలక్కూడదు. నా శత్రువుకు చేయూతకావాలనుకునే నీకూ సాయపడను—...."

"నిస్వార్థంగా స్నేహితుడికి సాయపడలేవా?"

"శాస్త్రీ—షటప్!" అంటూ శర్మ కోపంగా లేచి నిలబడ్డాడు.

"అయితే నువ్వెళ్ళు. నేను నా పని సానుకూలం చేసుకున్నాకే మళ్ళీ మనం కలుసుకుంటాం-" అన్నాడు శాస్త్రి.

"అంటే ఒకమ్మాయి గురించి మనం విడిపోతున్నాం" అన్నాడు శర్మ.

"కాదు—ఒక స్వార్థపరుడి కారణంగా-" అన్నాడు శాస్త్రి.

"నువ్వు స్వార్థపరుడివన్న విషయం నీ కెప్పటినుంచి తెలిసింది?"

శాస్త్రి మాట్లాడలేదు. అతడు పుష్ప, హనుమాయమ్మ గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

"శాస్త్రీ! పుస్తకాలు చదవడం మంచిదే.... కానీ అది వ్యసనంగా పరిణమించకూడదు. నువ్వు చదువుతున్న నవలలు నిన్ను వ్యసనపరుడిగా మార్చుతూంటే చూడలేక పోతున్నాను. అందుకే హెచ్చరిస్తున్నాను. పుస్తకాల వ్యసనంలోపడ్డ పిల్లతో స్నేహంకూడా మంచిదికాదు. నా మాట విను...." అన్నాడు శర్మ.

"వినను—" అన్నాడు శాస్త్రి.

"అయితే నేను వెళుతున్నాను ..."

"నీ యిష్టం——...."

శాస్త్రి చూస్తూండగా శర్మ వెళ్ళిపోయాడు. కాసేపు శూన్యంలోకి చూసి తనూ లేచి నిలబడ్డాడు. ఏదో నిర్ణయానికి వచ్చినవాడిలా అతడు చకచకా అడుగులు వేశాడు.

కాసేపటికి హనుమాయమ్మ ఇంటిముందున్నాడు.

హనుమాయమ్మది చాలా పెద్ద యిల్లు.

పురాతనకాలపు ఇల్లది.

అందులో ఓ పెద్ద హాలుంటుంది. చుట్టూ పదహారు చిన్న చిన్న గదులుంటాయి.

అంతింట్లోనూ ఆమె ఒక్కర్తే ఉంటోంది.

ఆమె వయసు యాభైకీ అరవైకీ మధ్య ఉంటుంది. ఆమెకు భర్త వదిలిన ఆస్తి బాగా వుంది.

ఇంటి చుట్టూ తోట ఉంది. ఆ తోటను చూడ్డానికిద్దరు మాలులున్నారు. ఇల్లు రోజూ శుభ్రంచేసి వెళ్ళడానికిద్దరు పనివాళ్ళున్నారు.

హనుమాయమ్మ తన వంట తనే చూసుకుంటుంది.

హనుమాయమ్మ ప్రత్యేకత యేమిటంటే-ఆమె ఇట్లో దొరకని తెలుగుపుస్తకముండదు. వచ్చిన ప్రతి నవలా ఆమె కొంటుంది. ఈ రోజుల్లో వస్తున్న నవల లిన్నీ అన్ని కాదు. అంటే ఆమె యింట్లో యెంత పెద్ద గ్రంథాలయ ముంటుందో ఊహించవచ్చు. ఆమె పుస్తకాలు కొంటుంది. సేకరిస్తుంది. తను ఇతరులనుంచి తీసుకున్న పుస్తకం తిరిగివ్వదు. పొరపాటునకూడా ఇతరులకు తన పుస్తకం ఇవ్వదు.

తనింటికి వచ్చిన వారిని పుస్తకాలు చదవనిస్తుందని శాస్త్రి విన్నాడు.

ఆమెకు డబ్బుంది. పుస్తకాలు కొనే అలవాటుంది. అయినా ఇలా ఎందుకు ఇతరుల పుస్తకాలు కాజేస్తుందో శాస్త్రికి అర్థంకాలేదు. చెప్పాలంటే శాస్త్రి ఆమె అలవాటుని గురించి పెద్దగా పట్టించుకోలేదు. అతడింతకంటే పెద్ద సమస్యల గురించి ఆలోచిస్తున్నాడు. ఇప్పుడైనా అందమైన శశిరేఖ ముద్దుగా అడిగింది కాబట్టి హనుమాయమ్మ గురించిన ఆలోచన వచ్చింది కానీ— లేకుంటే ...

శాస్త్రి హనుమాయమ్మ యింటి గేటుతీసి లోపలకు వచ్చి మళ్ళీ గేటు వేసేశాడు. చకచకా అడుగులు వేసుకుంటూ ముందుకు వెళ్ళాడు.

"ఎవరూ?" అన్న కేక వినిపించి అటు చూశాడు.

తోటలో కూర్చుని ఉంది ఓ కుర్చీలో హనుమాయమ్మ. ఆమెకెదురుగా ఓ ఖాళీ కుర్చీ ఉంది.

శాస్త్రి ఆమెను సమీపించి—"నా పేరు శాస్త్రి!" అన్నాడు.

"కూర్చో!" అందామె.

"ఈ సమయంలో మీరు ఖాళీగా ఉంటారనుకోలేదు. ఏదో పుస్తకం చదువుతూంటారనుకున్నాను —" అన్నాడు శాస్త్రి.

"నేను పుస్తకాలు చదవను-" అంది హనుమాయమ్మ.

"మీ ఇంట్లో చాలా పుస్తకాలున్నాయని విన్నాను" అన్నాడు శాస్త్రి.

"నువ్వెందుకొచ్చావు?" అంది హనుమాయమ్మ.

శాస్త్రి వెంటనే—"నా పుస్తకం ఒకటి మీరు తీసుకున్నారు—" అన్నాడు.

"ఆ పుస్తకం నువ్వు చదివేశావా?" అంది హనుమాయమ్మ.

"ఊఁ."

"అయితే ఇంకా నీకు దాంతో పనేమిటి?"

శాస్త్రి తడుముకోకుండా—"మరోసారి చదవాలి-" అన్నాడు.

"అయితే ఇక్కడే కూర్చో—" అంటూ హనుమాయమ్మ లోపలకు వెళ్ళి కాసేపట్లో వెనక్కు వచ్చి—"నాతో పద—" అంది.

ఇద్దరూ లోపలకు వెళ్ళారు.

హనుమాయమ్మ అతడినో గదిలోకి తీసుకుని వెళ్ళింది.

ఆ గదిలో—

ఓ కుర్చీ—....

కుర్చీ ముందోక బల్ల....

బల్లపైన అద్దపు చట్రం బిగించి వుంది. లోపల ట్యూబ్ లైటు వెలుగుతోంది. ఆ చట్రంలోనే ఓ పుస్తకముంది.

"చదువుకో— పేజీలు తిప్పాలనుకుంటే బల్లకింద నీ

చేయి పట్టేటంత కన్నముంది....” అంది హనుమాయమ్మ.

శాస్త్రి ఆశ్చర్యంగా ఆ ఏర్పాటు చూశాడు. తను పుస్తకం చదవగలడు కానీ అక్కణ్నించి తీసుకుని వెళ్ళలేడు.

వెళ్ళిచూస్తే—ఆ నవల పువ్వు!

“మీకు బాగా గుర్తుందే! నా దగ్గర తీసుకున్న నవల యిదే!” అన్నాడు శాస్త్రి.

“పుస్తకాలు చదవనివాళ్ళెప్పుడూ మంచి జ్ఞాపక శక్తిని కలిగి ఉంటారు. తెలివి కూడా వారిదే ఎక్కువ-” అంది హనుమాయమ్మ.

“నా పుస్తకం నాకు వెనక్కు కావాలి-” అన్నాడు శాస్త్రి.

“ఎప్పుడు కావాలంటే అప్పుడు వచ్చి చదువుకో— నీ పుస్తకమిక్కడే ఎక్కువగా సద్వినియోగమవుతుంది” అంది హనుమాయమ్మ.

“నా పుస్తకం నా యింట్లో ఉండాలి—”

“అయితే ఇంకోటి కనుక్కో—”

“ఇది నేను కొనుక్కున్న పుస్తకమే—” అన్నాడు శాస్త్రి.

హనుమాయమ్మ నవ్వి-“ఇది నువ్వు కొనుక్కున్నప్పటికీ నీ చేయి దాటిపోయింది. పుస్తకం వనితా విత్తం పర హస్తం గతం గతః—” అంది.

“నేనిప్పుడిక్కణ్నించి ఈ పుస్తకం తీసుకొని పోగలను—”

“అప్పుడు నేను పోలీసు రిపోర్టిస్తాను—”

“ఏమని?”

“నా పుస్తకం నువ్వు తీసుకుపోయావని!”

"అందుకు సాక్ష్యాలు?"

"సాక్ష్యాలు కదలకుండా నువ్వు పుస్తకం తీసుకెళ్ళ లేవు—" అంది హనుమాయమ్మ గంభీరంగా.

"అదికాదు—నేనీ పుస్తకాన్ని మీకిచ్చానని చెబు తాను—"

"తెలిసిన వారెవ్వరూ నాకు పుస్తకాలివ్వరు. నువ్వు నాకు తెలిసినవాడివి. కోర్టులో ఈ రెండూ నిరూపించ బడుతాయి. నువ్వే ఓడిపోతావు—"

హనుమాయమ్మ చాలా మొండిదని శాస్త్రికి అర్థ మయింది.

"ఏమైనాసరే—నాకీ పుస్తకం కావాలి—" అన్నా డతడు.

"ఎందుకో చెప్పు. నీ సమస్య తీరే ఉపాయం చెబు తాను—"

"నా పుస్తకం నేను తీసుకోవడం సమస్యవుతుందా?" అన్నాడు శాస్త్రి.

"పుస్తకాలకోసం నేనేమైనా చేయగలను. ఈ చుట్టుపక్కల నాకు చాలా పేరు, పలుకుబడి ఉన్నాయి. నాకు చేరిన యెవరి పుస్తకమైనా నా పుస్తకమే అవుతుంది. మాటిమాటికీ నా పుస్తకం నా పుస్తకం అని నన్ను రెచ్చగొట్టకు...."

శాస్త్రి చేసేదిలేక తన సమస్య చెప్పుకున్నాడు.

"ఈ మాత్రం దానికి నువ్వింత హడావుడి చేయాలా? నువ్వా అమ్మాయికి చెప్పు నేను తప్పక ఇక్కడ పుస్తకం చదువుకోనిస్తాను. అయితే ఒకరోజు ముందుగా చెప్పాలి" అంది హనుమాయమ్మ.

"ఈ సదుపాయమున్నట్లు శశిరేఖకు తెలియదా?"

"తెలుసో తెలియదో నాకనవసరం. నా దగ్గర పుస్త కాలు చదువుకుందుకు కనుక్కుని వెతుక్కుంటూ వస్తారు" అంది హనుమాయమ్మ.

శాస్త్రి ఆకర్ణించి సెలవుతీసుకున్నాడు.

## 3

అంతా విని — "ఏడిచినట్లుంది — ఒక ఆడదానికి భయపడి వెనక్కొచ్చేశావా? నీ పుస్తకం నువ్వు తెచ్చుకోలేకపోతే అది నీకే కాదు. నాకూ అవమానమే! మన మేదో ఒకటి చేయాలి—" అన్నాడు శర్మ.

"పుస్తకాలనామె స్టీలు బీరువాలో ఉంచింది. అన్నింటికీ తాళాలున్నాయి. ఆమె యింట్లో దొంగ ప్రవేశిస్తే వెంటనే పోలీసుస్టేషన్లో తెలుస్తుంది...."

"అయితే మాత్రం?" అన్నాడు శర్మ.

"చూడు శర్మా! చూస్తూ చూస్తూ పుస్తకాలకోసం ఎవరూ జైలుపాలు కావాలనుకోడు. ఆమె యింట్లో పుస్తకాలు తప్ప ఇంకేమీ లేవు. ఆమె ఏ నేరస్థురాలో అయితే అంతు తేల్చేద్దును. కానీ పుస్తకాలు సేకరిస్తూన్న నేరానికామెపైన పగబట్టలేను. నిజానికి పుస్తకం నా దగ్గరకంటే ఆమెవద్ద ఉండడమే ప్రయోజనకరం. పది మందీ చదువుతున్నారు...."

"అదే—అదే పెద్ద ప్రమాదం. పువ్వులాంటి పుస్తకాన్ని నీలాంటి ఒక్కడితో సరిపెట్టక ఎందరిచేతనో చదివిస్తోందామె. లాభంలేదు....ఆమె గ్రంథాలయాన్ని పట్టుపట్టాలి..." అన్నాడు శర్మ.

"ఇందుకు నేను నీకు సహకరించను...." అన్నాడు శాస్త్రి.

"నీ సహకారంతో నాకు నిమిత్తంలేదు.." అన్నాడు

శర్మ.

రాత్రి భోజనాలు చేసి మిత్రులిద్దరూ పడుకున్నారు. ఒక రాత్రివేళ లేచిచూస్తే శాస్త్రికి గదిలో శర్మ కన పడలేదు.

తలుపులు దగ్గరగా వేసి ఉన్నాయి.

# 4

తెల్లవారినా శర్మ గదికి తిరిగిరాలేదు. అతడు హనుమాయమ్మ యింటికే వెళ్ళి ఉంటాడని ఊహించినా యింతసేపూ ఏం చేస్తున్నాడో శాస్త్రికి తెలియలేదు. అయితే హనుమాయమ్మ చేతిలో శర్మకు ప్రమాదం మాత్రముండదని అతడి నమ్మకం. అందువల్ల అతడు తన మిత్రుడి గురించి ఆలోచించడం మాని శశిరేఖ విషయమై దృష్టి కేంద్రీకరించాడు.

ఎదురిల్లే శశిరేఖది.

ఎత్తయిన యిల్లది.

ఆ యింటి అరుగుమీద శశిరేఖ అన్న కూర్చుని ఉంటాడు.

అతడిది ఆరడుగుల విగ్రహం. కండలుతిరిగి ఉంటాడు. మనిషి శశిరేఖకంటే బాగుంటాడు కానీ కోపిష్టి. తీరి కూర్చుని దారిపోయేవాళ్ళతో గొడవ పెట్టుకుంటాడు. అందులో సగం గొడవ తన చెల్లెలి గురించే!

చాలామంది శశిరేఖవైపు కన్నెత్తి చూడ్డానికి భయ పడతారంటే అందుకూ అన్నే కారణం.

శాస్త్రి కూడా శశిరేఖను బాగా తిగా పట్టించుకోకపోవ డానికి అన్నే కారణం. లేకపోతే అతడికాడపిల్లల్ని పలకరించి కబుర్లు చెప్పడం సరదాయే! అందులో తప్పుందని అతడనుకోడు. మనసులో దురుద్దేశం లేనప్పుడు

అవతలివాళ్ళను మోసం చేయనప్పుడు-ఆడపిల్లతో స్నేహం చేయడంలో తప్పేముంది.

చెప్పాలంటే శాస్త్రి శశిరేఖ అన్న కండల్ని చూసి భయపడ్డంలేదు. క్షణాలమీద అతణ్ని మట్టి కరిపించ గలనని అతడి నమ్మకం. అతడు భయపడుతున్నది ఆమె అన్న నోటికి. ఆ నోటివల్ల తను నలుగురి నోళ్ళలోనూ పడాల్సివస్తుంది.

కుర్రాళ్ళు బుద్ధిమంతులని ఆ చుట్టుపక్కల వాళ్ళకు పేరుంది. ఆ పేరు పోగొట్టుకోవడం అతడికిష్టంలేదు. అదీ ఈ తిప్పుణ్యానికి.

ఆరోజు కూడా శశిరేఖ అన్న కూర్చుని ఉన్నాడు- ఇంటి అరుగుమీద!

శశిరేఖనెలా కలుసుకోవాలా అని చూస్తున్నాడు శాస్త్రి.

అన్న అరుగుమీదుండగా ఆమె కిటికీవద్దకూడా రాదు.

శాస్త్రి త్వరగా కాలకృత్యాలు తీర్చుకున్నాడు.

సరిగ్గా తొమ్మిదింటికి శశిరేఖ బయటకు వస్తుంది. అదామె కాలేజీకి బయల్దేరే సమయం. ఆమె బయల్దేరాక తను బయల్దేరితే శశిరేఖ అన్న అతడిని ఆపి కబుర్లు మొదలుపెడతాడు.

లోకంలో కుర్రాళ్ళందరికీ తన చెల్లెలి వెంటపడడమే పని అనీ—వాళ్ళనెలాగో అలా ఆపడానికే తనున్నాడనీ శశిరేఖ అన్న భావిస్తాడు.

అందుకే శాస్త్రి తొమ్మిదికైదునిముషాలుండనగానే ఇంట్లోంచి బైటకు వచ్చాడు. ఆ వీధి దాటి శశిరేఖ వెళ్ళే దారిలో కాశాడు.

శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు!

కాసేపటికి శశిరేఖ ఆ దారిలో వచ్చింది.

శాస్త్రి వెంటనే ఆమెను కలుసుకోలేదు. మరో సందు మళ్ళేదాకా ఆగి అతడామెను పలకరించాడు.

శశిరేఖ గాబరాపడి చుట్టూ చూసింది.

ఆ వీధిలో జనమాట్టే లేరు. కానీ అలా మాట్లాడుకోవడం ఆమెకిబ్బందేనని శాస్త్రి గ్రహించి—"ఒక్క అయిదు నిమిషాలు-పక్క వీధిలో పార్కుంది. వస్తారా?" అన్నాడు.

ఆమె బదులివ్వలేదు. పక్క వీధిలోకి తిరిగింది.

కాసేపట్లో యిద్దరూ పార్కులో ఉన్నారు.

"చెప్పండి!" అంది శశిరేఖ బెదురుగా.

"మీరు వణుకుతున్నారు. నాకేమో నేను తుంటరి వాడిలా కనబడుతున్నానా అని బెంగగా ఉంది—" అన్నాడు శాస్త్రి.

శశిరేఖ కిసుక్కున నవ్వి—"నా భయం అన్నయ్య గురించి. నేనిలా కలుసుకుని మీతో మాట్లాడినట్లు తెలిసిందంటే—వాడు నానారభసా చేసాడు—" అంది.

"అన్నయ్య భయంలేకపోతే నాతో మాట్లాడ్డానికి మీకిబ్బందిలేదా?" అన్నాడు శాస్త్రి.

"కాబట్టే నిన్న సాయంత్రం నేను బీచిలో మాట్లాడేను—"

"సాయంత్రాలెందుకు మీ అన్నయ్య భయముండదు?"

"ఎందుకంటే వాడు సాయంత్రాలు పుస్తకాలు చదువుకుంటాడు కాబట్టి!" అంది శశిరేఖ.

"ఎక్కడ?"

"హనుమాయమ్మ గారింట్లో—...."

శాస్త్రి తెల్లబోయి — "హనుమాయమ్మగారింట్లో పుస్తకాలు చదువుకునే సదుపాయముందని మీకు తెలుసా?" అన్నాడు.

"తెలియకేం—" అంది శశిరేఖ.

"ఇది చెబుదామనే నేను మీ దగ్గరకు వచ్చాను. పుచ్వ్య ఆవిడింట్లో ఉంది. మీరక్కడికి వెళ్ళి చదువుకో వచ్చు—...."

"కుదరదు...." అంది శశిరేఖ.

"ఎందుకని?'

"అన్నయ్య నన్నక్కడికి వెళ్ళొద్దని ఖచ్చితంగా చెప్పేశాడు ..."

"ఎందుకట?"

"ఎందుకని అడగడానికి వీల్లేను. వాడు చెప్పినట్లు చేయాల్సిందే—"

"చిత్రంగా ఉందే—" అంటూ శాస్త్రి ఆమెకు హనుమాయమ్మింట్లో జరిగింది చెప్పి—"మీరక్కడకు వెళ్ళి చదువుకోవడంలో తప్పులేదని నాకనిపించింది—" అన్నాడు.

"అయితే నాకా పుస్తకం తెచ్చిపెట్టడం మీవల్ల కాదంటారు!"

శాస్త్రి ఆమెవైపు చూశాడు. నిరుత్సాహం ఆమె కళ్ళలో కొట్టొచ్చినట్లు కనబడుతోంది.

"ఎందుకు కుదరదు? కానీ...." అతడాగాడు.

శశిరేఖ కూడా సాలోచనగా—"ఒక పని చేద్దాం. సాయంత్రం మీరు బీచికి రండి. నిన్నటిచోటే మళ్ళీ కలుసుకుందాం—" అంది.

"ఎందుకు? అన్నాడు శాస్త్రి.

"పువ్వు గురించి మాట్లాడుకుందాం...."

"ఎందుకు?"

"ఒక మంచి నవల గురించి మాట్లాడుకుందామంటే ఎందుకంటారేమిటి? మీరు నిజంగా కిరణ్మయి అభిమానులేనా?" అంది శశిరేఖ చిరాగ్గా.

"మీరిలా రమ్మన్నారు కాబట్టి కిరణ్మయి అభిమానినే—"

"నవల చదివే అవకాశం లేదింక. ఆ నవల మొదట్నుంచి చివరిదాకా గుర్తుంది నాకు. ఇద్దరం నవలగురించి మాట్లాడుకుంటూ మర్చిపోయినవి గుర్తుచేసుకుంటూంటే చాలా గొప్ప అనుభవం—"

"అలాంటి అనుభవం యింతవరకూ నాకూ లేదు—"

"నేనూ, హేమలతా ఇలా నవలల గురించి చర్చించుకునేవాళ్ళం. ఇప్పుడు వాళ్ళ నాన్నకు ట్రాన్స్ఫరై ఇంకో ఊరెళ్ళిపోయిందది. ఇన్నాళ్ళకి మీరు దొరికారు."

"థాంక్స్—" అన్నాడు శాస్త్రి.

ఇద్దరూ అప్పటికి విడిపోయారు.

## 5

మధ్యాహ్నం, సాయంత్రం గడిచిపోయినా శర్మ ఇంటికి రాలేదు. శాస్త్రి కాస్త కలవరపడ్డాడు కానీ బీచివద్ద శశిరేఖను కలుసుకొని మాట్లాడబోతున్నానన్న మధురోహ అతడిని చాలావరకూ మరిపించింది.

అనుకున్న ప్రకారం ఇద్దరూ బీచివద్ద కలుసుకున్నారు. సంభాషణ చాలాసేపు నవల గురించే నడిచింది.

శాస్త్రికి విసుగ్గా వచ్చి "నవల గొప్పదే కానీ ఇంక దాని గురించి మాట్లాడాలని లేదు—" అన్నాడు.

"ఎందుకని?"

"నవల గురించి ఆలోచించడంకంటె మీతో మాట్లాడుతూంటే ఆ అనుభవం చాలా గొప్పగా ఉంది. నాకు మీ గురించి తెలుసుకోవాలనుంది...."

శశిరేఖ అతడివంక అదోలా చూసి—"ఈ విషయం ఇంత ఆలస్యంగా చెప్పారేం?" అంది.

"మిమ్మల్ని నిరుత్సాహపర్చడం యిష్టంలేక!"

"నిజానికి మీరు నవల గురించి మాట్లాడుతున్నప్పుడే నేను నిరుత్సాహపడ్డాను. టాపిక్ మారితే బాగుండునని నాకూ అనిపించింది—...."

శాస్త్రి ఆశ్చర్యంగా—"నిజంగా?" అన్నాడు.

"ఊఁ" అంది శశిరేఖ.

"అయితే మనం టాపిక్ మార్చాలి...."

"మీరే మంచి టాపిక్ చెప్పండి..."

"యువతీయువకులకు మంచి టాపిక్ ఒక్కటే—ప్రేమ!"

"అదే చెప్పండి—" అంది శశిరేఖ.

"ప్రేమ చాలా గొప్పది. ప్రేమ అద్భుతమైనది. ప్రేమను మించినదేదీ ఈ ప్రపంచంలో లేదు—...."

"ప్రేమ ఎలా ఉంటుందో చెప్పరూ?" అంది శశిరేఖ.

"అద్దంముందు నిలబడాలి...." అన్నాడు శాస్త్రి.

"ఛీ—...." అంది శశిరేఖ.

"ఏమయింది?" అన్నాడు శాస్త్రి కంగారుగా.

"మీరన్నీ పుస్తకాల్లో డైలాగులే చెబుతున్నారు. హీరోవైతే ఫరవాలేదు విలనువి చెబుతున్నారు. ఈ డైలాగు చెప్పి విలన్ హీరోయిన్ని మోసం చేస్తాడు. గుర్తులేదా?" అంది శశిరేఖ.

"అవునవును. పొరపాటైపోయింది...." అన్నాడు

శాస్త్రి.

"పొరపాటు దిద్దుకోండి!...."

శశిరేఖవైపు సూటిగా చూశాడు శాస్త్రి. ఆమె ఆరాధనాభావంతో అతడివంక చూస్తోంది. శాస్త్రి వెంటవెంటనే భయం భయంగా—"మీరు కొంపదీసి నిజంగా నన్ను ప్రేమిస్తున్నారా?" అన్నాడు.

"ఏం—ప్రేమిస్తే తప్పా?"

"ప్రేమించడం తప్పుకాదు. కానీ నన్ను ప్రేమించడం...." శాస్త్రి తన్నుతాను చిన్నబుచ్చుకోలేక నసిగాడు.

"మీరు అచ్చం పుస్తకాల్లో హీరోలా ఉన్నారు. మీకు గుర్తుందో లేదో పుస్తకాల్లో హీరోయిన్ ఎదురుగా ఉన్న హీరోను గుర్తించక మోసగాడైన విలన్ చుట్టూ తిరిగి ఆలస్యంగా తన తప్పు గ్రహిస్తుంది. నేనా నవల చదివాను కాబట్టి అలాంటి తప్పు చేయను. నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. నా ప్రేమను మీరు కాదనకండి...."

శాస్త్రి తెల్లబోయి—"అయాం సారీ శశిరేఖా! ఇప్పట్లో పెళ్ళిచేసుకునే ఉద్దేశ్యం నాకు లేదు—" అన్నాడు.

"మీకోసం యెంతకాలమైనా ఆగుతాను—" అంది శశిరేఖ.

"అయితే మరొక్కరోజు ఆగండి. నా నిర్ణయం చెబుతాను—...." అన్నాడు శాస్త్రి.

ఆ రోజుకిద్దరూ విడిపోయారు.

## 6

శర్మ ఒక్కడూ ఉన్నాడాకదిలో—అతడు మాటి మాటికీ పైకు చూసుకుంటున్నాడు.

రాత్రి అతడు హనుమాయమ్మింట్లో చొరబడ్డాడు. ఓ గదిలో దూరగానే తలుపులు మూసుకున్నాయి. తెరవడం అతడివల్ల కాలేదు.

గదికి అటాచ్డ్ బాత్ ఉంది.

అతడు కాలకృత్యాలు తీర్చుకొని వచ్చేసరికి గదిలో ఉతికిన బట్టలు, టిఫను సిద్ధంగా ఉన్నాయి.

ఆశ్చర్యపడుతూనే తిన్నాడతడు.

తలుపు తెరవకుండానే చిన్న సందులోంచి మధ్యాహ్న భోజనంకూడా అతడికందింది.

అక్కడ తన నెవరు యెందుకు బందీ చేశారో అతడి కర్థంకాలేదు. అలాగే ఆ గదిలో సాయంత్రందాకా కాలక్షేపం చేశాడు.

ఇప్పుడు సమయం అయిదుగంటలు.

ఉన్నట్లుండి గది తలుపులు తెరుచుకున్నాయి.

లోపలకు హనుమాయమ్మ వచ్చింది.

"మీరేనా నన్ను బందీని చేశారు!" అన్నాడు శర్మ ఆశ్చర్యంగా.

"అవును—" అంది హనుమాయమ్మ.

"ఎందుకు?"

"నువ్విక్కడికెందుకొచ్చావో చెప్పు—"

శర్మ చెప్పాడు.

"నాకు తెలుసు—అందుకే నిన్ను బందీని చేశాను."

"నా గురించి మీకెలా తెలుసు?"

"రమ చెప్పింది...."

"రమ ఎవరు?"

"నిన్ను ప్రేమించిన అమ్మాయి...."

శర్మ కాసేపాలోచించాడు. రమ అతడికి గుర్తుకొచ్చింది. బజార్లో తనామెను చాలాసార్లు చూశాడు. ఒకసారి తనే శర్మను పలకరించింది. అభిమానం ఒలకబోసింది. శర్మకామెతీరు నచ్చలేదు.

"రమ మీకెలా తెలుసు?" అన్నాడు శర్మ.

"ప్రేమికులను దగ్గర చేసే ఉపాయం నాకు తెలుసు" అంది హాసమాయమ్మ.

"అంటే?"

"వయసులో స్త్రీ పురుషులకు పరస్పరం తోడు కావాలి. అందుకే పెద్దలు పెళ్ళి ఏర్పాటు చేశారు. ఒకనాడీ పెళ్ళిళ్ళు పెద్దలు నిర్ణయించేవారు. వారి నిర్ణయాల వెనుక అంతులేని అనుభవముండేది. అందువల్ల ఆ పెళ్ళిళ్ళు జయప్రదమయ్యేవి. ఇప్పుడు పూర్వంమీద కుర్రాళ్ళు స్వేచ్ఛగా తిరుగుతున్నారు. చాలామంది తమ పెళ్ళిళ్ళు తామే నిర్ణయించుకుంటున్నారు. కానీ అనుభవం లేక తొలిచూపుల్లోనే యేర్పడిన అభిప్రాయాలకు కట్టుబడిపోతున్నారు. ఆ తర్వాత పెళ్ళిళ్ళు దెబ్బతింటున్నాయి. అందుకని నేను మా యింట్లో పెళ్ళికిముందే ప్రేమికులు కలుసుకునే యేర్పాటు చేస్తున్నాను...." అందామె.

"ఎలా?" అన్నాడు శర్మ.

"ఈ రోజుల్లో యువతరానికి పుస్తకాలంటే పెద్ద క్రేజ్ వుంది. కబుర్లెన్ని చెప్పినా వాటి ఖరీదు చాలా ఎక్కువ కాబట్టి కొని చదవగలవారి సంఖ్య తక్కువ. ఎక్కడా దొరకని పుస్తకాలు నేను ముందు కొనేస్తాను. ఇతరులకెక్కడా దొరక్కుండా నేను వాటిని సేకరిస్తాను. పుస్తకాలు చదవడానికి అద్దెకూడా లేదు. అందువల్ల

చాలామంది నా దగ్గరకు పుస్తకాలు చదువుకుందుకు వస్తారు. ఆ వచ్చేవారిలో ఆడపిల్ల లెక్కువ..." అని ఆగింది హనుమాయమ్మ.

"అయితే?" అన్నాడు శర్మ.

"ప్రతి ఆడపిల్లకూ కొందరు ప్రేమికులుంటారు. వాళ్ళలో కొందరినామె పలకరిస్తుంది. కొందర్ని చూడగానే చీదరించుకుంటుంది. అలా చీదరించుకోబడ్డ వాళ్ళు నన్నాశ్రయిస్తారు. నేను వారి దగ్గర ఫీజు తీసుకుంటాను. వారికా అమ్మాయితో మాట్లాడే అవకాశం కలగజేస్తాను...."

"అదెలా?"

"పుస్తకాలు చదువుకుందుకు పదహారు ప్రత్యేకమైన గదులున్నాయీ యింట్లో — ఒకో గదిలో ఒకో పిల్ల మాత్రమే ఉంటుంది. చదువుకుందుకు గంటమాత్రం టైము. సరిగ్గా నలభై నిముషాలయ్యాక ఆమె గదిలోకి ప్రియుణ్ని పంపిస్తాను—" అంది హనుమాయమ్మ.

"ఇది చాలా ఘోరం. పుస్తకాల పేరుతో మీరిక్కడ వ్యభిచారం నడుపుతున్నారన్నమాట...." అన్నాడు శర్మ కోపంగా.

"తొందరపడి తప్పుగా అర్థంచేసుకోకు. ఇక్కడ కుర్రాళ్ళు మర్యాద మితిమీరితే మక్కెలిరగదన్నడానికేర్పాటుంది. నేను ముందుగానే కుర్రాడి మంచిచెడ్డలు విచారిస్తాను. అప్పుడే లోపలకు పంపుతాను...."

"అమ్మాయిందుకొప్పుకుంటుందా?" అనడిగాడు శర్మ.

"ఆడపిల్లలకీ రోజుల్లో వున్న పుస్తకాల పిచ్చి గురించి నీకు తెలియదులే....అవి చదవడం కోసం ఇష్టం లేని మనిషితో కాసేపు మాట్లాడ్డానికి వాళ్ళకభ్యంతర

ముండదు. ఎలాగో అలా నవల పూర్తి చేయాలి. అదీ వారి ధ్యేయం. ఆ విధంగా రోజుకిరవై నిముషాలు ఇష్టంలేని మనిషితో సంభాషించేసరికి—ఒకరినొకరు సరిగ్గా అర్థం చేసుకోవడం జరుగుతుంది. ఆ విధంగా గత నాలుగేళ్ళలోనూ నలభై జంటలు పెళ్ళిళ్ళు చేసుకున్నాయి. ఆరుగురు జంటలు కావాలనుకుని మనసు మార్చుకున్నారు. యువతరానికి నా గ్రంథాలయం ఒక వరం...." అంది హనుమాయమ్మ.

"ఇది బయటివారికి తెలిస్తే?"

"ఊరికే పుస్తకాలు చదువుకోనిస్తాను. అందువల్ల పుస్తకాలు చదువుకుందుకు చాలామంది ఆకర్షితులవుతున్నారు. సాధారణంగా యువతీ యువకులు ఇక్కడ జరిగే విశేషం బయటకు చెప్పుకోరు. చెప్పుకున్నా దానికి ప్రచారంరాదు. ప్రచారం వచ్చినా అందుకు ఋజువుండదు. ఇక్కడ అవినీతికి తావులేదు. యువతీ యువకుల పుస్తకాల క్రేజ్—బలహీనతగా మారితే అది నేనుపయోగించుకొని వారిలో పరస్పరావగాహనకు సహకరిస్తున్నాను. అందువల్ల ఆర్థికంగా కంటె మానసికంగా నాకు లభిస్తున్న తృప్తి ఎక్కువ" అంది హనుమాయమ్మ.

"ఆడపిల్లలకు పుస్తకాలపట్ల క్రేజ్ ఉన్నమాట నిజమా?" అన్నాడు శర్మ నమ్మలేనట్లు.

"క్రేజ్ మాత్రమే కాదు. నవలలవల్ల వారు ప్రభావితులై అందులోని పాత్రల్లా ప్రవర్తించాలనుకుంటున్నారు. చూసిన మనిషి గురించి యేమేమో ఊహించుకుని తప్పుడు అభిప్రాయాలకు గురవుతున్నారు. ఊహాలోని మనిషిని వాస్తవంలోకి తీసుకునివచ్చి యథార్థాన్ని వారికి తెలియచెప్పడానిక్కూడా నా గ్రంథాలయం ఉపయోగ

పడుతోంది. ఆ విధంగానే రమ అనే అమ్మాయి నిన్ను ప్రేమిస్తే నీకు పుస్తకాల క్రేజ్ లేకపోవడంవల్ల ఇక్కడకు రప్పించలేకపోయాను. శశిరేఖ అనే అమ్మాయి నీ స్నేహితుణ్ని ప్రేమిస్తే ఇక్కడ కుదరక బీచి దగ్గర కలుసుకోమని ఉపాయం చెప్పాను ..."

"అంటే శశిరేఖ మీ సలహామీదే మా శాస్త్రిని పలకరించిందన్నమాట....అయితే శాస్త్రికి పుస్తకాల పిచ్చివుంది. ఇక్కడెందుకు కుదరదన్నాడు?"

"శశిరేఖ అన్న నలుగురమ్మాయిలతో స్నేహాంకోరి తరచు యిక్కడికి వస్తున్నాడు. ఆ నలుగురిలో తన అభిరుచులకు తగిన అమ్మాయిని పెళ్ళిచేసుకోవాలని అతడనుకుంటున్నాడు. ఇక్కడికి అమ్మాయిలువస్తే వారిని కలుసుకోగోరే అబ్బాయిలుంటారనీ — అబ్బాయిలువస్తే వారిని కలుసుకోగోరే అమ్మాయిలుంటారనీ అతడికి తెలుసు. అందుకే తన చెల్లెల్నిక్కడకు రానివ్వకుండా కట్టుదిట్టం చేస్తున్నాడు. ఆ అమ్మాయి కాలేజీనుంచి ఫోన్ చేసి నా సలహా అడిగింది.." అంది హానమాయమ్మ.

"మీరు నిజమే చెబుతున్నారా?" అన్నాడు శర్మ.

హానుమాయమ్మ అతడికో చిన్న కాగితం యిచ్చి— "ఇందులో ఆరు అడ్రసులున్నాయి. అన్నీ ఈ ఊరివే! నువ్వు వారింటికి వెళ్ళి నా గురించి అడిగి తెలుసుకో— వారింట్లో నా ఫోటో ఒకటి ఉంటుంది దానికి పూజ కూడా చేస్తుంటారు వాళ్ళు ..." అంది.

"చాలా చిత్రంగా ఉంది—" అన్నాడు శర్మ.

"ఒక రోజంతా నిన్ను బందీగా ఉంచినందుకు నన్ను మన్నించు. ఆమాత్రం శిక్షలేకపోతే మళ్ళీ మళ్ళీ నా

యింట్లో మారాలన్న సరదా పుట్టవచ్చునుగదా!" అంది హనుమాయమ్మ.

"నేనీ అడ్రసులకు వెడతాను. మీ గురించి తెలుసుకుంటాను. మీరు చెప్పిందే నిజమైతే వచ్చి మీకు సాష్టాంగపడి వెడతాను. లేదూ మీ గ్రంథాలయాన్ని సర్వనాశనం చేస్తాను...." అన్నాడు శర్మ.

"నీ ప్రతాపం ఇంతవరకూ చూశానుగా—" అంది హనుమాయమ్మ.

"బ్రహ్మాస్త్రానికి కట్టుబడ్డాడని ఆంజనేయుణ్ని వేళాకోళం చేస్తే నష్టపోయినదెవరు? నాకు మీపై నిజంగా ఆగ్రహం వచ్చేవరకూ మీరు నా అసలైన ప్రతాపం చూసినట్లు కాదు—" అన్నాడు శర్మ.

"అయితే యిప్పుడే సాష్టాంగపడి వెళ్ళు. మళ్ళీ యిక్కడకు రావాల్సిన పని ఉండదు...." అంది హనుమాయమ్మ.

"ఫరవాలేదు. మళ్ళీ వస్తాను. శ్రమేం లేదు నాకు" అని—"అన్నట్లు మీరు రమ గురించి చెప్పారు. మీ గ్రంథాలయానికి వెళ్ళి పుస్తకాలు చదవమని ఆమె నాకు సలహా యిచ్చింది. ఆ తర్వాత నాకు మళ్ళీ కనబడలేదు- ఆమె యేమయింది?" అనడిగాడు శర్మ.

"ఏమవుతుంది? ఈ ఊళ్ళోనే ఉంది. బొత్తిగా పుస్తకాలు చదివే అభిరుచి లేనివాణ్ని ప్రేమించడం పెద్ద తప్పని గ్రహించి నిన్ను మనసులోంచి తుడిచిపెట్టేసింది!" అంది హనుమాయమ్మ.

సరిగ్గా మూడుగంటల తర్వాత శర్మ తిరిగివచ్చి హనుమాయమ్మకు పాదాభివందనం చేసి వెళ్ళాడు.

శర్మ భోంచేసి గది చేరుకొనేసరికి రాత్రి తొమ్మిదిన్నర దాటింది. గదిలో శాస్త్రి లేడు.

"ఏమయ్యాడు చెప్మా?" అనుకున్నాడతడు.

కానీ శాస్త్రినిమించి రమ గురించిన ఆలోచన అతనిలో ఎక్కువగా చోటు చేసుకున్నాయి.

ఆమె తనను ప్రేమించింది. బొత్తిగా పుస్తకాలు చదివే అభిరుచి లేనందుకు తన్ను మర్చిపోవాలనుకుంది.

రమ అందంగా ఉంటుంది.

ఈ వయసులో స్త్రీ పురుషులకు పరస్పరం తోడు కావాలి.

తను రమను నిర్లక్ష్యంచేసి పొరపాటు చేశాడా?

తనలో చాలా లోపాలున్నాయి. ముఖ్యంగా పుస్తకాలంటే అభిరుచి లేకపోవడం....

పుస్తకాలు యువతరాన్ని ప్రభావితం చేస్తున్నాయంటే అవి చాలా గొప్పవై ఉండాలి....

తెలుగు నవల్లు గొప్పవి.

అవిప్పుడు వారానికి బోలెడు కొత్తవి రిలీజవుతున్నాయి. సినిమాలుగా వస్తున్నాయి. రచయితలకు ప్రచారం తెచ్చిపెడుతున్నాయి.

అవి తన కెందుకాకర్షించలేదు?

తను తనలోని లోపాన్ని సవరించుకోవాలి....

రేపట్నుంచే హనుమాయమ్మ గ్రంథాలయానికి వెళ్లాలి.

శర్మ ఆలోచిస్తూండగానే గది తలుపు తట్టాడు శాస్త్రి.

శర్మ లేచివెళ్ళి తలుపుతీశాడు.

శాస్త్రి ఉత్సాహంగా వున్నాడు.

"శాస్త్రీ! నువ్వు సంతోషించే వార్త నేనొకటి చెబుతాను...." అన్నాడు శర్మ.
"నేనూ నీకొకటి చెప్పాలి—" అన్నాడు శాస్త్రి.
"చెప్పు—" అన్నాడు శర్మ.
"ముందు నువ్వు చెప్పు..." అన్నాడు శాస్త్రి.
శర్మ నవలల గురించి తన అభిప్రాయాలు మారినట్లు చెప్పాడు.
"ఇంతకాలం నేను తప్పుదారిలో ఉన్నాను. నువ్వా ఆ దారికి రాకు శర్మా! నవలలు యువతరాన్ని పాడు చేస్తున్నాయి...." అన్నాడు శాస్త్రి.
'అవి మనుషుల్లో ప్రేమభావాలు మొలకెత్తిస్తున్నాయి. అది తప్పా?"
"తప్పే మరి! నవలలు చదివి శశిరేఖవంటి వాళ్ళు నావంటి వాళ్ళని ప్రేమిస్తున్నారు...."
"ఏం—నీకేం తక్కువ?"
"పువ్వు నవల చదివి అందులో హీరోతో నన్ను పోల్చుకుంటోంది శశిరేఖ. ఆ హీరోకూ నాకూ జాతిగా పోసగదని ఆమెకు తెలియదు. ఆ నవల్లో నాకు హీరోయిన్ నచ్చింది. హీరో బొత్తిగా నచ్చలేదు. ఇంకా చెప్పాలంటే నేనింకా పెళ్ళికి మానసికంగా సిద్ధంకాని మగాణ్ని. కొంతకాలంపాటు పవిత్రత గురించి పట్టించుకో కూడదనే మగాణ్ని. అదృష్టవశాత్తూ మోసంచేయాలనే దుర్బుద్ధి లేదుకానీ అవకాశంవస్తే యెలా మారతానో! నవలల పేరు చెప్పి శశిరేఖ నాకా అవకాశమిచ్చినా ఆశ్చర్యంలేదు. అయినా నావంటివాణ్ని శశిరేఖ ప్రేమించడమా—ఇది నవలల ప్రభావమే కదూ! అసలామెకు ప్రేమ ఎందుకు? తలిదండ్రులు నిర్ణయించినవాణ్ని చేసుకో

వచ్చుగా. ఆమెకి పట్టుమని పద్దెనిమిదేళ్లుకూడా ఉండవు" అన్నాడు శాస్త్రి.

శర్మ ఆశ్చర్యంగా — "మనిద్దరివీ యెప్పటికీ భిన్న ధృవాలే ఏమో — అందుకే ఈ పరస్పరాకర్షణ.... ఇంతకీ నిన్ను శశిరేఖ ప్రేమిస్తోంది — ఏం చేస్తావు?" అన్నాడు.

"రాత్రికి రాత్రి మన మీ యిల్లు ఖాళీచేసేస్తున్నాం. నేను పాత ఇంటాయనకి పాత బాకీ తీర్చేసి — ఓ నెల అడ్వాన్సుకూడా యిచ్చి వస్తున్నాను. అయినా కాకా పట్టి ఆవిణ్ని ఆకాశానికెత్తేసి పని సాధించుకొని రావడానికింతసేపు పట్టింది. వాళ్ళ యింట్లోకి మన అదృష్టం కొద్దీ ఇంకా ఎవరూ రాలేదు...." అన్నాడు శాస్త్రి.

మిత్రులిద్దరూ ప్రేమకూ, హనుమాయమ్మ గ్రంథాలయానికీ దూరంగా ఆ రాత్రే ప్రయాణమయ్యారు.

—: అయిపోయింది :—

# అడకత్తెర

## ఎ. ఎస్. రావ్

రాజారావు అలసటగా ఆవులిస్తూ రిస్ట్‌వాచ్ చూసుకున్నాడు.

పదకొండున్నర కావస్తోంది.

సగం కాలిన కరోనా సిగార్ని యాష్‌ట్రేమీద విసుగ్గా నొక్కి, చిత్తుకాగితాల బుట్టలోకి గిరాటేశాడతను. కళ్ళు మూసి, రెండు చేతుల్తో రెప్పలమీద అదుముతూ వుండిపోయాడు. అర్ధరాత్రి కావస్తున్నా అన్నం తినాలనిపించడంలేదతనికి. తనని భోజనానికి పిలిచే ధైర్యంలేని భార్య గురించి సానుభూతితో ఆలోచేస్తూ కళ్ళు తెరిచాడతను.

ఎదురుగా బల్లమీద మడతపెట్టి పెట్టిన న్యూస్ పేపర్లోంచి ఇరవైరెండేళ్ళ మోహన్ అతనివైపు నవ్వుతూ చూస్తున్నాడు. ఆరోగ్యంగా అవుపిస్తున్న మొహం. రిమ్‌లెస్ అద్దాల వెనకనుంచీ తీక్షణంగా చూస్తున్న కళ్ళు. కొద్దిగా విచ్చుకున్న పెదవులు.

రాజారావు అప్రయత్నంగా, పేపర్లో అచ్చయిన కొడుకు ఫోటోని వేళ్ళతో తడిమాడు. పేపర్లో గత వారంరోజులుగా మోహన్ ఫోటో, తన చిరునామా ముద్రించబడుతున్నాయి. కానీ ఫలితం కనబడ్డంలేదు....

రాజారావు నిట్టూరుస్తూ టెలిఫోన్ రిసీవర్ని అందుకున్నాడు. తనకి కావాల్సిన వ్యక్తి ఇంకా అక్కడ వుండకపోవచ్చు. ఉన్నా, విసుక్కోవచ్చు. అయినా తప్పదు! రాజారావు నంబరు తిప్పాడు.

"యస్?" అవతలి కంఠం విసుగు దాచుకోకుండా అంది.

"కమీషనర్ వున్నారా?" రాజారావు ప్రశ్నించాడు.

"మీ రెవరు?"

రాజారావు చెప్పాడు. రెండు క్షణాల తర్వాత కమీషనర్ కంఠం అతని చెవిలో పలికింది.

"సారీ ఫర్ ది డిస్టర్బెన్స్ ..." రాజారావు నొచ్చుకుంటూ అన్నాడు.

"ఇట్సాల్ రైట్! మిష్టర్ రాజారావ్, అయామ్ సారీ. ఏదీ తెలీలేదు. ఇవాళ రెండు యాక్సిడెంట్లూ, రెండు హత్యలూ జరిగాయి. ఆ విక్టమ్స్‌లో మీ అబ్బాయి లేడు... " పోలీస్ కమీషనర్ అన్నాడు.

"థాంక్స్...." ఏమనాలో తోచని రాజారావు యాంత్రికంగా అన్నాడు.

"హాస్పిటల్స్ అన్నీ చెక్ చేయించాం. మోహన్ యెక్కడా జబ్బుతో అడ్మిట్ కాలేదు. అంటే, అతను యెక్కడో క్షేమంగానే ఉన్నాడని చెప్పుకోవచ్చు.."

"కమీషనర్ గారూ, వాడు వెళ్ళిపోయి వారం దాటింది. నా ఎదుట నిలబడేదాకా వాడు క్షేమంగా

వున్నాడని సరిగ్గ చెప్పుకోలేను....”

“డోంట్ గెట్ వర్రీడ్; మిస్టర్ రాజారావ్. పారిపోయిన ప్రతి కొడుకూ ప్రాడిగల్ సన్ లా తిరిగొస్తాడు.”

“ఎప్పుడు?” రాజారావు అడ్డొస్తూ అడిగాడు.

“సారీ. మీ ప్రశ్నకు జవాబు చెప్పే శక్తి మాకు లేదు! మా ప్రయత్నాలు మేం చేస్తున్నాం. ఏదైనా తెలిస్తే మీకు తెలియజేయబడుతుంది. మీరు ఫోన్ చేయక్కర్లేదు!” పోలీసు కమీషనర్ కంఠంలో విసుగు ధ్వనించింది. టెలిఫోన్ డిస్కనెక్ట్ చేయబడింది.

తప్పిపోయిన వాళ్ళని పోలీసులు అంత తేలిగ్గా కాలికి పట్టుకోగలిగితే, దేశంలో దొంగలూ, అపరాధులూ స్వేచ్ఛగా తిరిగేవారు కారు! విరక్తితో నవ్వుకుంటూ రాజారావు కుర్చీలోంచి లేవబోయాడు. టెలిఫోన్ మ్రోత అతన్ని మళ్ళీ కుర్చీకి అతికించింది.

“హలో....” అన్నాడతను రిసీవర్ని చెవికి అనిస్తూ.

“రాజారావా?” బొంగురు కంఠం ప్రశ్నించింది.

“యస్. మీరెవరు?” రాజారావు ప్రశ్నించాడు. అపరిచితమైన కంఠం అది.

“రాజారావ్, నీ కొడుకు తప్పిపోయాడు. అతని ఆచూకీ తెలియజేసిన వారికి తగిన పారితోషికం...”

“యస్! అబ్బాయి యెక్కడున్నాడు? మీరెవరు?” రాజారావు ఆత్రుతతో అరిచాడు. లక్షాధికారి అయిన తనని వొక అపరిచితుడు ఏకవచనంలో సంబోధిస్తున్నాడన్న సంగతిని అతను చిటికెలో మరిచిపోయాడు. అవతలినుంచీ వెంటనే సమాధానం రాలేదు. రాజారావు గుండె వేగంగా కొట్టుకోసాగింది....

“తగిన పారితోషికం ఎంత?” బొంగురు కంఠం

ప్రశ్నించింది.

"వెయ్యానూటపదహార్లు!" రాజారావు తకీమని అన్నాడు. "మీరు....మీరెవరు? ఎక్కణ్నుంచీ మాట్లాడుతున్నారు? మోహన్ క్షేమంగా వున్నాడా?"

"వెయ్యానూటపదహార్లు తగిన పారితోషికం కాదు!" బొంగురు కంఠం నవ్వుతూ అంది. "అంటే నీ హోదాకూ, నీకూ తగిన పారితోషికం కాదు!"

"అబ్బాయి యెక్కడున్నాడో చెప్పండి. మీకెంత కావాలో చెప్పండి!" రాజారావు సహనం నశిస్తోంది.

"'పోయాడనుకున్న కొడుకు దక్కాడు; అదే పదివేలు!' అని అయినా నువ్వు అనుకోవాలి!" రాజారావు ప్రశ్నని వినిపించుకోనట్టు అంది బొంగురు కంఠం.

కోపంతో, అసహానంతో రాజారావు చేతులు వణకడం ప్రారంభించాయి. అతి ప్రయత్నంమీద తమాయించుకున్నాడతను.

"ఆల్ రైట్. పదివేలు! అబ్బాయి ఎక్కడ...."

అవతలి కంఠం నవ్వింది. "రాజారావ్, మాటవరసకి అలా అన్నాను. 'పదివేలు' స్వల్పమైన మొత్తం. అది మనిద్దర్లో యెవ్వారికీ తగిన పారితోషికం కాదు!"

రాజారావు ఊపిరి బిగబట్టాడు. ఎవడీ వ్యక్తి? ప్రాక్టికల్ జోకరా?

"మిస్టర్, ఎవర్నువ్వు? యేమిటీ సరసాలాడ్డం?" రాజారావు ఏకవచనంలో గద్దించాడు.

"నేనెవరో నీకు తెలియాల్సిన అవసరంలేదు. తెలిసే అవకాశమూ లేదు! నా అంచనా ప్రకారం 'పోయిన కొడుకు దక్కితే అదే పదిలక్షలు!'—అని నువ్వు అనుకోవాలి...."

"వాటీస్ దిస్?" రాజారావు అడ్డొస్తూ కసిరాడు.

"నా దృష్టిలో 'పదిలక్షలు' కూడా సామొత మొత్తమే. నీ కొడుకు ఆచూకీ కావాలంటే నువ్వు అయిదు లక్షలు మాత్రం పారితోషికంగా ఇవ్వాలి!" బొంగురు కంఠం తాపీగా అంది.

రాజారావు తన చెవుల్ని నమ్మలేకుండా ఉన్నాడు. ఆశ్చర్యంతో అతని నోరు తెరుచుకునే ఉండిపోయింది. ఎందుకో మొహంమీద చెమటలు కమ్ముకున్నాయి.

"రాజారావ్, వినపడిందా?" బొంగురు కంఠం హెచ్చరించింది.

"మిష్టర్, బీ రీజనబుల్. అబ్బాయి ఆచూకీ చెప్పు. రీజనబుల్ పారితోషికం తీసుకో!" రాజారావు తెప్పరిల్లి అన్నాడు.

"అలా అన్నావ్; బావుంది! నిస్సందేహంగా నేను రీజనబుల్ మనిషినే! అందుకే పదిలక్షలు అడక్కుండా అయిదుకే తృప్తిపడుతున్నా!"

"ఇది అన్యాయం! ఘోరం...." రాజారావు బొబ్బలెట్టాడు.

నవ్వు అతన్ని ఆపింది. "కిలో మైదాపిండిలో వంద గ్రాముల పాలపొడిని కలిపి, జామూన్ మిక్స్ పేరుతో కిలో నలభై రూపాయలకి అమ్మి తేరగా లక్షలు ఆర్జించుకుంటున్న నీకు ఇది అన్యాయంగానే అవుపిస్తుంది! ఆల్ రైట్, అయిదు లక్షలు చెల్లించడానికి సిద్ధంగా ఉంటే ఇంట్లోంచి పారిపోయిన నీ కొడుకు ఆచూకీ చెప్తాను. త్వరగా తేల్చుకో!" బొంగురు కంఠం నిర్లక్ష్యంగా అంది.

రాజారావు గుటకలు మింగాడు. అవతలి వ్యక్తి వరస

అతనికి బొత్తిగా అర్థంకావడంలేదు. ఆచూకీ చెప్పడానికి అయిదులక్షలు!

"నువ్వెవరో నాకు తెలీదు. నీ తత్వం నాకు అర్థం కావడంలేదు. నా కొడుకు ఆచూకీ నీకు తెలుసన్న గ్యారెంటీ ఏమిటి?" రాజారావు ప్రశ్నించాడు.

బొంగురు కంఠం సగర్వంగా నవ్వింది. "నా మాటల్ని నువ్వు నమ్మలేకపోవచ్చు. నీ సుపుత్రుడి మాటల్ని నమ్ముతావ్! విను!" అన్నాడతడు. అప్రయత్నంగా రాజారావు చెవులు రిక్కించాడు. రిసీవర్ గుండా యేవో చిన్న చిన్న శబ్దాలు అతని చెవిలో దూరుతున్నాయి....

"నాన్నా...." మోహన్ కంఠం. రాజారావు ఉలిక్కిపడ్డాడు. ఊపిరి బిగబట్టి, సర్వశక్తినీ చెవిలోకి కేంద్రీకరించాడు.

"నాన్నా.... నేను.... నేను....ఇక్కడ.... నన్ను...."

చిన్న శబ్దం తడబడుతున్న మోహన్ కంఠాన్ని పూర్తిగా నొక్కేసింది.

"బాబూ,, మోహన్!" రాజారావు గద్గద కంఠంతో అరిచాడు.

"రాజారావ్, నీ కొడుకు కంఠాన్ని విన్నావు. ఇప్పుడు నా మాటల్ని నువ్వు చచ్చినట్టు నమ్మాలి! సో...."

"మిష్టర్ ....నువ్వెక్కణ్నుంచీ మాట్లాడుతున్నావ్? త్వరగా చెప్పు! పారితోషికం...." రాజారావు వణికే కంఠంతో అన్నాడు.

"తొందరపడుతున్నావ్! నీ కొడుకు ఆచూకీ మాత్రమే నాకు తెలుసని అనుకోవద్దు. ఇంటినుంచీ, నీనుంచీ పారిపోతున్న నీ సుపుత్రుడిని వెతికి పట్టుకున్నాను. పంజరంలోంచీ ఎగిరిపోతున్న చిలకని పట్టి మరో గట్టి పంజ

రంంలో బంధించాను. అడిగింది చెల్లిస్తే అతన్ని నీకు అప్ప గిస్తాను!" బొంగురు కంఠం నవ్వుతూ అంది.

రాజారావు శరీరం ఒక్కసారి జలదరించింది. "మిస్టర్, నువ్వు చేస్తున్న పనిని కిడ్నాప్ అంటారు. అది ఎంత నేరమో...."

"నేను చేస్తున్న పనిని నీ ఇష్టంవచ్చిన పేరుతో పిలుచుకో. ఐడోంట్ కేర్! నాక్కావాల్సింది ఇచ్చెయ్; నీక్కావాల్సింది పుచ్చుకో!" బొంగురు కంఠం నిర్ల క్ష్యంగా అంది.

"ఇవ్వకపోతే?" అప్రయత్నంగా రాజారావు గద్దించాడు.

అవతలి కంఠం చిన్నగా నవ్వింది. అగ్గిపుల్ల గీచిన చప్పుడు చిన్నగా రాజారావుకి వినిపించింది. "రాజారావ్ మంచి ప్రశ్న అడిగావ్! ఇవ్వకపోతే, పేపర్లో నీ ప్రకటన జీవితాంతం కొనసాగుతూనే ఉంటుంది! ఆమాటకి కనుక్కోడానికి—నీ కొడుకు యెవ్వరికీ కనిపించడు!"

"వాట్!" రాజారావు బొంగురుగా అరిచాడు. వణుకు తున్న అతని చెయ్యి రిసీవర్ని చెవికి అదిమింది.

"మళ్ళీ చెప్పాలా?" బొంగురు కంఠం ఎగతాళిగా అడిగింది.

రాజారావు మౌనంగా ఉండిపోయాడు. ఇంట్లోంచి ఉడాయించిన తన ఏకైక పుత్రుడి ఆమాటకీ ఈ విధంగా తెలుస్తుందని అతను ఊహించలేదు. అసలు, మోహన్ ఇంట్లోంచి తనకు తానే వెళ్ళిపోయాడా? తనతో ఫోనులో మాట్లాడుతున్న వ్యక్తి కిడ్నాప్ చేశాడా?

"ఇప్పుడు నాకంతా అర్థమవుతోంది. మావాణ్ని నువ్వు కిడ్నాప్ చేశావ్!" రాజారావు ఆక్షేపణా,

ఆగ్రహం కలిసిన కంఠంతో అన్నాడు.

అవతలి వ్యక్తి పకపక నవ్వాడు. "రాజారావ్, డబ్బున్న వాళ్ళంతా మూర్ఖులన్న నా నమ్మకాన్ని గట్టిపరుస్తున్నావ్! మీ వాణ్ణి కిడ్నాప్ చేసివుంటే, ఎప్పుడో నీ దగ్గర పైకం వసూలు చేసి, అతన్ని నీ దొడ్డిలోకి తోలేసి ఉండేవాణ్ని! కిడ్నాప్ చేసిన వ్యక్తిని పది రోజులపాటు భద్రంగా దాచి, మేపుతూ రిస్కు తీసుకునేంత తెలివి తక్కువవాణ్ని కాను!"

"ఆల్ రైట్. బాబుని తీసుకురా. పైకం పట్టుకెళ్ళు" అడకత్తెరలో తగుల్కున్న రాజారావు క్షణంలో నిర్ణయించుకొని అన్నాడు.

"రాజారావ్, ఇంకా ఎదుగు! ఈ కబుర్లు మీ అమ్మమ్మకి చెప్పుకో!" అవతలి వ్యక్తి ఎగతాళిగా అన్నాడు.

"వాట్ డూ యూ మీన్?" రాజారావు హుంకరించాడు.

"గిత్తను బందెల దొడ్డికి తోలుకొచ్చినట్టు నీ కొడుకుని నేను నీ ఇంటికి తోలుకురాను. అయిదు లక్షలిస్తానంటే నువ్వు ఏం చేయాలో చెప్తాను...."

"పారేస్తాను! చెప్పు!" రాజారావు అడ్డొస్తూ అరిచాడు.

"వెరీగుడ్, వెరీగుడ్! అసలు సంగతి చెప్పేలోగా, మరికొన్ని విషయాలు నీ బుర్రలోకి ఎక్కించాలి: ఈ ఫోన్ కాల్ గురించీ, అయిదు లక్షల గురించీ నీ భార్యకు కూడా చెప్పకు. పోలీసుల్నీ, ప్రయివేట్ ఇన్వెస్టిగేటర్స్‌నీ సహాయం అడక్కు. ఈ విషయం నాతో

తప్ప ఇంకెవ్వరితోనూ మాట్లాడకూడదు...."

"అవన్నీ నాకు తెలుసు. కిడ్నాప్ చేసే ప్రతివాడూ, బ్లాక్ మెయిల్ చేసే ప్రతివాడూ చెప్పే ఎరతులే! అసలు సంగతి చెప్పు...." ఉడ్డోమిస్తూ అన్నాడు రాజారావు.

అవతలి వ్యక్తి వెకిలిగా నవ్వాడు. "ఫరవాలేదు; తెలివైనవాడివే! నీకు ఇచ్చిన సూచనల్ని పాటిస్తావన్న నమ్మకం కలగడానికి ఇరవై నాలుగ్గంటలూ నిన్ను పరీక్షిస్తాను. డబ్బుని సూట్ కేస్ లో సర్దడం తప్ప మరో పని నువ్వు చెయ్యకూడదు. ఈ క్షణంనుంచీ నిన్ను నా అబ్జర్వేషన్ లో వుంచుతాను. నాకు అనుమానం కలిగించే విధంగా నువ్వు ఏ పని చేసినా —తరవాత నా కంఠం వినిపించదు; నీ కొడుకు కనిపించడు! అర్థమైందా?"

"నన్ను నువ్వు పరీక్షించక్కర్లేదు. అడిగింది గిరాటేసాను, మా వాణ్ని ఇచ్చేసి నీ దారిన నువ్వు పో! డోంట్ కస్ట్ అండర్ రే!" రాజారావు అరిచాడు.

"నో, రాజారావ్. నువ్వు కేవలం వినే పొజిషన్ లో ఉన్నావు; చెప్పే పొజిషన్ లో లేవు! నిజం చెప్పాలంటే, నా అడకత్తెలో ఇరుక్కున్నావ్!" అవతలి వ్యక్తి చిన్నగా నవ్వాడు. రాజారావు చెవిలో సీసం కరిగించి పోసిన ఎఫెక్టు తెస్తోందా నవ్వు.

"మిష్టర్ .... నేను .... అనేదేమిటంటే ...." రాజారావు నచ్చచెప్పే ప్రయత్నం చేయబోయాడు.

"అనడం కాదు; వినడమే నీ డ్యూటీ!" ఆ వ్యక్తి కంఠం కటువుగా ధ్వనించింది. రాజారావు నిస్సహాయంగా నిట్టూర్చాడు. అప్రయత్నంగా పళ్ళు కొరుక్కున్నాడు.

"రేపు రాత్రి 12 గంటలకి ఫోన్ దగ్గర పద్మాసనం

వేసుక్కూచో!" కంఠం హెచ్చరించింది. రాజారావు చెవిలో ఫోన్ క్లిక్ మంది....

రాజారావు చలనం లేకుండా విగ్రహంలా కూచుండి పోయాడు. తలుపు తెరిచిన చప్పుడు విని అతను ఉలిక్కి పడ్డాడు.

"ఏమిటండీ, ఏదేనా తెలిసిందా?" గుమ్మంలో నిలబడ్డ సులోచన ప్రశ్నించింది.

అప్రయత్నంగా రాజారావు రిసీవర్ని క్రెడిల్ మీద పడేశాడు. తన వేపు అయోమయంగా చూస్తున్న భార్యని వెర్రివాడిలా చూశాడు....ఏదో కారు....ఎంతో తెలిసింది....

## 2

పక్కకి తిరిగి పడుకొని సన్నగా గురక ప్రారంభించిన భార్యని రాజారావు సంతృప్తితో చూశాడు. సులోచన ఆదమరచి నిద్రపోవడం మంచిది. తనకి ఫోన కాల్ వచ్చినప్పుడు ఆమె మెలకువతో ఉండటం అంత మంచిది కాదు. అందుకే ఆమె తాగిన పాలలో నిద్రమాత్ర కలిపాడు.

రాజారావు తన ఆఫీసు గదిలోకి నడిచాడు. టేబుల్ ముందు రొటేటింగ్ కుర్చీలో కూలబడి టైం చూశాడు. పన్నెండవడానికి ఇంకా పావుగంట ఉంది.

గత అర్ధరాత్రి నుంచీ గంటలు రోజుల్లా వారాల్లా ప్రాకుతున్నాయనిపిస్తోందతనికి. ఆలోచించి, ఆలోచించి అతని బుర్ర వేడెక్కిపోయింది.

మోహన్ ఇంట్లోంచి ఎందుకు పారిపోయాడో అతనికి అంతుపట్టడంలేదు. ఒక్కగానొక్క కొడుక్కి తను సర్వ సౌకర్యాలూ సమకూర్చాడు. లక్షలాది ఆస్తికీ,

లోతుగా వేళ్ళు తన్ని, కొమ్మలూ రెమ్మలుగా వ్యాపిస్తున్న వ్యాపారానికీ చక్కని వారసుడిగా, తన సక్సెసర్ గా కొడుకుని రూపొందించడానికి తను నిర్విరామంగా కృషి చేస్తున్నాడు.

మోహన్ కిడ్నాప్ చేయబడ్డాడని అనుకోడానికి అతనికి మనస్కరించడంలేదు. ఫోన్ లో తనని పలకరించిన వ్యక్తి చెప్పింది విశ్వసించదగిందిగానే ఉంది. కిడ్నాప్ చేశాక, వారంరోజులపైగా అతను గోళ్ళు గిల్లుకుంటూ కూచోడు! కానీ, వెతికిపట్టుకొని మోహన్ని తన కంట్రోల్లో పెట్టుకొన్న ఆ వ్యక్తి కిడ్నాప్ చేసినట్టే భావించాలి.

తను అయిదు కాకపోతే పదిలక్షలు విసిరిపారేస్తాడు. కానీ.... మోహన్ క్షేమంగా తనని చేరుకుంటాడా? కిడ్నాపర్ గా రూపొందిన ఆ 'అచూకీ కనుక్కున్న వ్యక్తి, తనని కళ్ళారా చూసిన యువకుడిని ప్రాణాల్తో వదిలి పెడ గారా?

హృదయాన్ని కంగారుతో, భయాందోళనలతో నింపేస్తున్న ఆలోచనల్ని అదుక్కి లోకే ప్రయత్నం చేస్తూ రాజారావు సిగార్ వెలిగించాడు. పొగ ఊదుతూ యధుయగా గోడకి వేళ్ళాడుతోన్న గడియారాన్ని చూశాడు. చటుక్కున గడియారం గంటలు కొట్టడం ప్రారంభించింది. గంటల చప్పుడు అతని హృదయంలో ప్రతిధ్వనిస్తోంది.

ఉన్నట్టుండి టెలిఫోన్ మ్రోగసాగింది. రాజారావు ఎడమచెయ్యి రిసీవర్ని తటాలున అందుకుంది.

"యస్?" అన్నాడతను ఉద్రేకంతో.

"రాజారావా?" అదే కంఠం.

"యస్ ...."

"రాజారావ్, నాకు తృప్తి కలిగించేలా, నమ్మకం కలిగేలా ప్రవర్తించావు. ఏం చేయాలో చెప్తాను: కాగితం, పేనా తీసుకో" బొంగురు కంఠం హెచ్చరించింది.

"కాగితం, పేనా ఎందుకు? చెప్పు, వింటాను...." రాజారావు విసుగ్గా అన్నాడు.

"చెప్పినట్టు చేయకపోతే, మాటకి అడ్డు వస్తే ఫోన్ పెట్టేస్తాము!" ఆగ్రహం ఆ కంఠంలో గంటలా ప్రతిధ్వనించింది.

"ఆల్ రైట్ ...." రాజారావు ఆతృతగా అన్నాడు.

"రాజారావ్, తెలుగు నిఘంటువు 'శబ్దరత్నాకరం', ఆంగ్ల నిఘంటువు 'వెబ్‌స్టర్'—ఈ రెండూ తీసుకోవాలి నువ్వు...."

రాజారావు కనుబొమలు పైకిలేచాయి. ఆ వ్యక్తికి మతిపోయిందా? సైకలాజికల్ పేషెంటు తనతో ఆడుకుంటున్నాడా? తన అనుమానాన్ని వ్యక్తం చేయడానికి ప్రయత్నించబోతున్న రాజారావుని ఆ వ్యక్తి కంఠం ఆపింది.

"కంగారు పడొద్దు. ఆ రెండు నిఘంటువులలోని కొన్ని పేజీల నంబర్లూ, ఆయా పేజీల్లో సెలెక్టు చేసుకోవాల్సిన పదాల నంబర్లూ వరసగా డిక్టేట్ చేస్తాను. జాగ్రత్తగా రాసుకో. నిఘంటువుల సాయంతో పదాల్ని రాసుకో తరవాత. ఏం చేయాలో నీకు నిఘంటువు చూసినంత సులభంగా అర్థమవుతుంది!" బొంగురు కంఠం చిన్నగా నవ్వింది.

రాజారావుకి అంతా అయోమయంగా ఉంది. ఆ

పదాలతో కదనం వద్దనీ, ఏదేదో వ్యర్థంగా ఏడమనీ ఆవాలనిపించింది. తన కోరికని బలవంతంమీద నిగ్రహించుకున్నాడతను.

"ఆ రెండు నిఘంటువులూ నా దగ్గర లేవు..." అన్నాడతను చివరికి.

"లేకపోతే పొద్దుటే షాపుకెళ్ళి కొనుక్కో. డబ్బు ఖర్చు చేయడం ఇష్టం లేకపోతే, లైబ్రరీకెళ్ళి దొంగిలించి తెచ్చుకో" బొంగురు కంఠం నిర్లక్ష్యంగా అంది.

రాజారావు పళ్ళు కొరుక్కున్నాడు. తనని ఎగతాళి చేసి సూదిలో గుచ్చినట్టు మాట్లాడ్డం అతని కష్టంగా వున్నట్టుంది. శాడిస్టు బాస్టర్డు! రాజారావు బరువుగా నిట్టూర్చాడు.

"ఆల్ రైట్! గో ఆన్!"

"గుడ్. రాసుకో. శబ్దరత్నాకరం—పూర్తిగా రాస్తూ కూచోవద్దు టైమ్ లేదు. 'శర' అనీ వెబ్‌స్టర్ అన్నప్పుడు 'వెబ్' అనీ రాసుకో చాలు—అర్థమైందా? రైట్! శబ్దరత్నాకరం పేజీ 32, పదం 4....శబ్దరత్నాకరం పేజీ 129 పదం..." డిక్టేట్ చేస్తున్న టీచర్‌లా అతను లిస్టు చదువుకుపోతున్నాడు. వినయవిధేయతలు కలిగిన మంచి విద్యార్థిలా రాజారావు రాసుకుపోయాడు.

ఎన్నో గంటలు గడిచాయి అని రాజారావు అనుకుంటున్న క్షణంలో "అంతే!" అంది బొంగురు కంఠం అతని చెవిలో.

రాజారావు గాఢంగా నిట్టూర్చాడు. నుదుర్ని కమ్మిన చెమటని ఎడమ చేతి వెనక భాగంతో తుడుచుకున్నాడు.

"ఎందుకైనా మంచిది, ఒకసారి రాసుకున్న దాన్ని చదువు. సరిచూసుకుందాం. తప్పులుంటే నువ్వు తిప్పులు

పడతావ్!" అవతలి కంఠం హెచ్చరించింది.

రాజారావు అసంకల్పితంగా మూలిగాడు. బొంగురు కంఠంతో చదవడం ప్రారంభించాడు.

"వెరీగుడ్. కోపంగా చదివినా సరిగ్గా చదివావ్. ఆదేవరసలో పదాల్ని ఏర్చి కూర్చుకో. అవసరమైనచోట విభక్తి ప్రయత్నాలు—తెలుసుగా?—చేర్చుకో. తరవాత చదువుకో. ఏం చేయాలో ఎలా చేయాలో, ఎప్పుడు చేయాలో నీకు బోధపడుతుంది. అక్షరాలా అలాగే చెయ్. ఏమాత్రం పొరపాటు చేసినా నీ పైకం నీ దగ్గరా, నీ పుత్రుడు నా దగ్గరా ఉండిపోతాడు. తరవాత నీ దారి నీది; నా దారి నాది నీ కొడుకు దారి చెప్పక్కర్లేదనుకుంటాం!" బొంగురు కంఠం మొరిగినట్టు నవ్వసాగింది.

రాజారావు రిసీవర్ని కొంచెం దూరంగా లాగాడు. నవ్వు ఆగిపోయింది. రిసీవర్ని దగ్గరగా జరిపాడతను.

"రాజారావ్, చివరిసారిగా చెప్తున్నా. మొత్తంలో యేమాత్రం తక్కువ ఉన్నా సరుకు నీకు డెలివరీ కాదు. ఇచ్చిందాన్ని డిపాజిట్‌లాగా కాన్ఫిస్కేట్ చేసేసుకుంటాను. ఆ తరవాత రెండింతలు సమర్పించుకుంటే గానీ పార్సెల్ నీకు అందదు. అదీగాక, రెండోసారి బేరం నా దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి ఉంటుంది! అమ్మకం కాన్సిల్ చేసి, 'కుళ్ళిపోయిన' సరుకుని సముద్రంలో గిరాటేసే నిర్ణయం కూడా నేను తీసుకోవచ్చు! అర్థమైందా?" బొంగురు కంఠం ప్రశ్నించింది.

"అర్థమైంది. అనవసరంగా నన్ను కంగారు పెట్టాలని చూస్తున్నావ్ అయిదు లక్షల్లో వెయ్యో. పదివేలో మిగుల్చుకుంటే నాకు వొరిగేదేం లేదు! లచ్చాంతో కూడా రాజారావు నిజాయితీగా వ్యవహరిస్తాడు!" రాజారావు

కోపంతో అరిచాడు.

"వెరీగుడ్. కీపిటప్! రహస్యంగా వ్యాపారం చేసే ఇద్దరు పార్ట్‌నర్స్ మధ్య జరిగేలా ఈ లావాదేవీ మనిద్దరి మధ్యా జరుగుతోంది. దీన్ని మోస్ట్ కాన్ఫిడెన్షియల్‌గా ఉంచు. నోరు జారితే సరుకుతో నేను జారుకుంటాను! గుడ్ లక్!" బొంగురు కంఠం చిన్నగా నవ్వింది. ఫోన్ డిస్కనెక్ట్ చేయబడింది.

రిసీవర్ని క్రెడిల్ మీద కుక్కి, రాజారావు బరువుగా నిట్టూర్చాడు. కోపంతో, అవమానంతో కందిపోయి జేవురించిన మొహాన్ని రెండు చేతుల్లో రుద్దుకున్నాడు. ఆరిపోయిన సిగార్ని గిరాటేసి, కొత్తది ముట్టించి, ఘాటుగా పొగలాగాడు.

రకరకాల అంకెలతో నిండివున్న పేపర్ని అయోమయంగా చూశాడు. పొద్దుటే రెండు నిఘంటువులూ తెప్పించి చూసేదాకా తనకి తలాతోకా తెలీదు! నిస్సహాయంగా తలని వెనక్కి వాల్చి అలసటగా కళ్ళు మూసుకున్నాడు రాజారావు.

# 3

పేనాని టేబుల్ మీదికి విసిరికొట్టి మెటికలు విరుచుకున్నాడు రాజారావు. రెండు డిక్షనరీల్ని తిరగేసి, తిరగేసి అంకెల్ని అక్షరాలుగా మార్చడానికి పట్టిన గంటన్నర అతనికి తలనొప్పి తెచ్చిపెట్టింది. తలనొప్పిని నిర్లక్ష్యం చేస్తూ, తను రాసిన పదాల్ని వరసగా చదవసాగేడతను.

చదవడం పూర్తి చేశాక, అతని మొహంమీద ఆశ్చర్యం నాట్యం చేయసాగింది. అతను చెప్పింది నిజమే. విభక్తి ప్రత్యయాల్ని అక్కడా ఇక్కడా చేర్చాక,

తను సాల్వ్ చేసిన 'పదబంధం' అరటిపండు వొలిచినట్టు అర్థమవుతోంది!

ఆరిపోయిన హవానాని లైటర్‌తో వెలిగించి, తను రాసిందాన్ని మరోసారి చదవడం ప్రారంభించాడు. తను ఎప్పుడు, ఎక్కడ, ఎలా ముల్లె చెల్లించాల్సిందీ అందులో స్పష్టంగా వుంది. చెల్లించాక ఏం చేయాల్సిందీ ఉంది. మోహన్ ఎలా ఇంటికి చేరుకుంటాడో ఉంది.

అప్రయత్నంగా రాజారావు తేలిగ్గా నిట్టూర్చాడు. ఫ్లాస్కులో ఉన్న కాఫీని కప్పులోకి వొంపుకొని తాగడం ప్రారంభించాడు.

కాఫీ ముగించి రాజారావు లేచాడు. సిగార్ పీలుస్తూ పక్కగదివేపు నడిచాడు. తలుపుని తోస్తూ లోపలికి దూరాడు. మంచంకింద ఉంచిన పాత సూట్‌కేసుని క్షణకాలం చూశాడు. తెలివితక్కువగా ఇంట్లోంచి పారిపోయిన కొడుకు ప్రయోజకత్వానికి తనకి విధించబడిన అపరాధం!

ఆట్టే శ్రమలేకుండా తను వివిధ బాంకుల్లోంచీ అవసరమైన మొత్తాన్ని విత్‌డ్రా చేశాడు. రాన్సమ్ మొత్తం చెల్లించే విధానం, ప్రదేశం వగైరా వివరాలు పోలీస్ కమీషనర్‌కి చెప్పి, రహస్యంగా కిడ్నాపర్‌ని ఫాలో చేసి, బంధించి తన కొడుకుని రక్షించమని అడగాలనిపించింది రాజారావుకి. అతిప్రయత్నంమీద ఆ ఉబలాటాన్నీ, ఉద్రేకాన్నీ ఆపుకున్నాడతను.

కిడ్నాపర్ ఆరితేరినవాడిలా ఉన్నాడు. పోలీసుల ప్రమేయం ఉందని వాడు పసిగట్టడం, ఆమాటకొస్తే— అనుమానించడం ప్రమాదం! అయిదు లక్షలకి నీళ్ళొదిలేసి, ఒక్కగానొక్క కొడుకుని రక్షించుకోడం శ్రేయ

స్కారం. అయిదు లక్షల్ని తను అచిరకాలంలో సంపాదించగలడు!

అలసటగా మంచంమీద వాలి, రాజారావు రిస్టువాచీ చూసుకున్నాడు. సూచనల ప్రకారం తనిక్కణ్ణుంచి బయల్దేరడానికి ఇంకా వ్యవధి ఉంది. తను సిద్ధంగా ఉన్నాడు. గడియారమే సిద్ధంగాలేదు ...

• • •

నిర్మానుష్యంగా ఉన్న సన్నటి రోడ్డుమ్మట కారు సాధారణ వేగంతో పోతోంది. రాజారావు చేతులు యాంత్రికంగా స్టీరింగ్‌ని తిప్పుతున్నాయి. కాగితంమీది సూచనలు అతని చెవుల్లో గింగురుమంటున్నాయి. తిన్నగా వెళ్ళి, ఎడమకి తిరిగి మెయిన్ రోడ్ యెక్కితే తను త్వరగా గమ్యస్థానం చేరుకోగలడు. కానీ సూచనలు తనని చుట్టు దారిన వెళ్ళమంటున్నాయి.

రాజారావు కటాలున కార్ని కుడివేపు తిప్పాడు. తను రాసుకున్న సూచనలు తనని హెచ్చరిస్తూ కార్ని యెక్కడెక్కడికో తీసుకెళ్తున్నాయి. ముందుజాగ్రత్తతో కిడ్నాపర్ సందులమ్మట తనని తిప్పుతున్నాడు!

ఇరవై నిమిషాల తర్వాత రాజారావు రైల్వేగూడ్స్ షెడ్ వెనకున్న కంకర్రోడ్డుమీద కార్ని ఆపాడు.

రాజారావు హెడ్‌లైట్స్‌నీ, ఇంజన్నీ ఆఫ్ చేశాడు. చుట్టూ పరకాయించి చూశాడు. ఎడంవైపున గూడ్స్ షెడ్ గోడ పొడుగ్గా అవుపిస్తోంది. కుడివైపున మైదానం గుడ్డి వెన్నెల్లో ఎడారిలా ఉంది....

వెనకా, ముందు రోడ్డు నిర్మానుష్యంగా వుంది.

కార్ని ఇక్కడ ఆపమన్న ఆ వ్యక్తి ఎక్కడ దాక్కున్నాడు? తనకి కనిపించని రెండు కళ్ళు తనని రహ

స్యంగా గమనిస్తున్నాయా? అతనెక్కడ నక్కి దాక్కున్నాడు? తనలోంచీ పైకి తన్నుకొస్తున్న ప్రశ్నలకి సమాధానాలు వెతుక్కోలేని రాజారావు ఉలిక్కిపడ్డాడు. సూచనల్ని తాత్కాలికంగా మరిచిపోయి తను కార్లో కూచుండిపోయాడు!

ఇగ్నిషన్ కీని గ్లవ్స్ కంపార్టుమెంట్‌లో పడేసి, అతను తటాలున కిందికి దిగాడు. డోర్ని మూసి, రోడ్డమ్మట చకచకా అడుగులు వేయసాగాడు. తన అంబాసిడర్ వేపు ఒకసారి తిరిగిచూడాలనిపించిందతనికి. కానీ, తనకి అనుమతి లేదు! పళ్లు కొరుక్కుంటూ రాజారావు నడక కొనసాగించాడు. ఎన్నో అనుమానాల్ని పుట్టిస్తున్న యేదో భయం అతన్ని వెన్నంటి తరుముతోంది. రాజారావు ఎడమవైపు చీలిన కాలిబాటలోకి తిరిగాడు.

మసక చీకటిలో, మెలికలు తిరిగి పడుకున్న పాములా ఉన్న కాలిబాటమీద అతను ప్రయాణం చేయసాగేడు. పదినిమిషాల తరవాత, అడ్డంగా వెళ్తున్న రైలుపట్టాలూ, ఎడమవైపున దూరంగా దీపాలతో స్టేషనూ కనిపించాయతనికి. అర్ధరాత్రిలో స్మశానంలోంచీ ఊళ్లోకి అడుగు పెడుతున్నంత తేలిగ్గా అనిపించిందతనికి.

రాజారావు పట్టాల్ని దాటి, పక్కనే ఉన్న కాలిబాటమ్మట స్టేషన్ వైపు వేగంగా నడిచాడు. మరో పది నిముషాల్లో తను అటు వేపు వెళ్ళే సబర్బన్ ట్రెయిన్‌లో యెక్కాలి. తన ఇంటికి అరకిలో మీటరు దూరంలో ఉన్న స్టేషన్‌లో దిగాలి. అక్కణ్నుంచీ కాలినడకనే ఇంటికి చేరుకోవాలి. ఇంటికి చేరుకున్నాక యెదురు చూడాలి.

# 4

నిద్రపట్టని రాజారావు కొడుకుకోసం యెదురు చూశాడు. చుట్టలు తగలేస్తూ తెల్లారేదాకా యెదురు చూశాడు.

తెల్లారేముందు మేల్కొన్న భార్య వేసిన సవాలక్ష యక్షప్రశ్నలకి సమాధానాలు చెప్పలేక సతమతమయ్యాడు. త్వరలో కొడుకు ఇంటికి రాబోతున్నాడని తనకెందుకో నమ్మకంగా అనిపిస్తోందని ఆమెని వోదార్చాడు. కన్నీళ్ళతో అతన్ని ఆశగా చూసి, కాఫీ కాచి తెస్తానంటూ సులోచన వంటగదిలోకి వెళ్ళింది.

మేడమీద కిటికీముందు నిలబడి, ఆరోకప్పు కాఫీతాగి, కొత్త సిగార్ వెలిగించాడు రాజారావు. అప్పుడే అక్కడికి వచ్చిన సులోచన అతన్ని ఆదోలా చూసింది. రక్తంలో ముంచినట్టున్న ఎర్రటి కళ్ళు, మాసిన గడ్డం. వాతావరణం చల్లగా ఉన్నాకూడా చెమటతో మెరుస్తున్న నుదురు క్రితంరోజు వేసుకున్న దుస్తులు.

"ఇవాళ మీరెందుకో ఆదోలా ఉన్నారు. గడ్డం గీసుకోండి, స్నానం చేసి, హాయిగా పడుకోండి రాత్రంతా మేలుకునే ఉన్నారు" అందామె సానుభూతితో.

రాజారావు ఆమెని మౌనంగా, రెప్పవేయకుండా చూశాడు. తను కంగారుపడకుండా ఉంటానికి ఆమె తన కంగారుని పైకి కనపడనీయటంలేదని అతనికి తెలుసు. తండ్రికే ఇంత చిత్తక్షోభ ఉన్నప్పుడు తల్లికి ఎలా ఉంటుంది?

"ఏమండీ...."

రాజారావు తెప్పరిల్లి ప్రశ్నార్థకంగా చూశాడు.

"బాబు....బాబు సంగతి ఏదేనా తెలిసిందా?"

సులోచన అతన్ని దీనంగా చూస్తూ అడిగింది.

చుట్టని పళ్ళమధ్య ఇరికించి రాజారావు తలని అడ్డంగా ఆడించాడు. సులోచన అతని దగ్గరగా నడిచింది. అతని ముంజేతిని ప్రేమగా పట్టుకుంది. తలెత్తి అతని ఎర్రటి కళ్ళలోకి తదేకంగా చూసింది.

"మీరు....ఏదో దాస్తున్నారు. లోపలే కుమిలిపోతున్నారు!" ఆమె కంఠంలో సానుభూతి పలికింది. ఆమె కంఠంలో ఆక్షేపణలేదు.

విచారం కాపురం చేస్తున్న భార్య మొహంలోకి రాజారావు నిదానించి చూశాడు. తన హృదయ వేదనని చెప్పమని ఆమె కళ్ళు అతన్ని అడుగుతున్నాయి. రాజారావు అప్రయత్నంగా ఆమె భుజమ్మీద తన ఎడమ చేతిని వేశాడు. సులోచన అతని దగ్గరగా జరిగింది. ఆమె తల అతని ఛాతీమీద వాలింది.

రెండురోజులుగా జరిగిందంతా ఆమెకి ఏకరువుపెట్టి, ఆ క్షణంలో తనలో మొక్కగా మొలిచి, వృక్షంలా రొమ్ముదిగిపోతున్న అనుమానాల్ని, భయాన్ని ఆమెకి వివరించి హృదయభారాన్ని తగ్గించుకోవాలనిపించిందతనికి.

కానీ, ఆమాకి చెప్పి అప్పగిస్తానన్న వ్యక్తికి కిడ్నాపర్‌కి, తను అయిదు లక్షలు చెల్లించాడనీ, వాగ్దానం ప్రకారం అతను తమ కొడుకుని అప్పగించలేదనీ, అతనిచ్చిన గడువు మూడుగంటల క్రితమే తీరిపోయిందనీ, కొడుకు ప్రాణాలతో తిరిగొస్తాడన్న నమ్మకం తనలో నశిస్తోందనీ అమాయకురాలైన భార్యకు, కడుపుకోత అనుభవిస్తున్న తల్లికి చెప్పే ధైర్యం అతనికి లేకుండా పోయింది.

"ఏమండీ....బాబు క్షేమంగానే ఉన్నాడా? ఏదేనా

తెలిసిందా? ఎందుకిలా ఉన్నారు? చెప్పండి!" కొద్దిగా పైకెత్తి అతని మొహంలోకి చూడ్డానికి ప్రయత్నిస్తూ అంది సులోచన.

రాజారావు నిట్టూర్చాడు. వోదార్పుగా ఆమె తల నిమిరాడు.

"సులోచనా, నా ఆశలన్నీ వాడిమీదే పెట్టు కున్నాను. ఆందోళనగా ఉంది. అంతే...." అన్నా డతను. సన్నటి కంఠంతో.

"తెల్లారగట్ట తిరిగొస్తాడన్న నమ్మకం ఉందంటూ నాకు ధైర్యం చెప్పారు..." ఏడుపుని దిగమింగుతూ అందామె.

రాజారావు మళ్ళీ నిట్టూర్చాడు. "ఇలాంటి సంద ర్భాల్లో ధైర్యం, భయం ఒకదాన్నొకటి తరుముతూ ఉంటాయి!" బలవంతంగా నవ్వుతూ అన్నాడు.

సులోచన యేదో చెప్పబోయింది. పక్క గదిలో ఫోన్ మోగుతోంది. రాజారావు ఆమెని వొదలేసి గది వేపు వేగంగా నడిచాడు. తన వెనకే తలుపుని మూస్తూ రెండంగల్లో టేబుల్ని సమీపించి రిసీవర్ని అందు కున్నాడు.

"యస్?"

"సార్ .... నేను, సుబ్బరాజుని...." డ్రైవర్ కంఠం.

"ఏమిటి?" రాజారావు కొంచం చిరాగ్గా అన్నాడు.

"ఆరింటికే మనింటికి రావాలని బయల్దేరాను సార్. సందులోంచి నేతాజీ వీధిలోకి తిరిగాను. అక్కడ రోడ్డు పక్కన మన కారు ఆగివుంది సార్. సమీపంలోని ఎవ రింటికో తమరు వెళ్ళుంటారని ఇంతసేపూ కాచుకున్నాను సార్. తొమ్మిదిగంటలు దాటినా తమరు రాలేదు సార్. ఇగ్నిషన్ కీ కార్లోనే ఉందిసార్. అనుమానం వేసి ఎదు

రింటాయన్నా అడిగాను సార్ ...."

"సుబ్బరావ్, కార్లో చూశావా? ఎవరూ లేరా?" రాజారావు ఆత్రుతగా అడిగాడు.

"చూశాను. ఎవ్వరూ లేరుసార్ .... సార్ కార్ని తమరు ఎవరికేనా ఇచ్చారా? తెల్లారుజాము ప్రాంతంలో కారాగిన చప్పుడైందనీ, అప్పట్నుంచీ ఇక్కడే ఉందనీ యెదురింటాయన అన్నారు సార్ ...." సుబ్బారావు కంఠంలో ఆశ్చర్యం స్పష్టంగా ధ్వనించింది.

రాజారావు పెదవి కదపకుండా ఉండిపోయాడు. యెన్నో ఆలోచనలు అతనిలో శరవేగంగా సాగుతున్నాయి.

"సార్ .... కార్ని .... తీసుకురమ్మంటారా?" డ్రైవర్ కంఠం ప్రశ్నించింది.

రాజారావు ఎదురుగా ఉన్న తెల్లటి గోడని చూస్తూ ఉండిపోయాడు. రాత్రి గూడ్స్ షెడ్ దగ్గర తను ఆపిన కార్ని యెవరో నేతాజీ స్ట్రీట్లో వదిలేశారు. అతనే అయ్యుంటాడు! డోర్ మీదా, సీటుమీదా, స్టీరింగ్ మీదా అతని వేలిముద్రలుండొచ్చు. వాటి ఆధారంతో పోలీసులు అతన్ని పట్టుకోగలరేమో! కానీ.... ఇప్పట్లో, ఈ స్థితిలో తను పోలీసులతో అంతా చెప్పలేడు.... తను ఇంకా వేచిచూడాలి.

"సుబ్బరావ్, కార్ని తీసుకురా" అన్నాడతను క్లుప్తంగా.

"సార్ ...." డ్రైవర్ కంఠం తటపటాయించింది. "తమరు కార్ని యెవరికేనా ఇచ్చారా? వెనక సీటుమీద పాత సూట్కేస్ ఉంది సార్ .... అందుకే అడుగుతున్నా ...."

రాజారావు ఉలిక్కిపడ్డాడు. సూట్‌కేస్ ఇంకా కార్లోనే ఉంది! కొంపదీసి అతను తీసుకోలేదా? ఎందుకు? ఆలోచనలకి స్వస్తి చెప్తూ అతను గొంతు సవరించుకున్నాడు. "సుబ్బరాజూ, ఇగ్నిషన్‌కీని నిర్లక్ష్యంగా కార్లో వదిలేసే వ్యక్తి గురించి మనం ఆలోచించక్ఖర్లేదు! వెంటనే కార్ని తోలుకురా! అర్జెంట్!" అంటూ అతను ఫోన్ని పడేశాడు.

పదినిముషాల తర్వాత గేట్‌లోకి తిరుగుతున్న కారు శబ్దం విని, గబగబా గారేజీవైపు అడుగులేశాడు రాజారావు.

అతని దగ్గరగా రాగానే డ్రైవర్ సుబ్బరాజు కార్ని స్లో చేస్తూ చూశాడు. గారేజీలో పెట్టమన్నట్టు రాజారావు అతనికి చేత్తో సైగచేశాడు. కారు గారేజీలో దూరింది. రాజారావు గారేజీలో ప్రవేశించాడు. ఇంజన్ని ఆఫ్ చేసి కిందికి దిగిన డ్రైవర్ని వాలుగా చూశాడు. రెండు చేతుల్తో జుబ్బా జేబుల్ని తడువుకున్నాడు.

"మేడమీద గదిలో టేబుల్ మీద సిగారూ, లైటరూ ఉన్నాయి; పట్రా" అన్నాడతను.

ఏదో చెప్పబోయిన డ్రైవర్, మనసు మార్చుకొని గబగబా వెళ్ళిపోయాడు. అతను కనుమరుగు కాగానే రాజారావు కారు దగ్గరగా నడిచి, వెనక తలుపు తెరిచాడు. సీటుమీద పడున్న సూట్‌కేసుని అర్థంకానట్టు చూశాడు. సూట్‌కేసు తను పెట్టిన మూలలోనే వుంది....

ముందుకి వొంగి రెండు చేతుల్తో లాక్స్‌ని రిలీజ్ చేసి సూట్‌కేస్ మూతని తెరిచాడు. ఆశ్చర్యంతో అతను నోరు తెరిచాడు. అతని కళ్ళు పెద్దగా అయ్యాయి.

సూట్‌కేస్ ఖాళీగా ఉంది....

రాజారావు కాసేపు స్తంభంలా నిలబడిపోయాడు. తటాలున యేదో ఆలోచన తట్టి కారు వెనకవైపుకి నడిచాడు. అతని గుండె వేగంగా కొట్టుకుంటోంది. వణికే చేతితో డిక్కీని తెరిచి, ఆత్రంగా చూశాడతను.

డిక్కీ బోసిగా ఉంది. నిట్టూర్చాడు రాజారావు.

మోహన్ ఆ సాయంత్రం తిరిగికూడా రాలేదు.

జుబ్బా జేబుల్లో రెండుచేతులూ దోపుకుని రాజారావు మొట్టమొదటిసారిగా బోనులో ఇరుక్కున్న సింహంలా గదిలో పచార్లు చేయసాగాడు.

నిస్సహాయస్థితిలో ఇరికించబడిన తను ముక్కుకి తాడు తగిలించబడిన ఎద్దులా అతను లాగమన్నచోటికి, లాగమన్న విధంగా బండిని లాగేడు. ఆ ఛండాలుడు మాట తప్పాడు! అయిదులక్షలు ముడుపు చెల్లించినా, మోహన్ తిరిగిరాలేదు....

గదిమధ్యలో నిలబడి రాజారావు చేతివేళ్ళని చిందరవందరగా ఉన్న జుట్టులో జొనిపి అసహనంగా సవరించుకున్నాడు. అతన్ని రెండు సందేహాలు పీడిస్తున్నాయి.

తన ముక్కుపిండి, అడకత్తెరలో ఇరికించి పైకం వసూలుచేసిన ఆ వ్యక్తి దగ్గర నిజంగానే మోహన్ ఉన్నాడా?

ఆ తర్వాత తనకి క్షేమంకాదన్న ఉద్దేశంతో అతను మోహన్ని శాశ్వతంగా మాయం చేశాడా?

టేప్ చేయబడిన మోహన్ కంఠాన్ని తను విన్నాడు. అది ఖచ్చితంగా మోహన్ కంఠమే! అంటే మోహన్ అతని చేతికి చిక్కాడన్నది నిర్వివాదం.

పనిపూర్తయ్యాక, ముఖ్య సాక్షి అయిన మోహన్ని

వాడు హతమార్చి ఉండొచ్చన్న ఆలోచన రాజారావు హృదయానికి సలుపు పుట్టిస్తోంది. అన్నమాట తప్పి, అమాయకుల్ని బలితీసుకుంటున్న. ఎవరో తెలీని ఆ వ్యక్తి మీద ఆగ్రహం రాజారావు రక్తంలో పరుగులు పెట్టడం ప్రారంభించింది. సకాలంలో పోలీసుల సహాయం తీసుకుని ఉంటే ఈ పరిస్థితి వచ్చివుండేది కాదేమో!

ఆలోచించడం మాని రాజారావు పక్కగదిలోకి నడిచాడు. అయిదునిమిషాల్లో సూటూ బూటూ ధరించి గదిలోంచీ బయటకు వచ్చాడు.

# 5

డిటెక్టివ్ టెంపో నిలువుటద్దంముందు నిలబడి నెక్‌టై సరిచేసుకున్నాడు. సన్నగా ఈల వేస్తూ, నుదురుమీదికి జారిన వెంట్రుకల పాయని క్రాఫు వొంపులోకి సర్దాడు. డార్క్ కలర్ సూట్‌లో ట్రిమ్‌గా అవుపిస్తున్న ప్రతిబింబాన్ని తృప్తికరంగా చూసుకొని గదిలోంచీ ఇవతలకి నడిచి, తలుపుమూసి తాళం వేశాడు. వెనక్కి తిరిగి మెట్ల వేపు ఠీవిగా అడుగులేశాడు.

మెట్లు దిగబోతున్న టెంపో తటాలున ఆగాడు. అతని చూపులు కింద, మెట్లమీదికి ఆకర్షించబడ్డాయి. ఫుల్ సూటులో ఉన్న వ్యక్తి బరువుగా మెట్లెక్కుతున్నాడు. అతని ఎడమచెయ్యి రెయిలింగ్ మీద పాకుతోంది. అతని తల కొద్దిగా పైకిలేచింది. చెమట లైటుకాంతిలో మెరుస్తోంది.

రెండు మెట్లకింద ఆగి, అతను టెంపో మొహంలోకి చూశాడు.

“మిస్టర్ టెంపో....” అన్నాడతను ఆయాసంతో కొద్దిగా వొగురుస్తూ.

"యస్?"

"మీతో మాట్లాడాలి...." అన్నాడతను.

డిటెక్టివ్ టెంపో ఒకసారి రిస్టువాచీ చూసుకున్నాడు. "రండి" అంటూ వెనుదిరిగి నడిచాడు. తాళం తీసి, తలుపు తెరిచాడు.

లోపల ప్రవేశించిన ఆ వ్యక్తికి కుర్చీ చూపించాడు. ఆ వ్యక్తి కూచోలేదు.

"మిస్టర్ టెంపో, అయామ్ రాజారావ్" అన్నాడతను కుడిచేతిని ముందుకి చాస్తూ.

టెంపో అతనితో కరచాలనం చేస్తూ చిరునవ్వు నవ్వాడు. సోఫాలో కూచుని రాజారావువైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"మిస్టర్ టెంపో, పదిరోజులకిందట మా అబ్బాయి-మోహన్ ఇంట్లోంచి యెటో వెళ్ళిపోయాడు ..." రాజారావు ప్రారంభించాడు.

టెంపో కళ్ళు చిట్లించాడు. "మిస్టర్ రాజారావ్, మీరు ఇక్కడికి రాకూడదు; పోలీస్ స్టేషన్ కెళ్ళాలి!" అన్నాడు నవ్వుతూ.

రాజారావు నీరసంగా చూశాడు. "మిస్టర్ టెంపో, మోహన్ వెళ్ళిపోయిన మరుసటిరోజే పోలీస్ స్టేషన్ కి వెళ్ళాను! దయచేసి కథంతా మీరు వినాలి. ఆ కథని పోలీసులు వినడం అంత మంచిదికాదనిపించి ఇలా వచ్చాను...."

డిటెక్టివ్ టెంపో సిగరెట్ వెలిగించి, రాజారావు వైపు చెప్పమన్నట్టు చూశాడు. రాజారావు గొంతు సవరించుకొని ప్రారంభించాడు....

"ఇదీ జరిగిన కథ...." అంటూ రాజారావు నిట్టూ

ర్వాడు.

టెంపో కుర్చీలోంచి లేచి, రాజారావు ముందు పచార్లు ప్రారంభించాడు. రెండునిమిషాల తరవాత ఆగి, రాజారావువైపు తిన్నగా చూశాడు. రాజారావు కళ్లల్లో ఆదుర్దా, ఆత్రం ప్రతిఫలిస్తున్నాయి.

"మిస్టర్ రాజారావ్, మీతో ఫోన్‌లో మాట్లాడిన వ్యక్తి—మీ అడకత్తెర—అతని కంఠాన్ని యెప్పుడేనా విన్నారా?" టెంపో ప్రశ్నించాడు.

రాజారావు తల అడ్డంగా ఊగింది. "లేదు.... ఎప్పుడూ వినలేదు...."

"కంఠస్వరాన్ని మీరు పోల్చుకోలేకపోవచ్చు. మాట్లాడే విధానం, యాస, అక్షరాల్ని ఒత్తిపలికే విధానం, ఒత్తులు లేకుండా పలకడం—ఈ తేడాల్ని గమనించారా?" టెంపో ప్రశ్నించాడు.

రాజారావు అర్థంకానట్టు చూశాడు.

"మిస్టర్ రాజారావ్, ఉదాహరణకి; మీరు, అర్థ రాత్రి, బాధ దగ్గిరా పదాల్ని వొత్తులు లేకుండా ఉచ్చరిస్తారు...." టెంపో నవ్వుతూ ఆగాడు.

రాజారావు అర్థమైనట్టు నవ్వాడు. "నేను మోహన్ గురించి ఆదుర్దాలో, కంగారులో వున్నాను. అదంతా నేను అబ్జర్వ్ చేయలేదు...."

"ఆల్‌రైట్, మీ అబ్బాయి కంఠాన్ని గుర్తించారా?" టెంపో ప్రశ్నించాడు.

"గుర్తించాను" రాజారావు తడుముకోకుండా అన్నాడు.

టెంపో అతన్ని చిరునవ్వుతో చూశాడు. "మీ అబ్బాయి ఫోన్‌లో మీతో మాట్లాడలేదు. రికార్డు చేసిన

చెవులోంచీ ఫోనగుండా విన్నారు. అతని కంఠాన్ని ఎలా గుర్తించారు?"

"మిస్టర్ టెంపో, దాదాపు ఇరవై ఏళ్ళుగా వాడి కంఠాన్ని రోజూ వింటున్నాను. నా కొడుకు కంఠాన్ని నేను పోల్చగలను!" రాజారావు జవాబిచ్చాడు. టెంపో అతన్ని చిరునవ్వుతో చూస్తూండిపోయాడు.

"మిస్టర్ టెంపో, అది ఖచ్చితంగా మోహన్ కంఠమే! నేను గుడ్డిగా ఆ వ్యక్తి మాటల్ని నమ్మలేదు! అబ్బాయి కంఠంలో భయం, ఆదుర్దా గంటల్లా ధ్వనించాయి. వాడు...వాడు బాగా హడిలిపోయాడని నేను ఖచ్చితంగా చెప్పగలను!" రాజారావు ఉద్రేకంతో అన్నాడు.

టెంపో మౌనంగా వెళ్ళి తన కుర్చీలో కూచున్నాడు. సిగరెట్ వెలిగించి, రాజారావువైపు కళ్ళు చిట్లిస్తూ చూశాడు.

"మిస్టర్ రాజారావ్, మీ అబ్బాయి ఏం చేస్తున్నాడు? చదువుకుంటున్నాడా?"

"డిగ్రీ అయ్యాక చదువు మానేశాడు. చదువుమీద ఆట్టే ఇంటరెస్టు లేదు. వాడొక్కడే మాకు సంతానం. నా బిజినెస్ చూసుకోడానికి, నిజం చెప్పాలంటే చెక్కులమీద సంతకాలు చేయడానికి ఆమాత్రం చదువు చాలు! అంచేత మానేయమన్నాను. ఇప్పుడిప్పుడే వ్యాపారంలో ప్రవేశిస్తున్నాడు...."

"మోహన్ ఎలాంటివాడు?" టెంపో ప్రశ్నించాడు.

"బుద్ధిమంతుడు. ఈ కాలం కుర్రాళ్ళలా అడ్డ-దిడ్డంగా తిరిగేరకం కాదు. ఇంట్లోనో, ఆఫీసులోనో గడిపేవాడు. సాయంత్రం అలా షికారుకెళ్ళేవాడు. మిస్టర్ టెంపో,

వాణ్ని చక్కటి సంస్కారంతో, తగిన కట్టుదిట్టమైన వాతావరణంలో పెంచాను...." రాజారావు సగర్వంగా అన్నాడు.

"మోహన్ ఎప్పుడేనా ఇలా యెక్కడికేనా వెళ్ళి, వారం పదిరోజుల తరవాత తిరిగిరావడం జరిగిందా?"

రాజారావు తలని అటూ ఇటూ ఆడించాడు. "నెవర్! మేనమామ ఇంటికెళ్ళి నాలుగురోజులుండి రమ్మని వాళ్ళమ్మ మొత్తుకున్నా వినలేదు. మా ఇద్దరికీ తెలీకుండా గడపదాటేవాడు కాదు. ఎప్పుడూ నేనో, వాళ్ళమ్మో వాడి కళ్ళకి కనిపిస్తూ ఉండాలి!"

"స్నేహితులు...." టెంపో ఏదో అడగబోయాడు.

"మిస్టర్ టెంపో, వాడికి ఎక్కువమంది స్నేహితులు లేరు. నలుగురైదుగురున్నారు. వాళ్ళందర్నీ అడిగి చూశాను. ఈ మధ్య వాడు వాళ్ళెవర్నీ కలుసుకోలేదు" రాజారావు అడ్డొస్తూ అన్నాడు.

"మిస్టర్ రాజారావ్, మోహన్ మనుషులతో కలుపుగోలుగా ఉండేవాడు కాడా?" టెంపో అడిగాడు.

"ఉండేవాడే. కానీ, మనుషుల తోకలు పట్టుకొని తిరిగేవాడు కాడు!" రాజారావు సగర్వంగా అన్నాడు.

టెంపో టేబుల్‌కి ఆనుకొని నిలబడి, క్షణకాలం కళ్ళుమూసుకున్నాడు. అతని నుదురుమీద ఏర్పడ్డ గీతల్ని అయోమయంగా చూస్తూ కూచున్నాడు రాజారావు. డిటెక్టివ్ టెంపో తటాలున కళ్ళు తెరిచాడు.

"మిస్టర్ రాజారావ్, చదువుకునే రోజుల్లో మోహన్‌కి దగ్గరైన మిత్రులు ఎవ్వరూ లేరా?"

"ఒకరిద్దర్ని ఒకటి రెండుసార్లు వాడు ఇంటికి తీసుకువచ్చాడు...."

"వాళ్ళెవరో....వాళ్ళ పేర్లూ అడ్రెసులూ నాకు కావాలి" టెంపో సాలోచనగా అన్నాడు.

"వాళ్ళని అడిగిచూశాను. లాభంలేదు. మిస్టర్ టెంపో...."

"వాళ్ళ అడ్రసులు నాకు కావాలి!" టెంపో అడ్డొస్తూ అన్నాడు.

"ఇస్తాను...." రాజారావు నిట్టూర్చాడు.

"మిస్టర్ రాజారావ్, మీ 'అడకత్తె' చాలా చాలా తెలివైనవాడిలా ఉన్నాడు. డిక్షనరీల్లోని పదాల్ని డిక్టేట్ చేసి, అతను తన అతితెలివిని ప్రదర్శించాడు...."

రాజారావు మాట్లాడకుండా చూశాడు. టెంపో అతన్ని తదేకంగా చూశాడు.

"అతితెలివి మనిషిని అడుక్కుతొక్కుతుంది!"

రాజారావు ముఖం నవ్వుతూ వికసించింది. "యూ ఆర్ కరెక్ట్! వాణ్ణి వెతికిపట్టి, అడుక్కుతొక్కడంలో మీరు నాకు సహాయం చేయండి!" అన్నాడతను ఆవేశంతో.

టెంపో సిగరెట్ వెలిగించాడు. "మిస్టర్ రాజారావ్, జరిగిందాన్నిబట్టి మీ అబ్బాయి అతని దగ్గర లేడనిపిస్తోంది...."

"వాట్!" రాజారావు ఆశ్చర్యంతో అరిచాడు.

"రోజుల తరబడీ పేపర్లో వచ్చిన మీ ప్రకటన చూశాడతను. మోహన్ని తను వెతికి బంధించినట్టు నాటకం ఆడుతూ మీనుండీ అయిదు లక్షలు గుంజుకొని ఉడాయించాడు!"

రాజారావు అదుర్దాగా చూశాడు. "మిస్టర్ టెంపో, మోహన్ మాటల్ని వాడు టేప్ ద్వారా నాకు వినిపిం

పించాడు. అబ్బాయి వాడి హస్తాల్లో లేకుండా వాడా పని చేయలేడు!"

టెంపో చిన్నగా నవ్వాడు. "మీరు చెప్పిందాన్ని బట్టి మోహన్ సాలిడ్‌గా మీతో యేమీ మాట్లాడ లేదు. 'నాన్నా .... నాన్నా ... నేను.... నన్ను....' వగైరా పాడిపాడి అక్షరాల్ని మీరు విన్నారు... "

"మిస్టర్ టెంపో, పాడి అక్షరాలైనా వాటిని పలికింది మోహన్! నన్ను నమ్మండి! ఎవడో మాట్లాడితే ఏమారిపోయి అయిదులక్షలు ముట్టజెప్పేంత మూర్ఖుణ్ని కాను!" రాజారావు ఉద్రేకంతో అన్నాడు.

టెంపో అతని కళ్ళల్లోకి సూటిగా చూశాడు. "అదృశ్యమైపోయిన మీ ఒక్కగానొక్క కొడుకు గురించి మీరు ఆదుర్దాతో ఉన్నారు. మీ శరీరంలోని ప్రతి అణువూ మీ కొడుకుకోసం పరితపిస్తోంది. అలాంటి సమయంలో టెలిఫోన్‌లో ఎవరు 'నాన్నా!' అనిపిలిస్తే అతనే మీ కొడుకు!"

రాజారావు దెబ్బతిన్నట్టు చూశాడు. "మిస్టర్ టెంపో, అయామ్ సారీ. నా మాటల్ని మీరు శంకిస్తున్నారు.... ఆల్ రైట్, అది మా అబ్బాయి కంఠం కాదనే అనుకుందాం. అనవసరంగా ఆ అడకత్తెగారికి అయిదు లక్షలు చెల్లించాననే అనుకుందాం, అలాంటప్పుడు మోహన్నీ, ఆ వ్యక్తినీ—ఇద్దర్నీ వెతికి పట్టుకోవాల్సిన బాధ్యత మీమీద ఉంటుంది!"

టెంపో చిన్నగా నవ్వాడు. రెప్ప వేయకుండా రాజారావు కళ్ళల్లోకి చూశాడు. "మిస్టర్ రాజారావ్, మీరు చెప్పిందాన్నిబట్టి మోహన్ గుల్లలో నత్తలా జీవించాడనిపిస్తోంది. బాగా గుర్తుచేసుకోండి: కాలేజీ

రోజుల్లో మోహన్ స్పోర్టివ్ గా ఉండేవాడా?"

రాజారావు అర్థంకానట్టు చూశాడు. "అంటే....?"

"స్పోర్ట్సులో, గేమ్సులో, ఇతర పోటీల్లో, నాటకాల్లో పాల్గొనేవాడు కాడా?"

"క్రికెట్, హాకీ, ఫుట్‌బాల్—ఇవన్నీ వాడికిష్టమే. అయితే యెవరేనా ఆడుతూంటే చూసి ఆనందించడందాకే ఆ ఇష్టం పరిమితం అయ్యుండేది!" రాజారావు జవాబిచ్చాడు.

"నాటకాలు" సిగరెట్‌ని యాష్ట్రేలోకి దోపుతూ అన్నాడు.

రాజారావు కళ్ళు చిట్లించాడు. ఆలోచన అతని నుదురు మీద వాగేటి గీతలు గీస్తోంది....

"....ఎప్పుడో వోసారి తను నటించే నాటకం చూడ్డానికి రమ్మన్నట్టు గుర్తొస్తోంది. తీరికలేక వెళ్ళలేదనుకుంటా...."

"మిస్టర్ రాజారావ్, మోహన్‌తో పరిచయమున్న వ్యక్తులందరి అడ్రసులూ ఇచ్చి వెళ్ళండి. చేయగలిగింది చేస్తాను" టెంపో తన కుర్చీలో కూచుంటూ అన్నాడు.

అడ్రెసులు రాసిన కాగితాన్ని డైరీలోంచీ చింపి, రాజారావు టెంపో ముందు టేబుల్ మీద పెట్టాడు.

"మిస్టర్ టెంపో .... మీ ఫీజు...." రాజారావు ఆగాడు, కోటుజేబులో చెయ్యి పెడ్తూ.

"దానికన్నా ముఖ్యమైన పనొకటి మీరు చేయాలి మిస్టర్ రాజారావ్!" టెంపో నవ్వుతూ అన్నాడు.

రాజారావు ప్రశ్నార్థకంగా చూశాడు. టెంపో అతన్ని తదేకంగా చూశాడు.

"తిన్నగా పోలీస్ హెడ్‌క్వార్టర్స్‌కి వెళ్ళండి.

జరిగిందంతా కమీషనర్ గారికి విన్నవించండి!"

"మిస్టర్ టెంపో....పోలీసుల్దాకా వెళ్తే ఇదంతా బైటికి పొక్కుతుంది. నా పరువు పోతుంది. ముఖ్యంగా అసలు వ్యక్తి అయిపులేకుండా పోతాడు. మోహన్ కి యేదేనా అపాయం జరగొచ్చు. పైగా....కమీషనర్ — నా మిత్రుడు. ఆయన నన్ను అపార్థం చేసుకుంటాడు.." రాజారావు అనుమానిస్తూ అన్నాడు.

"మిస్టర్ రాజారావ్, ఆకుల చాటున ఎంతకాలం దాక్కున్నా వంకాయ మార్కెట్లోకి రావాల్సిందే! జరిగిన నేరాలు పోలీసులకి సకాలంలో తెలియజేసి తీరాలి!"

"అదికాదు...." రాజారావ్ తడబడుతూ అన్నాడు,

"మాటవరసకి మోహన్ కి యేదేనా ఆపద జరిగిందనుకుందాం. అతని శరీరం మీ ముందు ప్రత్యక్షమైందనుకుందాం. అప్పుడు మీరు పోలీసులకి రిపోర్టు చేయరూ? హంతకుణ్ని పట్టి ఉరితీయమని ఆక్రోశించరూ?" టెంపో నవ్వుతూ ప్రశ్నించాడు.

రాజారావు మొహం పాలిపోయింది. ఆరిపోతున్న పెదవుల్ని తడుపుకుంటూ, బాధగా చూశారు.

"టెంపోగారూ, అంతా మీమీద వదిలేస్తున్నాను. నేను....ఎక్కడికీ వెళ్ళను. తిన్నగా ఇంటికెళ్తాను. మీ ఇష్టమొచ్చినట్టు చేయండి. మా అబ్బాయిని మాకు దక్కించండి!" రాజారావు బరువుగా అన్నాడు.

టెంపో అతన్ని సానుభూతితో చూశాడు. నవ్వుతూ లేచి నిలబడ్డాడు.

"ధైర్యంగా ఉండండి. ఫీజు గురించి తరవాత

చెప్తాను. వెళ్ళిరండి!" అన్నాడు.

రాజారావు నీరసంగా కుర్చీలోంచి లేచాడు.

# 6

డిటెక్టివ్ టెంపో చూపుడు వేలు కాలింగ్ బెల్ బటన్ని నొక్కింది. సగం కాలిన సిగరెట్‌ని రోడ్డు మీదికి విసిరాడతను.

తలుపు తెరుచుకుంది. లుంగీ, బనియన్‌తో ఉన్న వ్యక్తి ప్రశ్నార్థకంగా చూస్తున్నాడు. బనీను పైనుంచీ అతని ఛాతీమీద, గొంతుకదాకా వెంట్రుకలు దట్టంగా అవుపిస్తున్నాయి. భుజాలమీదకూడా వెంట్రుకలు నల్లగా, పల్చగా మెరుస్తున్నాయి. మీసాలులేని అతని మొహంలోకి టెంపో నవ్వుతూ చూశాడు.

"మిస్టర్ శ్రీనివాసరావ్, అయామ్ టెంపో...."

శ్రీనివాసరావు గుబురు కనుబొమలు పైకిలేచాయి. అతని మొహంమీదున్న ప్రశ్నార్థకాన్ని చిరునవ్వు తుడిచేసింది.

"డిటెక్టివ్ టెంపో....అవునా? ప్లీస్ కమిన్! మీ గురించి అక్కడా ఇక్కడా విన్నాను...." శ్రీనివాసరావు తలుపు బర్లా తెరిచాడు. టెంపో గుమ్మందాటి, అతన్ని అనుసరించాడు.

"కుసుమా, కుసుమా....మనింటికి ఒక ప్రముఖ వ్యక్తి వచ్చారు! కాఫీ తీసుకురా!" శ్రీనివాసరావు అరిచాడు. టెంపోకి సోఫా చూపించాడు.

టెంపో కూచుని, చిన్న హాలుని కలయజూశాడు. మూలలో పోర్టబుల్ టి.వి. సెట్ ఉంది. టి.వి. పైన, రెండు గోడలూ కలుసుకున్న కోణంలో, వేళ్ళాడుతున్న ఫోటోలోని యువతి హాయిగా నవ్వుతోంది. తెల్లటి

పళ్ళమీది నవ్వు నల్లటి కళ్ళలోకి వెలుగుల్లా పాకుతోంది...

"టెంపోగారూ నా భార్య: కుసుమ!"

టెంపో చూపుల్ని తిప్పాడు. ఫోటోలోని యువతి అతనిముందు, ఫోటోలోలాగే హాయిగా నవ్వుతూ నుంచుంది. ఆమె చేతుల్లో ట్రే ఉంది. ముందుకి వొంగి ట్రేని టెంపో దగ్గరగా పట్టుకుందామె. టెంపో కాఫీ అందుకున్నాడు. భర్తకి కప్పు అందించి అతనిపక్కనే సోఫాలో కూచుంది కుసుమ.

"మిమ్మల్ని ముఖాముఖి కలుసుకోకపోయినా, మీ గురించి విన్నాం!" కుసుమ టెంపోవైపు నవ్వుతూ అంది.

టెంపో నవ్వుతూ తలపంకించాడు, కాఫీకప్పుని టీపాయ్‌మీద పెట్టి. సిగరెట్ పాకెట్ తీశాడు. పాకెట్‌ని శ్రీనివాసరావువైపు చాచాడు.

"నో థాంక్స్" శ్రీనివాసరావు నవ్వుతూ అన్నాడు. "మిష్టర్ టెంపో. తమరిలాంటి పెద్దలు ఊరికేరారు...."

"మోహన్ మీ ఫ్రెండని విన్నాను...." టెంపో ఆగి, చూశాడు.

శ్రీనివాసరావు మొహాన్ని విచారం పొగమంచులా కప్పింది. అతను నిట్టూర్చాడు.

"పదిరోజులుగా అతన్ని గురించే ఆలోచిస్తున్నా. రాజారావుగారు ఫోన్ చేసి చెప్పినప్పుడు నమ్మలేకపోయాను. మోహన్ నాకు రెండేళ్ళ జూనియర్ అయినా, మా ఇద్దరిమధ్యా చక్కటి స్నేహం ఏర్పడింది. నాకన్నా కొంచెం చిన్నవాడైనా, నన్ను ఏకవచనంలో పిలిచేది అతనొక్కడే...."

"మాయమయ్యేముందు మోహన్ మీకు కనిపించాడా?" శ్రీనివాసరావు ప్రవాహానికి అడ్డుతగుల్తూ

కెంపో ప్రశ్నించాడు.

"కనిపించాడు."

కెంపో ప్రశ్నార్థకంగా చూశాడు. "అప్పుడు అతను ఎలా ఉన్నాడు? విచారంగా కనిపించాడా?"

"నిజం చెప్పాలంటే అందుకు ఖచ్చితంగా వ్యతిరేకంగా, హుషారుగా అవుపించాడు. తన ఆలోచనల్ని నాకు చెప్పకుండా దాచుకోలేదతను ఎప్పుడూ. అందుకే నాకు ఆశ్చర్యంగా ఉంది!"

"మిస్టర్ శ్రీనివాసరావ్, మోహన్ బుద్ధిపూర్వకంగా ఎక్కడికైనా వెళ్ళిపోయి ఉంటాడా?" కెంపో అడిగాడు.

"నేనలా అనుకోను...."

"ఎవరేనా అతన్ని కిడ్నాప్ చేసివుండొచ్చా?"

శ్రీనివాసరావు ఇబ్బందిగా చూశాడు. "అదికూడా నేను ఊహించలేకుండా ఉన్నాను...."

కెంపో అతన్ని తదేకంగా చూశాడు. "మిస్టర్ శ్రీనివాసరావ్, ఏ కారణమూ లేకుండా యెవ్వరూ అంతర్ధానం అయిపోరు!"

"యూ ఆర్ రైట్. అయితే, స్వతస్సిద్ధంగా ఇంట్లోంచీ వెళ్ళిపోవాల్సిన అవసరం మోహన్‌కి లేదు. అతనడిగితే రాజారావుగారు కొండమీది కోతినైనా తెచ్చిస్తారు.... మోహన్ చాలా నెమ్మదైన వ్యక్తి. అతనికి శత్రువులే లేరు. అడ్డమైనవాళ్ళతో అతను తిరిగే రకం కాదు. పగతో ఎవ్వరూ అతన్ని కిడ్నాప్ చేసివుండరు!" శ్రీనివాసరావు కెంపోవైపు చూస్తూ అన్నాడు.

"పగ తీర్చుకోడంకోసం కాకుండా పైకంకోసం కిడ్నాప్ చేసివుండొచ్చు!" కెంపో నవ్వుతూ అన్నాడు.

శ్రీనివాసరావు చిరునవ్వు నవ్వాడు. "మీరు చెప్పేది లాజికల్ గా బావుంది. అయితే మోహన్ని ఎవరూ కిడ్నాప్ చేయలేదని అనుకోవాలి. ఇంతవరకూ ఎవరూ పైకం చెల్లించమని రాజారావుగార్ని అడగలేదు!"

"తనూ వెళ్ళకపోతే, మరొకరూ బలవంతంగా తీసుకెళ్ళకపోతే, మోహన్ ఇంట్లో ఉండాలి!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"కరెక్టు!" కుసుమ అంది.

"అయితే మోహన్ కి ఏమయ్యింది? అతనేమయ్యాడు?" టెంపో మరో సిగరెట్ వెలిగించి, అన్నాడు.

శ్రీనివాసరావూ, కుసుమా అతన్ని నిస్సహాయంగా చూశారు.

"అది కనుక్కోడానికే రాజారావుగారు మిమ్మల్ని నియమించారనుకుంటాను...." శ్రీనివాసరావు మెల్లిగా అన్నాడు.

టెంపో తలాడించాడు. "ఆ ప్రయత్నంలోనే మీ దగ్గరకొచ్చాను, మిస్టర్ శ్రీనివాసరావ్. దూరంగా, ఎక్కడేనా — మోహన్ కి దగ్గర మిత్రులెవరేనా ఉన్నారా?"

నుదురు చిట్లిస్తూ శ్రీనివాసరావు తలని అడ్డంగా తిప్పాడు.

"నాకు తెలిసినంతవరకూ లేరు. మోహన్ స్నేహితుల గురించి నాకు పూర్తిగా తెలుసు!"

"రామ్మోహన్, నిరంజనం, మీరూ అతని మిత్రులని రాజారావుగారు చెప్పారు. మీ ముగ్గురూ కాకుండా మరెవరేనా స్నేహితులతనికి ఉన్నారా?" టెంపో ప్రశ్నించాడు.

"రెండేళ్ళ క్రితందాకా మోహన్ రంగధామ్‌తో క్లోజ్‌గా ఉండేవాడు. ఈమధ్య ఇద్దరు కలిసి నాకు కనిపించలేదు. ఒకటి రెండుసార్లు అడిగాను. రంగధామ్ బిజీగా ఉన్నాడన్నాడు మోహన్" శ్రీనివాసరావు జవాబిచ్చాడు.

"రంగధామ్ ఎక్కడుంటాడు?" టెంపో ప్రశ్నించాడు.

"141, బోస్ రోడ్, గాంధీనగర్."

టెంపో నించుని, వాళ్ళిద్దరివైపూ నవ్వుతూ చూశాడు. "థాంక్స్. వెళ్తాను...."

శ్రీనివాసరావు లేచాడు. "ఏదేనా తెలిస్తే ఫోన్ చేస్తారా? ఇంట్లో ఫోన్ లేదు. ఆఫీసులో ఉంది; 41324."

టెంపో తలాడిస్తూ, కుసుమవైపు నవ్వి కదిలాడు.

## 7

విశాలంగా ఉన్న ఖాళీప్రదేశం మధ్యలో ఒంటరిగా నిలుచున్న చిన్న ఇంటివేపు టెంపో అడుగులేశాడు. మెట్లెక్కి, వరండాలో మూసిన తలుపుముందు నిలబడ్డాడు. క్షణకాలం కాలింగ్ బెల్ స్విచ్ కోసం వెతికి, వేళ్ళకణుపుల్తో తలుపుమీద చప్పుడుచేశాడు. నిమిషాలు గడుస్తున్నాయి.

రెండోసారి తలుపు తట్టబోతూ, మెత్తటి అడుగుల చప్పుడు విని టెంపో ఆగాడు. కాసేపట్లో తలుపు తెరుచుకుంది. గుమ్మంలోపల తెల్లటి దుస్తుల్లో, తెల్లటి జుట్టుతో నిలబడ్డ ముసలామెని టెంపో చిరునవ్వుతో చూశాడు. ఆమె చేతిలో భగవద్గీత ఉంది. పుస్తకం మధ్యలో ఆమె చూపుడువేలు ఇరుక్కుంది. దళసరి కళ్ళద్దాల్లోంచీ ఆమె

ప్రశ్నార్థకంగా చూస్తోంది.

"రంగధామ్ ..." టెంపో ఆగాడు.

ముసలామె వెనక్కి జరిగింది. చేతిలో ఉన్న భగవద్గీతతో యెడమవేపు చూపింది. "ఆ గదిలో ఉన్నాడు...." అందామె నిర్లిప్తంగా.

టెంపో గడప దాటాడు. ఎడమవైపు, మూసిన తలుపు మీద అతని చూపులు పడ్డాయి.

"బాబూ, నిన్నెప్పుడూ అబ్బాయితో చూడలేదు.."

ముసలామె కంఠం విని టెంపో ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"నేను రంగధామ్ కొత్త మిత్రుణ్ని!"

ముసలామె తలాడిస్తూ హాల్లో గోడవారగా, కిటికీ దగ్గరగా ఉన్న కుర్చీవేపు నడిచింది. టెంపో మూసిన గదిముందుకు చేరుకున్నాడు. తలుపులు పూర్తిగా మూయబడలేదు. టెంపో గొళ్ళేన్ని చప్పుడు చేశాడు. కాసేపు నిశ్శబ్దాన్ని వింటూ నిలబడ్డాడు. మళ్ళీ అతని చెయ్యి గొళ్ళేన్ని కదిలించింది.

"ఎవరు?" బొంగురు కంఠం విసుగ్గా లోపల్నించీ అడిగింది.

"నే నే!" టెంపో బిగ్గరగా అన్నాడు.

క్షణకాలం నిశ్శబ్దం. "తలుపు తెరిచేవుంది!" బొంగురు కంఠంలో చిరాకు స్పష్టంగా ధ్వనించింది.

టెంపో లోపలికి దూరి, తలుపుని యథాప్రకారం మూసేశాడు. అతని దృష్టి గది మధ్యలో ఉన్న ఆకారం మీద కేంద్రీకరించబడింది.

కండలుతిరిగిన శరీరం. పొట్టిగా కత్తిరించిన క్రాపు. గుబురుగా ఉన్న కనుబొమలకింద తళతళమంటున్న

ఏనుగుకళ్ళు. బిగించిన పిడికిళ్ళు. అతని వొంటిమీద ఎర్రటి లంగోటీతప్పా వేరే దుస్తులు లేవు. నూనెపట్టించినట్టు అతని శరీరం మెరుస్తోంది. దగ్గరగా, మడమలు ఆన్చి ఉన్న అతని పాదాల చుట్టూ చెమట చిన్న మడుగు కట్టింది. రంగధామ్ వ్యాయామానికి తను భంగం కలిగించినట్టు బొంపో తెలుసుకున్నాడు.

నిష్కారణంగా తను ద్వేషిస్తున్న ఎద్దుని చూస్తున్న బుల్ ఫైటర్ లా బొంపోని చూస్తున్నాడు రంగధామ్.

"నేనే అంటే యెవరో అనుకున్నా... హూ ఆర్ యూ?" రంగధామ్ ఆక్షేపణగా అడిగాడు.

"మిస్టర్ రంగధామ్, ఎవరనుకున్నావ్?" బొంపో ప్రశ్నించాడు.

రంగధామ్ ఏనుగుకళ్ళు బొంపోని ఎగాదిగా చూశాయి. "నువ్వెవరో లేదు!"

బొంపో చిన్నగా నవ్వాడు. "రంగధామ్, ఐయామ్ డిటెక్టివ్ బొంపో."

రంగధామ్ మొహానికి అతికించిన ఏదో పొరని ఎవరో వొలిచి పారేసినట్టయింది. అతని కళ్ళల్లో, మొహంలో ఇందాకటి భావం మారిపోయింది.

"సారీ .. ఏకవచనం ప్రయోగించాను...." అంటూ రంగధామ్ గోడకున్న మేకుకి వేళ్ళాడుతున్న టర్కిష్ తువ్వాల్ని అందుకొని భుజాలమీదుగా వేసుకున్నాడు. బొంపోవైపు చూశాడు. రబ్బరులా అతని మొహంమీద చిరునవ్వు కనిపించింది.

"బొంపోగారూ, ఇలా వచ్చారు ...?"

"నీతో కొంత మాట్లాడాలి ..." బొంపో నవ్వుతూ

అన్నాడు.

రంగధామ్ గోడవారగా ఉన్న కుర్చీని చూపించాడు. టెంపో కుర్చీవైపు అడుగులేశాడు. కుర్చీపైన గోడకి, అయిదారుగురు వస్తాదుల కలర్ ఫొటోలు వేళ్ళాడుతున్నాయి. కుర్చీలో కూచుని, తన ముందునుంచున్న వస్తాదువైపు చూశాడు టెంపో. గుండ్రటి భుజాల్ని ఎగరేసి, వేళ్ళను కదల్చడం ప్రారంభించాడు రంగధామ్. మరో కుర్చీకోసం టెంపో అటూ ఇటూ చూశాడు.

"వేకువజామున నాలుగ్గంటలనుండీ పదిదాకా నేను కూచోను. చెప్పండి" టెంపో చూపుల్ని అర్థంచేసుకున్న రంగధామ్ అన్నాడు.

"రంగధామ్, మోహన్ ఈమధ్య నీకు కనిపించాడా?" టెంపో ప్రశ్నించాడు.

రంగధామ్ ఏనుగుకళ్ళని చిట్లించాడు. "ఈమధ్యే కాదు....ఆమధ్యనుంచీ కూడా అతను నాకు కనిపించలేదు "

టెంపో కనుబొమలు అతని నుదుర్ని పైకిలేస్తూ లేచాయి.

"అతనూ, నువ్వూ స్నేహితులని విన్నాను...."

"కాలేజీ స్నేహాలు కాలం గడిచేకొద్దీ పల్చబడతాయి!" రంగధామ్ నవ్వే ప్రయత్నంచేస్తూ అన్నాడు.

మోహన్ గురించి తను ఎందుకడుగుతున్నాడో కనుక్కోడానికి ప్రయత్నించని రంగధామ్ ప్రవర్తన టెంపోకి ఆశ్చర్యాన్ని కలిగించింది.

"రంగధామ్, నువ్వు మ్యాప్ పేపర్ చదువుతావా?" టెంపో ప్రశ్నించాడు.

ఏనుగుకళ్ళు అతన్ని అదోలా చూశాయి. "పత్రికలూ, నవలలో చదువుతాను. ఐ హేట్ న్యూస్ పేపర్స్!"

టెంపో ఆశ్చర్యంగా చూశాడు. "మోహన్ కనిపించడంలేదు...." అన్నాడు మెల్లిగా.

రంగధామ్ కళ్ళు కొంచెం పెద్దగా అయ్యాయి. పెదవుల చివరలు అదోరకంగా కదిలాయి. "ఐసీ...." అన్నాడతను అరచేత్తో మెడని రుద్దుకుంటూ.

"వారం రోజులపాటు పేపర్లో అతని అంతర్ధానం గురించిన ప్రకటన వచ్చింది.." టెంపో రంగధామ్ మొహంలోకి చూస్తూ ఆగాడు.

"ఐసీ..అందుకే నేను న్యూస్ పేపర్స్ చదవను. లోకంలోని చావు కబుర్లన్నీ ఉంటాయి. ఐ హేట్ సచ్ థింగ్స్!" రంగధామ్ పొట్టిగా ఉన్న క్రాఫుని రుద్దుకుంటూ అన్నాడు.

టెంపో సిగరెట్ వెలిగించాడు. మోహన్ అంటే రంగధామ్‌కి అంతగా అభిమానంలేదని అతనికి అర్థమవుతోంది. అతను మోహన్ మిత్రుడంటూ తనకి ఇన్ఫర్మేషన్ అందింది.

"మిస్టర్ టెంపో, అతను ఇంట్లోంచీ పారిపోయాడా?" రంగధామ్ ప్రశ్న టెంపో ఆలోచనల్ని తుంచేసింది.

"అలా అనుకోవాల్సిందే!" టెంపో నవ్వాడు.

"ప్రతిమని కలుసుకున్నారా?" రంగధామ్ ప్రశ్నించాడు.

ప్రతిమ! టెంపో ప్రశ్నార్థకంగా చూశాడు. "ప్రతిమ ఎవరు?"

రంగధామ్ చూపుల్ని తిప్పి, టెంపో పైన గోడకి

కళ్ళ్యాడుతున్న తన ఆదర్శ పురుషుల్ని చూడ్డం ప్రారంభించాడు.

"ప్రతిమ....ప్రతిమ .... నా .... ఆతని స్నేహితురాలు.." అన్నాడతను అయిష్టంగా. ప్రతిమ ఎవరో, ఆమె ప్రసక్తి తీసుకువచ్చినందుకు అతను విచారిస్తున్నాడని అతని వాలకం. కంఠం చెప్తున్నాయి.

"రంగధామ్, నీకు తెలిసిందంతా చెప్పు. మోహన్ ప్రమాదంలో ఇరుక్కున్నాడనిపిస్తోంది. అతన్ని రక్షించాలి" టెంపో అతని మొహంలోకి చూస్తూ అన్నాడు.

రంగధామ్ చూపుల్ని టెంపోవైపు తిప్పి వెటకారంగా నవ్వాడు. "ప్రమాదంలో కాదు-ప్రణయంలో ఇరుక్కుని ఉంటాడు!"

టెంపో ఆశ్చర్యంగా చూశాడు. "యూ మీన్.."

"మిస్టర్ టెంపో. ప్రతిమని అతను ప్రేమిస్తున్నాడు. అట్ లీస్టు. ప్రేమిస్తున్నట్టు ఆమెని నమ్మిస్తున్నాడు!" రంగధామ్ గోడమీద లావుపాటి వస్తాదుని తదేకంగా చూస్తూ అన్నాడు.

టెంపో కాసేపు నిగనిగలాడుతున్న అతని శరీరాన్ని చూస్తూ ఉండిపోయాడు. రంగధామ్ వాలకం అతనికి ఎంతో చెప్తోంది. చిరునవ్వు అతని మొహమ్మీద తాండవించింది.

"రంగధామ్, ప్రతిమను నువ్వు ప్రేమించావ్! అవునా?" అన్నాడతను.

రంగధామ్ ఉలిక్కిపడ్డట్టు, టెంపోవైపు చూశాడు.

"మీకెలా తెలుసు?" బొంగురుగా అడిగాడతను.

"నీ కళ్ళు, నీ మొహం నాకు చెప్తున్నాయి!" టెంపో నవ్వుతూ అన్నాడు.

రంగధామ్ చిరునవ్వుతో చూశాడు. "నా కళ్ళూ, మొహమూ చెప్పే నిజాన్ని మీలాగా ఆమె గుర్తించలేకపోయింది.." అతని కంఠం నూతిలోంచీ అరిచే బోదురుకప్ప కంఠంలా ధ్వనించింది.

బెంపో అతన్ని సానుభూతితో చూశాడు. అతనిలో యెన్నో ఆలోచనలూ, అనుమానాలూ ఒకదాన్నొకటి తరుముకుంటూ సాగుతున్నాయి.

"రంగధామ్, ప్రతిమ మోహన్ని ప్రేమించిందా?" బెంపో ఉన్నట్టుండి ప్రశ్నించాడు.

రంగధామ్ ఉలిక్కిపడ్డాడు. అతని కణతలోని నరం అప్పుడే ప్రాణం వచ్చినట్టు టకటక కొట్టుకుంది. పెదవుల చివరలు కదిలాయి. అతని విశాలమైన కళ్లల్లో ఏదో తళుక్కున మెరిసింది. అతను తదేకంగా క్షణంసేపు బెంపోని చూశాడు.

"మిస్టర్ బెంపో, అదంతా గతం. తిన్న తిండిని వాంతిచేసుకోడం నాకిష్టంలేదు..."

బెంపో అవునన్నట్టు తలాడించాడు. "రంగధామ్, నువ్వు అందంగా, ఆరోగ్యంగా ఉన్నావ్. కండలు తిరిగిన శరీరం నీది, ప్రతిమని మోహన్‌కి యెందుకు వదిలేశావ్?"

రంగధామ్ పిడికిళ్ళు బిగుసుకున్నాయి. రెండుసార్లు అతను గుటకలు మింగాడు. తీక్షణంగా తన పాము కళ్ళతో బెంపోని చూశాడు.

"మిస్టర్ బెంపో. లోకంలో కండబలంకన్నా ధనబలం గొప్పది!" అన్నాడతను క్లుప్తంగా.

బెంపో లేచి. నిల్చున్నాడు. చెమటతో కొండచిలువలా మెరుస్తున్న రంగధామ్ శరీరాన్ని కాసేపు

చూశాడు.

"రంగధామ్, ఉద్యోగం చేస్తున్నావా?" టెంపో ప్రశ్నించాడు. విషయం మార్చిన టెంపోని, రంగధామ్ కొంచెం ఆశ్చర్యంతో చూశాడు.

"ఉద్యోగం దొరికి ఉంటే ఇలా వ్యాయామం చేస్తూ కూచోను!" అన్నాడతను నవ్వుతూ.

"అయితే.." టెంపో అర్థవంతంగా ఆగాడు.

"నాన్న తగు మాత్రం సంపాయించి, నిలవ్వేసి పోయాడు. ఇల్లు సూ దే. గడిచిపోతోంది..." రంగధామ్ మెల్లిగా అన్నాడు.

టెంపో రెండడుగులు కదిలి ఆగాడు. "రంగధామ్, ప్రతిమ ఎవరు? ఎక్కడుంటుంది?"

"ఎందుకు?" రంగధామ్ ప్రశ్నించాడు.

"మోహన్ ఆమెని కలుస్తున్నాడేమో కనుక్కోవాలి.." టెంపో జవాబిచ్చాడు.

రంగధామ్ క్షణకాలం తటపటాయిస్తూ చూశాడు. "టెంపో గురూ, అతన్ని వెతికి పట్టితే, వాళ్ళ నాన్న మీకు డబ్బిస్తాడా?"

"అఫ్ కోర్స్...."

రంగధామ్ చిరునవ్వు నవ్వాడు. "ప్రయత్నం చేసి నందుకు యింతో కొంత గుంజుకొని విశ్రాంతి తీసుకోండి. అతను అందరూ అనుకునేంత అమాయకుడేం కాడు. ఊరూరూ తిరిగి, ఉన్నదంతా తగలేసి భద్రంగా తిరి గొస్తాడు!"

టెంపో అతన్ని ఆశ్చర్యంగా చూశాడు. రంగధామ్ పాముకళ్ళు ఎండలో అద్దంబిళ్ళలా మెరుస్తున్నాయి. టెంపో చిన్నగా నవ్వాడు.

"యూ మే బీ రైట్! ఇంకొక ప్రయత్నం చేసి, మానేస్తాను. ప్రతిమ యెవరో నువ్వూ చెప్పలేదు...."

రంగధామ్ మొహం బిగుసుకుపోయింది. నిట్టూర్పు సెగలు కక్కుతూ అతనిలోంచీ బైటపడింది. తన ఆవే శాన్ని అదుపులో పెట్టుకొని టెంపో వైపు చూశాడతను.

"ఆమెని కలుసుకున్నాక, నా గురించి ఆమె ముందు మాట్లాడననీ—నా పేరెత్తననీ—మీరు మాట ఇస్తే చెప్తాను...."

టెంపో భుజాలెగరేసి, చిరునవ్వు నవ్వాడు. "యూ హావ్ మై వర్డ్, రంగధామ్!"

రంగధామ్ తటపటాయించాడు. ప్రతిమ ఎవరో, ఎక్క డుంటుందో అతను చెప్పాడు. టెంపో నమ్మలేనట్టు చూశాడు. రంగధామ్ నిజమే చెప్తున్నాడా? టెంపో అతని మొహంలోకి దేనికోసమో వెతుకుతున్నట్టు చూశాడు. ఒక వ్యక్తి చిరునామాను తప్పుగా చెప్పేంత మూర్ఖత్వం ఆ మొహంలో కనిపించడంలేదు.

"ఓకే, రంగధామ్. థాంక్యూ వెరీమచ్!" టెంపో నవ్వుతూ చూశాడు.

"వెల్ కమ్!" అంటూ రంగధామ్ కుడిచేతిని ముందుకి చాచాడు.

చెమటతో, నూనెతో నిగనిగలాడుతున్న అతని చేతిని టెంపో క్షణకాలం చూశాడు. చూపుల్ని మెల్లిగా రంగధామ్ మొహంలోకి తిప్పాడు. చిరునవ్వుతో చూశాడు. రంగధామ్ చెయ్యి ఇంకా ముందుకి చాచే వుంది.

"కసరత్తు చేసేవాళ్ళతో కరచాలనం చేస్తే వాళ్ళ బలమంతా నాలోకి ప్రవేశిస్తుంది! ఓకే; వెళ్లొస్తా!"

అంటూ వెనుదిరిగాడు.

రంగధామ్ నవ్వు బిగ్గరగా, బొంగురుగా తలుపుదాకా అతన్ని వెంబడించింది. తన వెనకే తలుపుల్ని మూస్తూ టెంపో హాలుమధ్యకి నడిచాడు. గోడదగ్గర కుర్చీ ఖాళీగా ఉంది. ముసలామె—రంగధామ్ తల్లి—ఎక్కడికెళ్ళింది?

చిన్న చప్పుడు కుడివైపునుంచీ టెంపో దృష్టిని ఆకర్షించింది. అటువైపున ఉన్న గదిలో పుస్తకాల రాక్స్ ముందు నిలబడింది ఆమె. యేదో పుస్తకంకోసం వెతుకుతోంది.

ఆనాలోచితంగా టెంపో ఆ గదివేపు నడిచాడు. గుమ్మంలో నిలబడి, ద్వారబంధాలమీద రెండు చేతుల్నీ ఆని, గోడల్ని పూర్తిగా కప్పేసిన రాక్స్‌నీ, వాటిలో దొంతరలుగా పేర్చబడిన ఎన్నో పుస్తకాల్నీ చూస్తూండిపోయాడు. తెలుగు, ఇంగ్లీషు పుస్తకాలు చాలా ఉన్నాయి. చాలామట్టుకు వేదాంత గ్రంథాలే. టెంపో చిన్నగా దగ్గాడు.

ఆమె తటాలున తిరిగిచూసింది. టెంపో చిరునవ్వు నవ్వాడు.

"చాలా గ్రంథాలు సేకరించారు, పిన్నిగారూ!" అన్నాడతను.

"అన్నీ ఆయన కొని, పోగుచేశారు. ఆయనా పుస్తకాల పురుగు నాయనా! అబ్బాయికి అంత ఇష్టంవున్నట్టులేదు. ఇరవై నాలుగ్గంటలూ కసరత్తే వాడికి!" ముసలామె నవ్వుతూ అంది.

టెంపో గదిలోకి నడిచాడు. రంగధామ్ తండ్రి సేకరించిన వివిధ గ్రంథాల పేర్లని చదువుతూ ఉండిపోయాడు. ముసలామె తనని సగర్వంగా చూస్తోందని

అతనికి తెలుసు.

రకరకాల సైజుల్లో భగవద్గీత, అష్టాదశపురాణాలు, భారతం, భాగవతం, రామాయణం, ప్రబంధాలు, అరబిందో, రామకృష్ణ, వివేకానంద, రమణ వగైరా వేదాంతుల గ్రంథాలు.... టెంపో చూపులు పుస్తకాల వరసమ్మట పరుగెడుతున్నాయి.

ఎడమవైపు రాక్‌లోని రెండు పుస్తకాలమీద అతని చూపులు ఆగాయి. నీట్‌గా పేర్చబడిన పుస్తకాల దొంతరమధ్య ఇరుక్కున్న ఆ రెండు పుస్తకాలూ కొద్దిగా ముందుకు జరిగివున్నాయి. ఆ వరసలో ఆ రెండే ఇవతలికి పొడుచుకొచ్చాయి. వాటి పేర్లు టెంపో కళ్ళముందు యెందుకో తళతళ మెరుస్తున్నాయి. శబ్దరత్నాకరం.... వెబ్‌స్టర్ డిక్షనరీ....

## 8

తలుపు తెరిచి, ఎదురుగా నుంచున్న టెంపోని అతను ఆశ్చర్యంగా చూశాడు.

"మళ్ళీ వచ్చాను!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"రండి!" ఆశ్చర్యంనుండీ తేరుకున్న శ్రీనివాసరావు అన్నాడు.

అతని వెంటే టెంపో హాల్లోకి నడిచాడు. టెంపోకి సోఫా చూపిస్తూ శ్రీనివాసరావు చతికిలబడ్డాడు. అతని మొహం టెంపోవైపు ప్రశ్నల్ని రువ్వుతోంది.

"మిస్టర్ శ్రీనివాసరావ్. రంగధామ్ యెలాంటి వాడు?"

శ్రీనివాసరావు ఇబ్బందిగా చూశాడు. నున్నగావున్న గడ్డాన్ని వోసారి వేళ్ళతో తడువుకున్నాడు.

"....అతనితో అంత పరిచయంలేదు నాకు."

"కొంత పరిచయం ఉందా?"

శ్రీనివాసరావు అయిష్టంగా తలాడించాడు.

"ఉన్న పరిచయాన్ని ఆధారంచేసుకొని చెప్పండి. అత ఎలాంటివాడు?"

"కండలు పెరిగినంతగా అతని హృదయం ఎదగలేదని నా నమ్మకం. అయినా....అతను మంచివాడనే చెప్పు కోవాలి ..." శ్రీనివాసరావు ఏం చెప్పాలో తోచని వ్యక్తిలా తడబడుతూ అన్నాడు.

టెంపో చిన్నగా నవ్వాడు. "మంచివాడితో మీ సంబంధాన్ని యెందుకు పటిష్టం చేసుకోలేదు?"

శ్రీనివాసరావు కళ్ళు గిన్నెల్లా అయ్యాయి. అర్థం కానట్టు చూస్తూ, క్షణకాలం మౌనంగా ఉండిపోయాడు.

"అంటే?" అన్నాడతను రెప్పవేయకుండా.

"శ్రీనివాసరావ్, మీ ఆవిడ కనపడలేదు?" టెంపో అతని ప్రశ్నకు సమాధానం చెప్పకుండా అడిగాడు.

"కుసుమ మార్కెట్ కెళ్ళింది, కూరలు పట్రాడానికి" టెంపో ప్రశ్నల వరస అర్థంకాని శ్రీనివాసరావు జవా బిచ్చాడు.

"మీ చెల్లెలు....ప్రతిమ ఇంట్లో లేదా?" టెంపో అతని మొహంలోకే సూటిగా చూస్తూ అడిగాడు.

శ్రీనివాసరావు ఆశ్చర్యంగా చూశాడు. "చెల్లాయి టూర్ వెళ్ళింది; ఫ్రెండ్స్‌తో కలిసి .... మా చెల్లాయి గురించి మీ కెలా తెలుసు?"

టెంపో చిన్నగా నవ్వాడు. "మీరు నన్ను రంగధామ్ దగ్గరకు పంపించారు. అతను నన్ను మళ్ళీ మీ దగ్గరకు పంపించాడు."

శ్రీనివాసరావు మాటలు మరచిపోయిన వాడిలా

చూశాడు.

"శ్రీనివాసరావ్. మీకో చెల్లెలున్నట్టు మీరు నాతో చెప్పలేదు!" టెంపో నవ్వుతూ అన్నాడు.

శ్రీనివాసరావు మొహం సీరియస్‌గా తయారైంది. "ఆ అవసరం లేదనుకుంటాను...."

"అఫ్‌కోర్స్. మీకో చెల్లెలున్నట్లు మీరు నాకు చెప్పాల్సిన అవసరం లేకపోవచ్చు. కానీ మోహన్ ఫ్రెండ్సెవరెవరని నేను అడిగినప్పుడు మీరు ప్రతిమ గురించి చెప్పాల్సింది!" టెంపో నవ్వుతూ అన్నాడు.

శ్రీనివాసరావు చూపుల్లో యేదో మార్పొచ్చింది. "మిస్టర్ టెంపో, మీరు అనవసరమైన విషయాల్ని తవ్వుతున్నారు!"

టెంపో చిన్నగా నవ్వాడు. "శ్రీనివాసరావ్, ప్రతిమా, మోహన్ ఒకర్నొకరు ప్రేమించుకున్నారు. అవునా?"

శ్రీనివాసరావు కళ్ళల్లో కోపం ప్రస్ఫుటంగా కనిపించింది. కోపంసెగల్ని నిట్టూర్పుతో వెళ్ళగక్కాడతను. "మోహన్ ప్రేమిస్తూవుండి ఉండొచ్చు. నా చెల్లెలు అలాంటిదిగాదు. అది సంసారపక్షంగా పెరిగింది!"

"ప్రేమించడం సంసారపక్షంకాదని మీరనుకుంటున్నారా?" టెంపో నవ్వుతో ప్రశ్నించాడు. శ్రీనివాసరావు విసుగ్గా కదిలాడు. మెల్లిగా తన ఆవేశాన్ని అదుపులో పెట్టుకున్నాడు.

"మిస్టర్ టెంపో, నాన్న పోయాక చెల్లాయికి అన్నీ నేనే అయ్యాను. నా బాధ్యత నాకు తెలుసు. తల్లీ తండ్రీలేని పిల్లకి లక్షణమైన తగిన సంబంధం చూసి పెళ్ళి చేయాలి. అంచేత ప్రతిమని అదుపాజ్ఞల్లో, సంస్కారంతో

పెంచాను. అది అలాంటి తిక్క వేషాలేయదు!" శ్రీనివాసరావు ఉద్రేకంతో అన్నాడు.

టెంపో సిగరెట్ వెలిగించాడు. శ్రీనివాసరావు అతన్ని తదేకంగా చూశాడు.

"మోహన్ ఉద్దేశం నాకు చూచాయగా తెలుసు. అతని తాహతు వేరు. అంచేత అతని ఉద్దేశాన్ని నేను బలపరచలేదు. ఎంత తిని, జీర్ణంచేసుకోగలనో నాకు బాగా తెలుసు!"

టెంపో ఇంటి కప్పువైపు సిగరెట్ పొగ ఊదాడు. తలదించి, శ్రీనివాసరావుని తీక్షణంగా చూశాడు.

"మిస్టర్ శ్రీనివాసరావ్, మోహన్ ప్రతిమా— ఇద్దరూ కలిసి యెక్కడికేనా పారిపోయి ఉంటారా?"

శ్రీనివాసరావు ఉలిక్కిపడ్డాడు. అతని మొహం కందిపోయింది. తటాలున అతను సోఫాలోంచీ లేచాడు. ఎర్రటి కళ్ళతో టెంపోని రౌద్రంగా చూశాడు.

"మధ్యతరగతి కుటుంబంలో జన్మించి సంసార పక్షంగా పెరిగిన అమాయకురాలైన నా చెల్లెలిమీద మీరు అసభ్యమైన అభాండాలు వేస్తున్నారు! దిసీజ్ టూ మచ్!"

టెంపో అతన్ని చిరునవ్వుతో చూశాడు. "డోంట్ గెట్ ఎక్సైటెడ్! మోహన్ ఇంట్లోంచీ వెళ్ళిపోయాడు మీ చెల్లెలు ఇంట్లో లేదు. ఇద్దరూ ప్రేమించుకున్నారు. ఈ మొత్తాల్ని కూడితే వచ్చే ఆన్సర్ అదే! ఇవన్నీ తెలిసిన ఎవరికేనా అనుమానం వస్తుంది. నాకూ వచ్చింది. అంతే!"

శ్రీనివాసరావు తీక్షణంగా క్షణకాలం చూసి, మెల్లిగా సోఫాలో కూలబడ్డాడు. ప్రాధేయపూర్వకంగా టెంపోని

చూశాడు. "మిస్టర్ టెంపో, మళ్ళీ చెప్తున్నా: నా చెల్లెలు అతన్ని ప్రేమించలేదు.... నాకు మీరు సహాయం చేస్తారా?"

"అడగకండి."

"మీకు వచ్చిన ఊహలకి అనుమానాన్ని—అనుమానాన్ని ఇంకెక్కడా అనకండి ప్రతిమకి సంబంధం చూశాను. త్వరలో పెళ్ళి చేయబోతున్నా, మీ 'లాజికల్ అనుమానం' బైటికి పొక్కితే నా చెల్లెలి పెళ్ళి ఆగిపోతుంది!"

టెంపో అతన్ని సానుభూతితో చూశాడు. మెల్లిగా తలపంకించాడు.

"మీ చెల్లెలు టూరెళ్ళిందెప్పుడు?"

"వారం రోజులు కావస్తోంది...." శ్రీనివాసరావు ఆలోచిస్తూ జవాబిచ్చాడు.

"మోహన్ అంతర్ధానం గురించి ఆమెకి తెలిసే ఉండాలి!" టెంపో అన్నాడు.

"తెలుసనుకుంటాను .... పేపర్లో చూసి అదే నాకు చెప్పింది."

టెంపో లేచి నించున్నాడు. "ఓకే, మిస్టర్ శ్రీనివాసరావ్, మీరు చెప్పిందంతా నాకు ఉపయోగిస్తుంది. ప్రతిమ గురించి నేను వ్యక్తం చేసిన ఆలోచనల్ని మరిచిపోండి. వెళ్తాను. థాంక్స్!"

శ్రీనివాసరావు చిన్నగా నవ్వాడు. "ఫరవాలేదు. మోహన్ కోసం నాకు తెలిసిందంతా చెప్పడానికీ, చేతనైనదంతా చెయ్యడానికీ నేనెప్పుడూ సిద్ధంగా ఉంటాను!"

టెంపో గుమ్మంవైపు కదిలాడు. తటాలున ఆగి శ్రీనివాసరావువైపు సూటిగా చూశాడు. "రంగధామ్

ప్రతిమని ప్రేమిస్తున్నాడు. తనకి పోటీగా తయారైన మోహాన్ని అతను మాయంచేసి ఉండొచ్చా?"

శ్రీనివాసరావు ఆయోమయంగా చూశాడు. "టెంపో గారూ, నాకు అలాంటి ఆలోచనే రాలేదు! మనుషుల్ని అనుమానించడం నాకు చేతకాదనుకుంటాను .... మీ ప్రశ్నకి నేను సమాధానం చెప్పలేను. ఎందుకంటే, నిరాధారంగా నిందలు వేయడం నాకిష్టంలేదు!"

"ఓ.కే. గుడ్ బై!" అంటూ టెంపో ఇంట్లోంచీ ఇవతలికి నడిచాడు.

# 9

ఎయిర్ కండిషన్డ్ ఆఫీసుగదిలో వెడల్పాటి రోజ్ ఉడ్ టేబుల్ వెనక కూచున్న రాజారావు టెలిఫోన్ రిసీవర్ని పడేసి, ఆదరాబాదరా లేచాడు. వేగంగా అడుగులేసి, తలుపుని బార్లా తెరిచి, అప్పుడే గుమ్మంవైపు వస్తున్న టెంపోని నవ్వుతూ చూశాడు.

"దయచేయండి మిస్టర్ టెంపో! సర్ ప్రైజ్ విజిట్!" అంటూ ఆహ్వానించాడు. టెంపో గదిలోకి దూరాడు. అతని వెనక తలుపు మూసుకుంది. ఆకుపచ్చ రంగు తివాచీ నేలని పూర్తిగా పచ్చికలా కప్పేసింది. అభిరుచీ, ఐశ్వర్యం ఆ గదిలో ప్రతిఫలిస్తున్నాయి.

"కూర్చోండి...." తన కుర్చీ ముందు నిలబడి, రాజారావు అన్నాడు. టెంపో కూచున్నాడు. రాజారావు తలవైన గోడకి వేళ్ళాడుతున్న మూడు ఫోటోలు అతని దృష్టిని ఆకర్షించాయి. మధ్యలో రాజారావు. అతనికి ఎడమవైపున బుర్రమీసాల వ్యక్తి లావుగా, భారీగా అవుపిస్తున్నాడు. కుడివేపున ఉన్న మోహాన్ని టెంపో పోల్చుకున్నాడు. ఎడమవైపున్న బుర్రమీసాల వ్యక్తి

రాజారావు తండ్రి అని చెప్పకుండానే తెలుస్తోంది. మూడు తరాలు!

"మిస్టర్ టెంపో..ఏదేనా తెలిసిందా?" రాజారావు కంఠంలో తన ఆత్రుతని దాచుకోలేకపోతున్నాడు.

టెంపో అతన్ని చిరునవ్వుతో చూశాడు.

"ఎంతో కొంత తెలిసింది...."

"చెప్పండి!" రాజారావు ఆత్రుతగా అన్నాడు.

"అబ్బాయి క్షేమంగా...."

టెంపో చెయ్యెత్తి రాజారావుని వారించాడు. "మిస్టర్ రాజారావ్, మనిషి వేసే ప్రతీ అడుగూ అతన్ని గమ్యస్థానంవైపు తీసుకుపోతుంది. నా పరిశోధనకూడా అంతే!" అన్నాడు నవ్వుతూ.

రాజారావు అర్థంకానట్టు చూశాడు. టెంపో సిగరెట్ వెలిగించాడు. రాజారావు మొహంలోకి చూశాడు.

"మిస్టర్ రాజారావ్, మోహన్ ఎవర్నైనా ప్రేమిస్తున్నాడా?"

రాజారావు కళ్ళు చిట్లించాడు. "అబ్బాయి కట్టుదిట్టంగా పెరిగాడనీ, పొరపాటు పనులు చేయడని మీకు ఇదివరకే చెప్పాను!"

"ప్రేమించటం పొరపాటు పనికాదు!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"అది అభిప్రాయాలమీదా, పరిస్థితులమీదా ఆధారపడివుంటుంది. మోహన్ ఎవ్వర్నీ ప్రేమించలేదు...."

"ప్రతిమ మీకు తెలుసా?" టెంపో అతన్ని వినిపించుకోకుండా అన్నాడు.

రాజారావు కనుబొమలు వంకీలు తిరుగుతూ నుదుర్ని ముడతలుగా పైకి తోశాయి. "ప్రతిమెవరు?"

"శ్రీనివాసరావు చెల్లెలు."

"శ్రీనివాసరావు.... ఓహ్, అబ్బాయి ఫ్రెండు.... అతనికో చెల్లెలున్నట్టే నాకు తెలీదు...." రాజారావు సాలోచనగా అన్నాడు.

"అందుకే ఆమెని మోహన్ ప్రేమిస్తున్నట్టు మీకు తెలీదు!" టెంపో నవ్వుతూ అన్నాడు.

రాజారావు టేబుల్ మీదున్న దంతపెట్టెలోంచి కరోనా సిగార్ తీసి వెలిగించాడు. మౌనంగా రెండు దమ్ములు లాగాడు. నీరసంగా, విచారంగా ఉన్న ముఖంలో కోపం లీలగా గోచరిస్తోంది.

"మిస్టర్ టెంపో, మీ అరచేతిలోని గీతలు మీకెలా తెలుసో, మోహన్ గురించి నాకలాగే తెలుసు! మీ కెవరో లేనిపోనివి చెప్పినట్టున్నారు!"

సిగార్ బూడిదని యాష్ ట్రేలో దులిపి, రెప్పలెత్తి టెంపో వైపు చూశాడు రాజారావు.

"అబ్బాయి ఐశ్వర్యాన్నీ, హోదానీ చూసి ఆ ప్రతిమో, విగ్రహమో — ఎవరో వాడికోసం ప్రేమ గాలాన్ని వదిలి ఉండొచ్చు!"

టెంపో తలాడించాడు. లోపల్లోపల నవ్వుకున్నాడు. తన కొడుకు ప్రేమించడని రాజారావూ, తన చెల్లెలు ప్రేమించదని శ్రీనివాసరావూ అంటున్నారు! ఇద్దరూ అమాయకంగా అలా అనుకుంటున్నారా?

"మిస్టర్ టెంపో ఇంతకీ ఇలా ఎందుకు అడుగుతున్నారు?" రాజారావు ప్రశ్నించాడు.

"మోహన్ ఇంట్లోంచి వెళ్ళాడు. ప్రతిమా టూర్ వెళ్ళింది—" టెంపో స్పష్టంగా అన్నాడు.

రాజారావు తేలిగ్గా నిట్టూరాడు. "మిస్టర్ టెంపో,

ఆ కోణంనుంచీ ఆలోచించడం మానేసెండి. మీ పరిశోధనని మరో తోవమ్మట వెళ్ళనివ్వండి!"

టెంపో చిరునవ్వు నవ్వుతూ లేచాడు.

"కూచోండి కాఫీ తాగి వెళ్దురుగానీ" రాజారావు అన్నాడు.

"త్వరగా ఒకచోటికి వెళ్ళాలి. మరోసారి...."

"మిస్టర్ టెంపో తిండి సహించడంలేదు. నిద్ర రావడంలేదు. అయిదు లక్షలు అబ్బాయిని నాకు అందచేస్తాయనుకున్నాను.... నా అయామ్ వర్రీడ్...." రాజారావు నీరసంగా అన్నాడు. అతని కళ్ళల్లో ఆవేదన ప్రతిఫలిస్తోంది.

"మిస్టర్ రాజారావ్, నాకూ కంగారుగానే వుంది. తలాతోకా తెలీకుండా వుంది... త్వరలో యేదో తెలుసుందన్న ఆశకూడా వుంది. వస్తాను" అంటూ టెంపో తలుపువైపు తిరిగాడు.

రాజారావు అతన్నే చూస్తూ వుండిపోయాడు.

# 10

ఇంటి నంబరు ఒకసారి చూసి, టెంపో కుడివేపున వంకీలు తిరిగి పైకివెళ్తున్న మెట్లవేపు అడుగులేశాడు. ఎంచుకుంటూ రెండు డజన్ల మెట్లెక్కి, గుమ్మంముందు ఆగాడు. అతని వేళ్ళ కణుపులు చప్పుడుచేశాయి.

కాస్సేపట్లో తలుపు తెరిచిన యువతి అతన్ని ప్రశ్నార్థకంగా చూసింది.

"రామ్మోహన్...." అన్నాడు టెంపో ఆమెవైపు చిరునవ్వుతో చూస్తూ. చీరచెంగు నడుములోకి దోపి వుంది. వంకీలు తిరిగిన జుట్టు చెమట బిందువులతో పిరు

స్తున్న ఆమె నుదురుమీదకి జారింది. తను స్టౌతుందునుంచీ ఆమె ఇవతలికి వచ్చినట్టు టెంపో గ్రహించాడు.

"మీరు ...." అంటూ ఆగిందామె.

"డిటెక్టివ్ టెంపో."

ఆమె ముఖంలో ప్రశ్నార్థకం మాయమైంది. "లోపలికి రండి!" అందామె తలుపు పూర్తిగా లోపలికి లాగి, కదుల్తూ టెంపో లోపలికి అడుగువేశాడు.

"కూర్చోండి. ఆయన స్నానం చేస్తున్నారు. క్షణంలో వస్తారు" అందామె టెంపోవైపు చిరునవ్వుతో చూస్తూ. చీర చెంగును ఇవతలికి లాగి, చేతులు తుడుచుకుంది. టెంపో కిటికీ ఎదురుగా టేబుల్ ముందున్న కుర్చీలో కూచున్నాడు. కర్టెన్ని తోసుకుంటూ ఆమె లోపలి గది లోకి వెళ్ళిపోయింది.

టేబుల్ మీదున్న యాష్ట్రేని చూస్తూ, టెంపో సిగరెట్ వెలిగించాడు. పొగ ఊదుతూ, ఎదురుగా గోడకి వేళ్ళాడుతున్న ఫోటోల్ని చూడసాగేడు. అన్నిటి కన్నా కొంచెం పెద్దగా వున్న ఫోటోలో, ఇందాకా తలుపుతీసిన యువతి డాక్టర్ వేషంలో వుంది. కొద్దిగా పెరిగిన గడ్డంతో, నీరసంగా అవుపిస్తున్న ఒక వ్యక్తి మంచంమీద కూచుని ఆమెవైపు ప్రాధేయపూర్వకంగా చూస్తున్నాడు.

ఏదో నాటకంలో సీనుని తను చూస్తున్నట్టు టెంపో తెలుసుకున్నాడు. పక్కనే గోల్డుకలర్ ఫ్రేములోవున్న సన్మానపత్రం రామ్మోహన్ కి 'దర్శకరత్న' బిరుదు ఇవ్వబడినట్టు తెలియజేస్తోంది.

"గుడ్ మార్నింగ్, టెంపోగారూ!"

టెంపో చివాలున తలతిప్పి చూశాడు. ఫోటోలో

పేవ్మెంట్ గేటవలో వున్న వ్యక్తి అతనిముందు నవ్వుతూ, ఆరోగ్యంగా నిలబడ్డాడు.

"గుడ్ మార్నింగ్, మిస్టర్ రామ్మోహన్!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"మీ గురించి విన్నాను. మీరు రాసిన కొన్ని రియల్ క్రైమ్ ఆర్టికల్స్ చదివాను. మీరు మా ఇంటికి రావడం అదృష్టం! ఊరికే రారు, డిటెక్టివ్‌లు! చెప్పండి" అంటూ రామ్మోహన్ టేబుల్‌కి అటువైపు వున్న కుర్చీలో కూచున్నాడు.

సిగరెట్ యాష్‌ట్రేలో పడేస్తూ టెంపో అతన్ని చిరునవ్వుతో చూశాడు. "మిస్టర్ రామ్మోహన్, మోహన్ గురించి మీతో మాట్లాడాలని వచ్చాను...."

రామ్మోహన్ మొహం కొద్దిగా వివర్ణమైపోయింది. "అయామ్ సారీ ఫర్ హిమ్. నిన్న రాజారావుగార్ని ఫోన్‌లో పలకరించాను. మోహన్ ఇంకా రాలేదన్నారాయన...."

"చదువుకునే రోజుల్లో మోహన్ మీతోబాటు నాటకాల్లో నటించేవాడని విన్నాను..." అంటూ టెంపో ఆగాడు.

రామ్మోహన్ బనీనుమీద టర్కిష్ టవల్ని సరుకున్నాడు. తలుపుతీసిన యువతి రెండు కప్పుల్లో కాఫీ ఇద్దరిముందూ పెట్టింది.

"టెంపోగారూ, నా భార్య మాలిని...." రామ్మోహన్ పరిచయం చేశాడు. మాలిని టెంపోకి నమస్తే చెప్పింది. టెంపో తలాడించాడు. మాలిని భర్త దగ్గరగా కుర్చీలో కూచుంది. కాఫీ ముగించి టెంపో సిగరెట్ వెలిగించాడు. పాకెట్‌ని రామ్మోహన్ వైపు విసిరి,

చెప్పమన్నట్టు చూశాడు.

"టెంపోగారూ, మోహన్ ఒకే ఒక్క నాటకంలో నటించాడు. ఈ నాటకానికి నేనే దర్శకత్వం వహించాను. అతను నాకు జూనియర్. కొంచెం బెదురుగా అవుపించే వాడు. ఆ నాటకంలో నేను సృష్టించిన కొడుకు పాత్రకి అతను బాగా సరిపోతాడనిపించింది. యాక్టు చేయమన్నాను; చేశాడు.... అంతే! మోహన్ మళ్ళా నాటకాలవేపు రాలేదు...." రామ్మోహన్ ఆగి సిగరెట్ వెలిగించాడు.

కొడుకు పాత్ర! టెంపో ఆలోచిస్తూ చూశాడు. "ఐసీ....తండ్రి పాత్ర యెవరు వేశారో గుర్తుందా?"

"ఎందుకు గుర్తులేదు? ఆ నాటకాన్ని నేనే రాశాను, ధరించబోయే వ్యక్తుల్ని దృష్టిలో ఉంచుకునే పాత్రల్ని బిల్డ్ చేశాను. తండ్రిగా రంగధామ్ నటించాడు" రామ్మోహన్ జవాబిచ్చాడు.

టెంపో సాలోచనగా తలపంకించాడు. "మిస్టర్ రామ్మోహన్, ఆ నాటకం డైలాగ్స్‌ని మీరు రికార్డు చేశారా?"

రామ్మోహన్ తల ఆడిస్తూ చూశాడు. "మాలినీ, నేనూ, రంగధామ్, మోహాన్ మరో ముగ్గురూ అందులో నటించాం. స్టేజిమీద డైలాగ్ చెప్పిన ప్రతిసారీ మైక్ దగ్గరగా కదిలి, జాగర్తగా మాట్లాడ్డం కొంచెం కష్టంగా అనిపించింది. అందుచేత అందరం డైలాగ్స్ చెపూ్త, ఒక క్యాసెట్ రికార్డుచేశాం. టైమింగ్ అడ్జెస్టు చేసుకొని లిప్ మూవ్‌మెంట్ ఇచ్చాం. నాటకం బ్రహ్మాండంగా హిట్టయింది. ప్రీ రికార్డెడ్ క్యాసెట్‌ని ప్లే చేస్తూ మేం ఆడిన మొదటి నాటకం అదే!"

రామ్మోహన్ ఉత్సాహంతో చెప్పి, ఆగి, సిగరెట్ వెలిగించాడు. నాటకాల గురించి కదలేస్తే అతను అపకుండా మాట్లాడేలా వున్నాడని టెంపో గ్రహించాడు. ఉత్సాహంతో రామ్మోహన్ వైపు చూశాడు. తన ఆలోచనలు సరైన మార్గంలో ప్రయాణం చేస్తున్నాయి.

"మిస్టర్ రామ్మోహన్, ఆ క్యాసెట్ మీ దగ్గరుందా?" టెంపో ప్రశ్నించాడు.

రామ్మోహన్ ప్రశ్నార్థకంగా చూశాడు.
"....ఎందుకు?"

"చెప్తాను. క్యాసెట్ వుందా?"

"లేదు..వారం, పదిరోజులప్పుడు దాన్ని రంగధామ్‌కి పంపించాను...." మాలిని కల్పించుకొని అంది.

టెంపో, రామ్మోహన్ ఇద్దరూ ఆమెవైపు ఆశ్చర్యంతో చూశారు. కానీ, ఇద్దరిలోని ఆశ్చర్యాలకి కారణాలు వేరు.

"మాలీ, నాకు చెప్పలేదే?" రామ్మోహన్ అడిగాడు; భార్యవైపు చూస్తూ.

"మరిచిపోయాను. మీరప్పుడు ఊరెళ్ళారుగా! తిరిగొచ్చేసరికి గుర్తులేదు!" మాలిని చిన్నగా నవ్వింది.

"రంగధామ్ కొంచెం నిర్లక్ష్యం మనిషి. దాన్నెక్కడో పడేస్తాడు. మన దగ్గిర ఇప్పుడు ఆ నాటకం స్క్రిప్టు కూడా లేదు...." రామ్మోహన్ కొంచెం నిరుత్సాహంగా అన్నాడు. "జాగర్తగా, త్వరగా వాపసు చేయమని రంగధామ్‌కి చెప్పావా?"

"లేదు....అతను రాలేదు. ఫోన్ చేశాడు. ఇంటావిడ చెప్పింది. కిందికెళ్ళి మాట్లాడాను. అరగంటలో ఎవరో కుర్రాణ్ణి పంపుతాననీ, ఆ కాసెట్ పంపమనీ రంగధామ్

అన్నాడు. అరగంటలో కుర్రాడెవడో వచ్చాడు. ఇచ్చి పంపాను" మాలిని వివరించింది.

రామ్మోహన్ నిట్టూర్చాడు. "ఆల్ రైట్ ....మనమే వెళ్ళి తీసుకోవాలి! రంగధామ్ గిరాటేసేసేలోగా!" అంటూ టెంపోవైపు తిరిగాడు.

"అన్నట్టు టెంపోగారూ, క్యాసెట్ గురించి అడిగారు; దేనికి?"

టెంపో మౌనంగా మాలినివైపు చూశాడు. "మాలినిగారూ, ఆ కుర్రాడెవడో, ఎప్పుడొచ్చాడో ఖచ్చితంగా చెప్పగలరా?"

మాలిని క్షణం సేపు ఆలోచిస్తూవుండిపోయింది. ప్రశ్నార్థకంగా భర్తవైపు చూసింది. "మీరు ఊరెళ్ళిందెప్పుడు? రెండా, మూడా?" అందామె.

"రెండో తారీఖు నేగా?" రామ్మోహన్ ప్రశ్నతో జవాబిచ్చాడు.

"అవును. రెండే. ఆ రోజు మీరు వెళ్ళిపోయిన గంట తరవాత రంగధామ్ ఫోన్ చేశాడు...." అంటూ ఆమె టెంపోవైపు నవ్వుతూ చూసింది.

టెంపో సాలోచనగా తలపంకించాడు. సగం కాలిన సిగరెట్‌ను యాష్ట్రేమీద నొక్కి, మెల్లిగా పైకి లేచాడు. భార్యాభర్తలిద్దర్నీ చూశాడు.

"థాంక్స్ ఎ లాట్. పొద్దుటే శ్రమ ఇచ్చాను.... వస్తాను" అన్నాడు.

"మిస్టర్ టెంపో, క్యాసెట్ మీకు యెందుకో చెప్పలేదు!" రామ్మోహన్ పైకి లేస్తూ అన్నాడు.

"మోహన్ కోసం నేను వెతకాలి. అతని ఫోటో నా దగ్గరుంది. అతని కంఠం నేనెప్పుడూ వినలేదు. రూపం

మాట్లాడని మోహన్ నా పక్కనే నడుస్తున్నా నేను పోల్చుకోలేను. అందుకని..." టెంపో నవ్వుతూ ఆగాడు.

రామ్మోహన్ అర్థంకానట్టు చూశాడు; టెంపో చిన్నగా నవ్వాడు.

"మిస్టర్ రామ్మోహన్, ఒక వ్యక్తికోసం కళ్ళతో మాత్రమే వెతికితే చాలదు. చెవులతో కూడా వెతకాలి!"

రామ్మోహన్, మాలినీ ఇద్దరూ నవ్వారు.

"అయితే ఆ క్యాసెట్ మీకు అర్జెంటుగా కావాలి! అవునా?" రామ్మోహన్ అడిగాడు.

టెంపో కింది పెదవిని పంటితో నొక్కుతూ ఉండి పోయాడు.

"టెంపోగారూ, చూడండి. కింది కెళ్ళి రంగధామ్‌కి ఫోన్ చేస్తాను. వెంటనే క్యాసెట్ పట్రమ్మంటాను" రామ్మోహన్ మళ్ళీ అన్నాడు.

తల పంకిస్తూ టెంపో చూస్తున్నాడు. "రంగధామ్ ఇంట్లో ఫోనుందా?" ప్రశ్నించాడు.

"లేదు. పక్కింట్లో వుంది. అడ్వొకేట్ సుబ్బారావు విసుక్కోకుండా రంగధామ్‌ని పిలుస్తారు. కూతుర్ని అతని కివ్వాలని ఆయన ఆలోచిస్తున్నారు!" అంటూ రామ్మోహన్ గుమ్మంవైపు కదిలాడు.

టెంపో మాలినివైపు చూశాడు. కోల మొహం. పెద్ద పెద్ద కళ్ళు. వంకీలు తిరిగిన జుట్టు. నాటకాల్లో రంగు పూసి పూసీ ఆమె మొహం రంగు కొద్దిగా మారినట్టుంది.

"టెంపోగారూ, టీ తీసుకుంటారా?" అంది మాలిని.

"థాంక్స్ ఐ లైక్ టీ!" టెంపో నవ్వుతూ అన్నాడు, మాలిని జోరుగా వంటగదివైపు అడుగులేసింది. జేబు లోంచి సిగరెట్ పాకెట్ తీశాడు.

రెండు నిమిషాల్లో మాలిని టీ కప్పు టెంపో ముందు పెట్టింది. ఆమెవైపు చిరునవ్వుతో చూస్తూ టెంపో కప్పు అందుకున్నాడు. మెట్లమీద అడుగుల చప్పుడవుతోంది. కాసేపట్లో రామ్మోహన్ గదిలో ప్రవేశించి, తన కుర్చీలో కూచున్నాడు. టెంపో అతన్ని ప్రశ్నార్థకంగా చూశాడు. రామ్మోహన్ మొహం అదోలా ఉంది.

"రంగధామ్ తను క్యాసెట్ కోసం ఫోన్ చేయలేదన్నాడు!" అన్నాడతను యెవర్నీ వుద్దేశించకుండా.

టెంపో టీ కప్పుని కింద పెట్టి, ఆశ్చర్యంగా చూశాడు.

"ఏమిటీ?" మాలిని కంఠంలో ఆశ్చర్యం గంటలా మోగింది.

"తనకి క్యాసెట్ గురించి గుర్తే లేదనీ, దాంతో తనకేమీ పనే లేదనీ అన్నాడు రంగధామ్!" రామ్మోహన్ అన్నాడు.

"రంగధామ్ అబద్ధమాడుతున్నాడేమో!" టెంపో అన్నాడు.

రామ్మోహన్ తల అడ్డంగా ఆడించాడు. "నో మిస్టర్ టెంపో, అతను అబద్ధాలాడడు. ఆ అవసరం లేదు!"

"అవసరం ఉందో లేదో నాకు తెలీదు. క్యాసెట్ అవసరముందంటూ అతను నాకు ఫోన్‌లో చెప్పాడు!" మాలిని ఉద్రేకంతో అంది.

ఆమె మాటను వ్యతిరేకిస్తూ యేదో చెప్పబోయి, అయోమయంగా చూస్తున్న రామ్మోహన్‌ని టెంపో చిరునవ్వుతో చూస్తూ వుండిపోయాడు. అతని బుర్రలో యేవో ఆలోచనలు మెరుపుల్లా మెరుస్తున్నాయి. అతని మెదడులో దూరదూరంగా, చెల్లాచెదురుగా అల్లిబిల్లిగా

పడుతున్న దారాలన్నీ ఒక్కటిగా కలిసి, పెనవేసుకుని తాడుగా రూపొందుతున్నాయి.

టొంపో తటాలున పైకి లేచాడు. రామ్మోహన్, మాలినీ అతన్ని ఆశ్చర్యంగా చూశారు.

“మిస్టర్ టొంపో ఈ క్యాసెట్ కథేమిటో గందరగోళంగా ఉంది నేను స్వయంగా వెళ్ళి రంగధామ్‌తో...”

“అవసరంలేదు! నేనే వెళ్ళాను. రంగధామ్ నాకు తెలుసు. మీరు కంగారుపడకండి....” టొంపో అడ్డొస్తూ అన్నాడు.

“ఆ క్యాసెట్ నాకు కావాలి. నాటకం స్క్రిప్టు లేదు!” రామ్మోహన్ ఆత్రంగా అన్నాడు.

“డోంట్ గెట్ వర్రీడ్! మీ క్యాసెట్ ఎక్కడికీ పోదు! థాంక్యూ బోత్! వస్తా” అంటూ గుమ్మంవేపు నడిచాడు.

## 11

గది తలుపు తోసుకుని లోపలికి వచ్చిన డిటెక్టివ్ టొంపోని అతను ఆశ్చర్యంతో చూస్తూ మెల్లిగా కుర్చీ లోంచి లేచాడు. పైజామామీద గ్లాస్గో జుబ్బా ధరించాడతను. జుబ్బాలోంచి కండరాలు మెలికలు తిరుగుతూ అవుపిస్తున్నాయి.

“ఏమిటి మళ్ళీ వచ్చారు?” అన్నాడతను. అతని కంఠస్వరంలో స్నేహభావం, స్వాగతం లేవు.

“రావాల్సి వచ్చింది!” అంటూ టొంపో అతని దగ్గరగా నడిచాడు. అతని చిన్న చిన్న కళ్ళు రెస్ట్‌లెస్‌గా కదులుతూ టొంపోనే చూస్తున్నాయి. టొంపో అతని దగ్గరగా ఆగాడు. అతని పాముకళ్ళలోకి సూటిగా చూశాడు.

"నేను సాగిస్తున్న మోహన్ అన్వేషణ నన్ను మళ్ళీ నీ దగ్గరకు లాక్కొచ్చింది, రంగధామ్!"

రంగధామ్ కళ్ళల్లో విసుగు వెలుగ్గా ప్రతిఫలించింది. తన అయిష్టాన్ని దాచుకోడానికి అతను ప్రయత్నించలేదు.

"రంగధామ్, మీ ఇంట్లో శబ్దరత్నాకరం, వెబ్స్టర్-డిక్షనరీలు వున్నాయా?" బెంపో ప్రశ్నించాడు.

రంగధామ్ ప్రశ్న అర్థంకానట్టు చూశాడు. "వుంటే వుంటాయి. నాన్న యింట్లో చెత్త పోగేశాడు, గది నిండా. నేనెప్పుడూ డిక్షనరీలు తిరగేయను .."

"నువ్వెప్పుడూ పుస్తకాలు చదవ్వా?" బెంపో అడ్డొస్తూ అడిగాడు.

"ఎప్పుడేనా చదువుతాను. కొంతమంది మనుషుల్లాగే, కొన్ని పదాలూ నాకు అర్థంకావు. అయినా నేను కేర్ చేయను. డిక్షనరీలు రిఫర్ చేయను. అర్థంకాని మనుషుల్నీ, పదాల్నీ నేను అంతగా పట్టించుకోను. ఐ హేట్ దెమ్!" రంగధామ్ కంఠంలో చిరాకూ, నిర్లక్ష్యం ధ్వనించాయి.

బెంపో అతన్ని చిరునవ్వుతో చూశాడు. "రంగధామ్, రామ్మోహన్ భార్యకి ఫోన్ చేసి తెప్పించుకున్న క్యాసెట్ ఎక్కడుంది?" రంగధామ్ కనుబొమలు పైకి కదిలాయి, గొంగళిపురుగుల్లా.

"రామ్మోహన్ చెప్పాడా?" అతను నిర్లక్ష్యంగా అడిగాడు.

బెంపో తలాడించాడు.

"మిస్టర్ బెంపో, నేను క్యాసెట్ తీసుకోలేదు!" రంగధామ్ కొంచెం కోపంగా అన్నాడు.

బెంపో అతన్ని చిరునవ్వుతో చూశాడు. "రంగధామ్,

ఆటకట్టయినప్పుడు తెలుసుకోడం మనిషికి ఆరోగ్యకరం!"

రంగధామ్ కనుబొమలు మళ్ళీ కలుసుకున్నాయి.

"వాట్ డూ యూ మీన్?"

"మీ నాన్నగారి లైబ్రరీ వోసారి చూద్దాం!" అంటూ టెంపో వెనక్కి తిరిగాడు.

"ఏమిటీ దౌర్జన్యం? నా ఇంటిని మీరు సోదా చేయలేరు!" ఆగ్రహంతో ధ్వనించిన రంగధామ్ కంఠం టెంపోని గుమ్మంముందు ఆపింది. వెనుదిరిగి అతన్ని నిర్లక్ష్యంగా చూశాడు టెంపో.

"నువ్వు నన్ను ఆపలేవు!"

రంగధామ్ ఛాతీ కొలిమితిత్తిలా పైకి ఉబికింది. పెదవులు వణికాయి. బిగుసుకున్న అతని పిడికిళ్ళని టెంపో నవ్వుతూ చూశాడు. వెనుదిరిగి గుమ్మం దాటాడు. హాల్లోంచి పుస్తకాలున్న గదిలోకి ప్రవేశించాడు.

ఇతర పుస్తకాల్లోంచీ కొద్దిగా ఇవతలికి పొడుచుకు వచ్చిన రెండు లావుపాటి డిక్షనరీలు అలాగే వున్నాయి. టెంపో వాటి దగ్గరగా ఆగాడు. వెబ్‌స్టర్ డిక్షనరీని ఇవతలికి లాగాడు. చకచకా పేజీలు తిరగేశాడు. దాన్ని పుస్తకాలమీద పెట్టి, శబ్దరత్నాకరం అందుకున్నాడు. పుస్తకం అతని వేళ్ళమధ్య ఇరుక్కుని ఇవతలికి వచ్చింది. టెంపో పుస్తకంవైపు చూడ్డంలేదు.

ఖాళీ అయిన రాక్ వెనకభాగం మీద అతని దృష్టి కేంద్రీకరించబడింది. అతని కళ్ళు తళుక్కున మెరిశాయి. అతని కుడిచెయ్యి రాక్‌లో ఏర్పడిన ఖాళీ ప్రదేశంలోకి దూరింది.

వెనక అడుగుల చప్పుడు. తలుపు శబ్దంచేస్తూ గోడని కొట్టుకుంది. డిటెక్టివ్ టెంపో వెనక్కి తిరగలేదు.

లోపలున్న వస్తువుని అతని వేళ్ళు పట్టుకున్నాయి.

అతని భుజమ్మీద యేదో చెయ్యి బలంగా పడింది. అతని శరీరం విసురుగా వెనక్కి తిప్పబడింది.

నిప్పులు కక్కుతూ చూస్తున్న రంగధామ్ మొహం లోకి టొంపో అక్షేపణగా, ఎగతాళిగా చూశాడు. విజయగర్వంతో అతని కళ్ళు మెరుస్తున్నాయి.

రంగధామ్ పళ్ళు కొరికాడు. అతని కుడిచెయ్యి సుత్తిలా పైకి లేచింది.

టొంపో చెయ్యి రాక్‌లాంటి ఇవతలికి వచ్చింది. వేళ్ళ మధ్య పట్టుకున్న క్యాసెట్‌ని అతను రంగధామ్ కళ్ళ ముందుకి జరిపాడు. రంగధామ్ రెప్పలు టపటప కొట్టుకుని, విచ్చుకున్నాయి. పైకెత్తిన అతని చెయ్యి కిందికి దిగి, పురి వొదులైన మోకులా వేళ్ళాడసాగింది.

తెల్లగా పాలిపోతున్న అతని మొహాన్ని టొంపో చిరునవ్వుతో చూశాడు.

"రంగధామ్, ఇప్పుడేమంటావ్?"

టొంపో ప్రశ్న అతన్ని చెంపపెట్టులా తాకింది. మెరుస్తున్న టొంపో కళ్ళలోకి అతను అయోమయంగా చూశాడు.

"అది.... అది.... ఇక్కడికెలా వచ్చింది?" రంగధామ్ తడబడుతూ అన్నాడు.

టొంపో చిన్నగా నవ్వాడు. "ఎలా వచ్చిందో, ఎందుకు వచ్చిందో కూడా నాకు తెలుసు, రంగధామ్! నీకూ తెలుసు. అయితే నాకు తెలుసని నువ్వు తెలుసుకోడానికి చెప్తాను, విను:

నువ్వు ప్రేమిస్తున్న ప్రతిమని తన్నుకుపోతున్న మోహన్ మీద కసి నీ శరీరంలా నీలో పెరిగింది. సమయం

చూసి, అతన్ని కిడ్నాప్ చేశావు. సమయం చూసి, అతని ఆచూకీ చెప్తానంటూ రాజారావుకి ఫోన్ చేశావు. బహుమతిని రాన్‌సమ్ మొత్తంగా మార్చి, ఈ కాసెట్‌లో వున్న మోహన్ డైలాగ్స్‌ని తెలివిగా ఎడిట్ చేసి, మరో కాసెట్‌లోకి ఎక్కించి, రాజారావుకి వినిపించావు. మోహన్ నీ దగ్గరున్నట్టు నమ్మించావు.

మీరిద్దరూ తండ్రీకొడుకులుగా నటించిన నాటకంలోని డైలాగ్స్ నీకు చక్కగా పనికొస్తాయని నీకు తెలుసు! తెలివిగా, ఈ రెండు నిఘంటువులలోని పదాల్ని రాజారావుకి డిక్టేట్ చేసి, అతనికి సూచనలిచ్చావు!"

"నో!" రంగధామ్ కంగారుగా అరిచాడు. "ఇది అన్యాయం! అక్రమం!"

"యస్. నువ్వు చేసిందంతా అన్యాయమే; అక్రమమే! రంగధామ్, మోహన్ని ఏం చేశావో, డబ్బు ఎక్కడ దాచావో చెప్పి లొంగిపో.' అతన్ని హత్య చేయకుండా ఉంటే తక్కువ శిక్షతో తప్పించుకోగలవ్!"

రంగధామ్ తల ఆవేశంగా అటూ ఇటూ ఊగింది.

"మిస్టర్ టెంపో, మోహన్ని నేను ద్వేషించాను; ద్వేషిస్తున్నాను. కానీ కిడ్నాప్ చేయలేదు. వాళ్ళ నాన్న దగ్గర డబ్బు వసూలు చేయలేదు! డిక్షనరీలు, క్యాసెట్టూ—ఇవన్నీ నాకేం తెలీవు!"

"కాస్సేపట్లో అన్నీ తెలుస్తాయ్!" అంటూ టెంపో బిగ్గరగా ఈల వేశాడు.

హాల్లోంచి బూట్ల చప్పుడు వినిపించింది. కాస్సేపట్లో ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ గదిగుమ్మంలో ఠీవిగా నిలబడ్డాడు. అతని చేతిలోని రివాల్వర్ రంగధామ్‌ని చూపిస్తోంది. పృథ్వీరావ్ ఉద్రేకంతో లోపలికి అడుగులు

వేశాడు. రంగధామ్ అతన్ని కంగారుగా చూస్తున్నాడు.

"పృథ్వీరావ్, ఇతన్నీ, ఈ నిఘంటువుల్నీ, క్యాసెట్‌ని నీ స్వాధీనంలోకి తీసుకో. ఎడిట్ చేసి రికార్డు చేసిన క్యాసెట్ యెక్కడుందో, మోహన్ యెక్కడున్నాడో, అయిదు లక్షలు యెక్కడున్నాయో అతని చేత కక్కించు!" టొంపో అన్నాడు.

"నో!" రంగధామ్ అరిచి, గుమ్మంవైపు తిరిగి పరుగెత్తబోయాడు. పృథ్వీరావ్ చేతిలోని రివాల్వర్ అతన్ని ఆపింది.

## 12

సాయంత్రం ఆరు దాటింది. టేబుల్ మీదున్న టెలిఫోన్ మోగింది. రిసీవర్ని లాగి చెవికి ఆనించాడు, ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్. అటువైపు కంఠం పలకగానే అతని మొహంలో యేదో తెరిపి వచ్చింది.

"టొంపో, ఆరుగంటలసేపు నీకోసం ఆఫీసులో కూలబడి వుండిపోయాను! ఎక్కడికి మాయమయ్యావ్?" అన్నాడతను ఆత్రంగా.

"ఏమిటి సంగతి?"

"గురూ, ఈసారి నువ్వు పొరబడ్డావనిపిస్తోంది. రంగధామ్ పాడిందే పాడుతున్నాడు. అతను అమాయకుడేమో అనిపిస్తోంది—ఏం చేయాలో తోచడంలేదు. ఇంతకీ నువ్వెక్కడున్నావ్?" ఇన్‌స్పెక్టర్ ప్రశ్నించాడు.

"పృథ్వీరావ్, రంగధామ్ అమాయకుడని నాకు తెలుసు...."

"వాట్?"

"అమాయకుడని తెలిసే అతన్ని నీతో తీసికెళ్ళమన్నాను!"

"వాట్?" ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ మళ్ళీ అరిచాడు.

"రెండో తేదీ పొద్దుట క్యాసెట్ కోసం అతను ఫోన్ చేసి, కుర్రాణ్ణి పంపినట్టు మనకి తెలుసు. అయితే, నాలుగో తేదీ దాకా, మోహన్ ఇంటిపట్టునే ఉన్నాడు. అంటే, నాలుగో తేదీ రాత్రికి మోహన్ అంతర్థానమవుతాడని రెండో తేదీకే తెలిసిన వ్యక్తి ముందుజాగ్రత్తతో క్యాసెట్ తెప్పించుకున్నాడు...."

"ఎవరు?" పృథ్వీరావ్ అడ్డొస్తూ అరిచాడు.

"నువ్వు.... నేను! ఎవరైనా ఫోన్ చేసి, రంగధామ్‌గా చెప్పుకొని క్యాసెట్ తెప్పించుకోవచ్చు...."

"గురూ, అర్థంకాలేదు...."

అటువైపు పుర్ధెంపో చిన్నగా నవ్వాడు. "మొదట్లో నాకూ అర్థంకాలేదు. నేరంలో ఉపయోగించిన డిక్షనరీల్ని, క్యాసెట్‌ని వెతికే కంటికి సులభంగా అవుపించేలా అమర్చిపెట్టేంత మూర్ఖంగా రంగధామ్ కూడా నేరం చేయడు. పళ్ళెంలో వడ్డించినట్టు రెడీగా అతనింట్లో దొరికిన ఆ ఎవిడెన్స్ నాకు అనుమానాన్ని కలిగించింది.

అసలు వ్యక్తి—అడకత్తెర—రంగధామ్ అమాయకత్వాన్ని తెలివిగా, అతి తెలివిగా ఉపయోగించుకుంటున్నాడని పసిగట్టాను. తోటలో దొంగిలించిన మామిడి పళ్ళను మెక్కేసి, టెంకల్ని అమాయకుడి మంచంకింద విసిరేసిన ఆ వ్యక్తి, రంగధామ్ ఇంటిమీద ఒక కన్నేసి వుంటాడని ఊహించాను. అందుకే, అతనికోసమే రంగధామ్‌ని నీతో తీసుకెళ్ళమన్నాను...."

"అర్థమైపోయింది! అసలు శాస్త్రి ఎవరు? ఎక్కడున్నాడు?" ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ ఆత్రంగా ప్రశ్నించాడు.

"నంబరు 33, టెంపుల్ స్ట్రీట్. ఈ అడ్రసుకి సరిగా ఏడు గంటలకి చేరుకో. లోపల నేనుంటాను. గుమ్మం ముందు ఊపిరి పీల్చుకోకుండా నిలబడు."

"టెంపో...."

"సారీ, పృథ్వీ! టైమ్ ఈజ్ ప్రెషస్! సెవన్ ఆఫ్ ది క్లాక్!"

అటువైపున క్లిక్ అంది. రిసీవర్ని పెట్టేసి, ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ టైం చూశాడు. ఏడుగంటలవడానికి ఇంకా బోల్డన్ని నిమిషాలున్నాయ్. సాలోచనగా అతను బెల్ నొక్కాడు.

## 13

డిటెక్టివ్ టెంపో సిగరెట్ పీకని కిందపడేసి, బూటుకాలితో నొక్కుతూ క్షణకాలం ఆలోచించాడు. అతని చెయ్యి తలుపుమీద చప్పుడు చేసింది.

రెండు నిమిషాలు గడిచాయి.

తలుపు వెనక చిన్నగా చప్పుడైంది. బోల్టు లాగబడింది. తలుపు కొద్దిగా తెరుచుకుంది.

"సారీ ఫర్ ది డిస్టర్బెన్స్. మీతో అర్జెంటుగా మాట్లాడాలి...." అన్నాడు టెంపో, కొద్దిగా తెరుచుకున్న తలుపుమీద అరచేతిని వేస్తూ.

"సారీ. నా ఆరోగ్యం బాగోలేదు. రేపు రండి" అన్నాడతను, తలుపు మూసే ప్రయత్నం చేస్తూ.

"'రేపురా!' అంటానికి నేను అడుక్కుతినేవాణ్ని కాను; అప్పులాణ్ని కాను, మిస్టర్ శ్రీనివాసరావ్!" టెంపో తీక్షణంగా అన్నాడు. అతని చెయ్యి బలంగా తలుపుని తోసింది.

అప్రయత్నంగా శ్రీనివాసరావు లోపలికి జరిగాడు.

టెంపో లోపలికి నడిచి, వెనక్కి తిరిగాడు. తలుపుని మూసిన శ్రీనివాసరావు కోపాన్ని దిగమింగుతూ చూస్తున్నాడు. టెంపో అతన్ని చిరునవ్వుతో చూశాడు.

"మిస్టర్ శ్రీనివాసరావ్, ఆరోగ్యం బాగోలేదన్నారు. తిరిగి తిరిగి అలిసిపోయారా?"

"పొద్దుట్నించీ వొంట్లో బాగోలేదు. మంచం దిగనే లేదు. ఇంతకీ మీకు ఏం కావాలి?" అన్నాడు శ్రీనివాసరావు. త్వరగా పనిముగించుకొని వెళ్ళిపొమ్మంటోంది అతని వాలకం.

టెంపో మాట్లాడకుండా హాలు మధ్యకి నడిచాడు. సోఫాలో కూచుని సిగరెట్ వెలిగించాడు. కూచోడమా వొద్దా అని సందేహిస్తూ నిలబడ్డ శ్రీనివాసరావుని సిగరెట్ పొగలోంచీ చూశాడు. "సిడౌన్!"

శ్రీనివాసరావు అప్రయత్నంగా కూచున్నాడు.

"మీ ఆవిడలేదా? ఆమె కాఫీ చాలా బాగా చేస్తుంది...." అన్నాడు టెంపో.

శ్రీనివాసరావు ఆవులించాడు. "కుసుమ....పుట్టింటి కెళ్ళింది...." అన్నాడు మెల్లిగా.

"ఆమె పుట్టిల్లు మద్రాసా?" టెంపో ప్రశ్నించాడు.

"విజయవాడ లెండి. ఇంతకీ మీరు వచ్చిన పని...." శ్రీనివాసరావు ఆగాడు.

"శ్రీనివాసరావ్, కారణం లేకుండా మనిషి అబద్ధాలాడడు. నువ్వు రెండు అబద్ధాలాడావ్! ఎందుకు?" టెంపో ఏకవచనంతో అన్నాడు.

"మీ అర్థం?" శ్రీనివాసరావు అయోమయంగా చూస్తూ అడిగాడు.

"నీ అనారోగ్యం గురించీ, నీ భార్య పుట్టింటికెళ్ళడం గురించీ అబద్ధాలాడావ్ ..."

"మిస్టర్, టెంపో, డిసీజ్ టూ మచ్! ఏదో పెద్ద వారని మీకు మర్యాదిచ్చాను...."

"నువ్విచ్చే మర్యాదకోసం నే నిక్కడికి రాలేదు!" టెంపో అడ్డొస్తూ మధ్యలో అన్నాడు. "శ్రీనివాసరావ్ రోజంతా నువ్వు కాలుకాలిన పిల్లిలా తిరుగుతూనే వున్నావు. రైల్వేస్టేషన్, టెలిఫోన్ ఎక్స్ఛేంజ్, బస్టాండ్, రంగధామ్ ఇల్లున్న వీధి...."

"ఏమిటీ వాగుడు?" శ్రీనివాసరావు గద్దించాడు. అతని మొహం పైపొట్టు తీసేసిన కందగడ్డలా అయింది.

"ఇవాళ మధ్యాహ్నం ట్రెయిన్లో మీ ఆవిణ్ని మద్రాసు పంపించావు. పుట్టింటికి విజయవాడ వెళ్ళిందన్నావు. రోజంతా తిరుగుతూనే వున్నావు; ఉదయం నుంచీ మంచం దిగలేదన్నావు! దీనికంతికీ..." అతని మాటలు వినిపించనట్టు టెంపో చెప్పుకుపోతున్నాడు.

"వాళ్ళన్నయ్య మద్రాసులో వున్నాడు. అమ్మా నాన్నా వున్న పుట్టింటికెళ్ళినా, అన్నయ్య ఇంటికెళ్ళినా పుట్టింటికెళ్ళినట్టే లెఖ్ఖ!" శ్రీనివాసరావు అడ్డొస్తూ ఎగతాళిగా అన్నాడు.

టెంపో చిన్నగా నవ్వాడు. "మద్రాసులో, విల్లివాకంలో నీ భార్య అన్నయ్య కాదు; నీ అన్నయ్యే వున్నాడు! ఆల్ రైట్ .... ఆరోగ్యం బాగోలేదని ఎందుకు అబద్ధమాడావు?"

శ్రీనివాసరావు నిప్పులు కక్కుతూ చూశాడు. "మిస్టర్, ఎవరో ముక్కూ మొహం తెలీని వ్యక్తి ఏదీ

కాని వేళ ఇంట్లోకి దౌర్జన్యంగా ప్రవేశించి, నన్ను అబద్ధాలకోరుగా చిత్రిస్తూ కూచుంటే వినటానికి నేను అనామకుణ్ని కాను? గెటౌట్!”

టెంపో నవ్వుతూ కాలుమీద కాలు వేసుకున్నాడు. వెక్కిరింపుగా నవ్వుతూ శ్రీనివాసరావు కళ్ళల్లోకి చూశాడు.

“శ్రీనివాసరావ్, చాలా చాలా తెలివిగా అంతా చేశావు. కానీ అతి తెలివి నిన్ను అడకత్తెరలో ఇరికించింది!” అన్నాడు టెంపో ‘అడకత్తెర’ అన్న పదాన్ని నొక్కుతూ.

శ్రీనివాసరావు కళ్లల్లో యేదో మార్పొచ్చింది. ప్రయత్నించి, చిటికెలో ఆ మార్పుని తుడిచేశాడతను. “వాట్ డూ యూ మీన్?”

టెంపో సిగరెట్ పీకని హాల్లో దూరంగా విసిరి మరో సిగరెట్ వెలిగించాడు. శ్రీనివాసరావు కళ్లల్లోకి సూటిగా చూశాడు.

“మోహన్ని నీ చెల్లెలు ప్రేమించింది. మోహన్ ఆమె కోసం సర్వాన్నీ త్యాగంచేయడానికి సిద్ధంగా వున్నాడని నువ్వు గ్రహించావు. కట్నాలూ, కానుకలూ చెల్లించి చక్కటి పెళ్ళికొడుకుని సంపాయించే శక్తి నీకు లేదు. ప్రతిమ ప్రేమ మూలంగా, ధనికుడైన రాజారావుతో వియ్యం నీకు లభిస్తుంది; రాజారావు అంగీకరిస్తే. కానీ ఆకాశంలో వుండే రాజారావు అడుసులో ఉండే నీతో బంధుత్వం చేసుకుంటాడన్న నమ్మకం నీకు లేదు. తండ్రి తన ప్రేమని అంగీకరిస్తాడన్న ఆశ మోహన్‌కి లేదు....”

“ఈ పిచ్చివాగుడు వింటానికి నాకు వోపిక లేదు!” శ్రీనివాసరావు అరిచాడు.

"అంచేత బ్రహ్మాండమైన ప్లాను వేశావు. చట్టబద్ధంగా నీ చెల్లెలికి పెళ్ళీడు వచ్చే రోజు దాకా ఆగావు. నీ చెల్లెలు టూరిస్టు బస్సులో వెళ్ళింది. ఆమె మైసూర్లో దిగిపోయింది. నీ మాటల్నీ, ప్లాన్‌నీ గుడ్డిగా నమ్మిన మోహన్ యెవ్వరికీ చెప్పకుండా మైసూరు వెళ్ళిపోయాడు. మూడ్రోజులు వాళ్ళు నీ సలహా ప్రకారం యే చాముండేశ్వరి సన్నిధిలోనో భార్యాభర్తలుగా రూపొంది ఉండాలి.

"ఈలోగా రాజారావు కొడుకు గురించి పేపర్లో ప్రకటన ఇచ్చాడు. నీ బుర్ర కత్తిలా పనిచేసింది. ఆర్థికమైన ఇబ్బందుల్లో ఉన్న నువ్వు ఒక దెబ్బకి రెండు పిట్టల్ని కొట్టాలనుకున్నావ్. మోహన్ ఆచూకీ తెలిసిన వ్యక్తిలా నటిస్తూ రాజారావుని కాంటాక్టు చేశావు. టేపుద్వారా మోహన్ కంఠాన్ని అతనికి వినిపించి, మోహన్ని కిడ్నాప్ చేసినట్టు నాటకం ఆడి, అయిదు లక్షలు రాన్‌సమ్‌గా గుంజుకున్నావు! మోహన్ నీ ఇంటికి అల్లుడయ్యాడు. అయిదు లక్షలు నీ చేతుల్లో వాలింది. సమయం చూసి మోహన్ని తెరవెనకనుంచీ ఇవతలికి రప్పించాలనుకున్నావ్ ...."

"ఇది ఘోరం! అన్యాయం!" శ్రీనివాసరావు బొబ్బలెడుతూ, తటాలున లేచాడు. అతని మొహం జేవురించింది. పెదవులు వణకడం ప్రారంభించాయి "ఆ నేరం మీద రంగధామ్‌ని అరెస్టు చేశారు! మీరు అన్యాయంగా."

"రంగధామ్ అరెస్టయినట్టు నీకెలా తెలుసు?' టెంపో అడ్డొస్తూ గద్దించాడు.

"నాకే కాదు; అందరికీ తెలుసు!" శ్రీనివాసరావు వెటకారంగా అన్నాడు.

కొంపో చిన్నగా నవ్వాడు. "ఆ ఆరెస్టు యెంతో రహస్యంగా జరిగింది. ఇన్ స్పెక్టర్ పృథ్వీరావ్ కీ, నాకూ, రంగధామ్ కీ తప్పా మరెవ్వరికీ తెలీదు! నువ్వు రంగధామ్ మీద వో కన్నేసి ఉంచావు ..."

"ఎందుకో?" శ్రీనివాసరావు వెటకారంగా అన్నాడు.

"అతను ప్రతిమని ప్రేమించాడని నీకు తెలుసు. మోహన్ని ద్వేషిస్తున్నాడని ఇంకా బాగా తెలుసు. అంచేత అనుమానాన్ని అతనిమీదికి సరఫరా చేయడానికి నువ్వు చాలా శ్రమపడ్డావు. అతని పేరుతో ఫోన్ చేసి క్యాసెట్ తెచ్చుకున్నావు. ఆ నాటకంలో నువ్వు నటించలేవు. అయితే రిహార్సల్స్ సమయంలో ప్రాంప్టింగ్ నిర్వహించాలని రామ్మోహన్ ద్వారా ఇవాళే తెలుసుకున్నాను.

రంగధామ్ ఇంట్లో శబ్దరత్నాకరం, వెబ్ స్టర్ డిక్షనరీలున్నాయని నీకు తెలుసు. ఆ రెండింటినీ ముందుకు లాగి, వెనక క్యాసెట్ ని ఇరికించావు. లైబ్రరీకి వెళ్ళి వోపిగ్గా కూచుని ఆ రెండు నిఘంటువుల్లో నీకు అవసరమైన పదాల్ని యేరుకుని, వ్రాసుకున్నావు. రెండురోజులు లైబ్రరీకి వెళ్ళి, రెఫరెన్స్ బుక్స్ లో ఉన్న నిఘంటువుల్ని అడిగి తీసుకున్నావు. లైబ్రేరియన్ కి నువ్వు తెలుసు. ఇవాళ అతన్ని కలుసుకున్నాను...."

"నో!" శ్రీనివాసరావు కీచుగా అరిచాడు. అతని శరీరం వణకసాగింది. "ఇవన్నీ....ఇవన్నీ....అబద్ధాలు.."

"డిక్షనరీల్ని ముందుకిలాగి క్యాసెట్ ని అక్కడ ప్లాంట్ చేసినప్పుడు నిన్నెవరూ చూడలేదనుకున్నావ్. బిస్కట్లు తీయడంలో మునిగిపోయిన రంగధామ్ నిన్ను

చూడలేదు. కానీ, బాత్ రూమ్‌లోంచీ అప్పుడే ఇవతలికి వస్తున్న రంగధామ్ తల్లి వరండా దిగి గేటువైపు వెళ్తున్న నిన్ను చూసింది. తరచుగా వెళ్ళి రంగధామ్‌ని కల్సుకునే నీ గురించి ఆమె పెద్దగా పట్టించుకోలేదు. అయితే ఇవాళ సాయంత్రం నేను ప్రశ్నించాక, నిన్ను చూసినట్లు ఆమె చెప్పింది. నిన్ను ఊరేగించి మైక్‌లో అడిగితే, నీ కోసం క్యాసెట్ తెచ్చిన కుర్రాడు నిన్ను పోల్చి చెప్పేస్తాడు!" టెంపో ఆగాడు. సిగరెట్ దమ్ము లాగి అతనివైపు చూశాడు.

శ్రీనివాసరావు సోఫాలో కూలబడ్డాడు. ఉక్కిరి బిక్కిరవుతూ టెంపోని చూశాడు. రెండుక్షణాల్లో తెప్పరిల్లి చిన్నగా దగ్గాడు. "మిస్టర్ టెంపో, మీరు చెప్పిందంతా తార్కికంగా వుంది. ఎవరైనా మీ రీజనింగ్‌ని నమ్ముతారు. మీరు పొరబడుతున్నారు. నేను మీరన్న నేరాలు చేయలేదు. కానీ.... కానీ.. చెల్లాయీ, మోహన్ మెనూల్లో ఉన్న సంగతి ... తెలుసు.... అది మీకెలా తెలుసు?"

"అంతా చెప్తాను. రెండో తేదీన కాకుండా, తరవాత నువ్వు క్యాసెట్ తెప్పించుకొనివుంటే, ఆపని రంగధామ్ చేశాడని నేను అనుకునేవాణ్ని. కానీ, మోహన్ నాలుగో తారీఖున మాయం అవుతాడని తెలిసిన వ్యక్తి తప్ప మరొకరు అంత ముందు జాగ్రత్తతో ప్లాన్ చేయలేరు. ఇవాళ రంగధామ్ అమాయకత్వాన్ని అతని కళ్ళలో చూశాక, నేను దొరను దొంగలా ఊహిస్తున్నట్టు అనుమానం వేసింది...."

శ్రీనివాసరావు నవ్వు టెంపో మాటలకి ఫుల్‌స్టాప్ పెట్టింది. అతను నిర్లక్ష్యంగా టెంపోని చూశాడు,

"మిస్టర్ టెంపో, మీరు చెప్పిందానిలో సగం కరెక్టే. రెండో సగం కేవలం ఊహాగానం! మోహన్, నా చెల్లెలూ ఇద్దరూ పెద్దవాళ్ళయ్యారు. వాళ్ళ ఇష్టాను సారం పెళ్ళిచేసుకునే హక్కు వాళ్ళకుంది. నా సహాయం లేకున్నా వాళ్ళు ఎంగుడూ పెళ్ళాడగలరు. అయ్యారు! అంచేత నేను అతన్ని కిడ్నాప్ చెయ్యలేదు. రాన్సమ్ వసూలు చేయలేదు! నామీద మీ అనుమానం బేస్‌లెస్! అది నిలవదు. ఎందుకంటే, హనీమూన్ ముగిశాక మోహన్ తిరిగొచ్చాక నిజం తెలుస్తుంది...."

ఈసారి టెంపో నవ్వు అతన్ని ఆపింది. "శ్రీనివాస రావ్, కిడ్నాప్ నాటకం గురించీ, అయిదు లక్షల వసూలు గురించీ మోహన్‌కి తెలీదు. కొడుకు తిరిగి ఇల్లు చేరాక, పైకం గురించి రాజారావు బెంగ పెట్టుకోడు. నీ ప్లాన్ ఫలితంగా అమాయకుడైన రంగధామ్ బలి పశువుగా పోలీసులకి చిక్కిపోతాడు. డబ్బు దొరక్క పోయినా, అతను కిడ్నాపర్ గానే లెక్కించబడతాడు. రంగధామ్ అలాంటి పాడుపని చేయడానికి వెనుదియ్యాడని మోహన్, ప్రతిమా ఇద్దరూ చెప్పగలరు. రాగానే నువ్వు వాళ్ళకి బ్రెయిన్ వాష్ చేస్తావ్...."

శ్రీనివాసరావు కుడిచేతిని పైకెత్తాడు తీక్షణంగా టెంపో కళ్ళల్లోకి చూశాడు. "చివరిసారిగా చెప్తున్నా. నేను రాజారావునుండి డబ్బు వసూలు చేయలేదు! నా చెల్లెలు తను ప్రేమించిన వ్యక్తిని పెళ్ళాడ్డంలో సహాక రించాను. అది నేరంకాదు!"

టెంపో మెల్లగా పైకి లేచాడు. శ్రీనివాసరావువైపు హీనంగా చూశాడు. "ఓకే, శ్రీనివాసరావ్.... జరిగిం దాన్నీ, చేసిందాన్నీ అంగీకరించి శిక్ష తగ్గించుకునే

ప్రయత్నం చేస్తావన్న నమ్మకంతో ఇంతసేపూ నీతో మాట్లాడుతూ కూచున్నాను. నువ్వు మైసూర్ లో ఉన్న నీ చెల్లెల్నీ, మోహన్నీ రేపు బయల్దేరి రమ్మని ఫోన్ చేసిన సంగతికూడా నాకు తెలుసు. నేను వెళ్తాను. రావాల్సిన వాళ్ళొస్తారు. అడగాల్సింది అడుగుతారు!" అంటూ అతను చకచకా గుమ్మంవైపు నడిచాడు. గొళ్ళెంతీసి, తలుపు కొద్దిగా లాగి పట్టుకున్నాడు.

"టొంపో గారూ!" శ్రీనివాసరావు కంఠం అతన్ని ఆపింది. టొంపో తిరిగి ప్రశ్నార్థకంగా చూశాడు

"నిరాధారంగా నన్ను అనుమానిస్తున్నారు! మీ పనికిమాలిన రీజనింగ్ తో పోలీసుల్ని తికమక పెట్టి నా మీదికి ఉసిగొలపకండి! అది అన్యాయం...."

"శ్రీనివాసరావ్, నిరాధారంగా కాదు: ఆధారాలు అవసరాన్ని మించి ఉన్నాయ్! రంగధామ్ లా నటిస్తూ క్యాసెట్ తెప్పించుకున్నావు. లైబ్రరీకి వెళ్ళి డిక్షనరీలు పారాయణ చేస్తూ కూచున్నావు. క్యాసెట్ ని రంగధామ్ ఇంట్లో పెట్టావు...."

"వాటిని మీరు నిరూపించలేరు అవన్నీ కట్టుకథలు!" శ్రీనివాసరావు ఎగతాళిగా, సగర్వంగా అన్నాడు.

టొంపో తలుపునుంచీ దూరంగా జరిగాడు. "అలాగని నిన్ను నువ్వు మభ్యపెట్టుకోవద్దు. రాజారావు గారుని ఆ రాత్రి, నిర్జనంగా ఉన్న రోడ్లో వదిలివెళ్తున్న నిన్ను బీట్ కాన్ స్టేబుల్ చూశాడు. ఏ క్షణంలో అయినా పోలీసులొస్తారు. మద్రాసు పోలీసులనుండీ వాళ్ళకి వర్తమానం ఈపాటికి వచ్చేవుంటుంది. నీ భార్యద్వారా నువ్వు పంపించిన సూట్ కేస్ లో అయిదులక్షలూ, ఎడిట్ చేసిన క్యాసెట్ వాళ్ళకి స్టేషన్ లోనే దర్శనం ఇచ్చి

వుంటాయి! అమాయకురాలైన నీ భార్యను, పాడుపనికి ఉపయోగించుకుని ....”

ఉన్నట్టుండి సుడిగాలిలా దూసుకొస్తున్న శ్రీనివాసరావుని చూస్తూ టోంపో ఆపేసి, తటాలున పక్కకి జరిగాడు. శ్రీనివాసరావు టోంపోవైపు రాలేదు. తలుపుని గజబలంతో విసురుగా లాగి అవతలికి దూకేశాడు.

టోంపో జేబులోంచి సిగరెట్ తీసి, శాంతియుతంగా వెలిగించాడు. గుమ్మం దగ్గర చప్పుడైంది. విలవిల్లాడుతున్న శ్రీనివాసరావుని లోపలికి తోసుకొస్తున్నాడు ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్. అతని మొహం ఉద్రేకంతో మెరుస్తోంది. అతని చేతిలో రివాల్వర్ శ్రీనివాసరావు డొక్కలో గుచ్చుకుంది.

“శ్రీనివాసరావ్, విగ్రహంలా నుంచో. కదిలేవో డొక్క చీరుకుపోతుంది!” పృథ్వీరావ్ కంఠం ఖంగుమంది.

టోంపో చిరునవ్వుతో శ్రీనివాసరావు మొహంలోకి చూశాడు. శ్రీనివాసరావు మొహం పాలిపోయి, చెమటతో తడుస్తోంది. ఎండిపోతున్న అతని పెదవులు వణుకుతున్నాయి. ఎర్రటికళ్ళు రెప్పపాటు లేకుండా టోంపో వైపు చూస్తున్నాయి. ఆ కళ్ళల్లో ఆగ్రహంలేదు. ఆందోళనా, భయం ఆ కళ్ళల్లో ఎర్రగా ప్రతిఫలిస్తున్నాయి.

ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ జేబులోంచి విజిల్ తీశాడు. మరుక్షణం విజిల్ శబ్దం హాల్లోని నిశ్శబ్దాన్ని చెల్లాచెదురు చేసింది. ఇంటిముందు టకటకమంటూ బూట్లు చప్పుడు చేశాయి. నలుగురు సాయుధ పోలీసులు లోపలికి జొరబడ్డారు....

# 14

ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ ఆఫీసు గదిలో అందరూ కూచున్నారు. డిటెక్టివ్ టెంపో, రంగధామ్, రాజారావు పృథ్వీరావ్ తెప్పించిన టీలు తాగేశారు.

రాజారావు ఉత్సాహంతో కరోనా వెలిగించాడు. టెంపోవైపు చిరునవ్వుతో చూశాడు.

"మిస్టర్ టెంపో, నిర్విరామంగా కృషి చేశారు. నిజం నిరూపించారు. థాంక్స్ ఎలాట్ .... అయితే నాకు తెలిసిన నిజం సంతోషం కలిగించేదిగా లేదు...."

రాజారావు ఆగి, బరువుగా నిట్టూర్చాడు.

టెంపో చిన్నగా నవ్వాడు "తన పెరుగుదలని బైటికి చూపించే అవకాశం, చొరవా ఇవ్వకుండా, మీ గొడుగుకింద మీ కొడుకుని పెంచారు. మోహన్ లోపల లోపలే ఎదిగాడు. మీతో చెప్పే ధైర్యంలేక, ప్రతిమ కోసం పరారయ్యాడు. పెళ్ళయ్యాక మీరూ, మీ లక్షలూ అతన్ని యేమీ చేయలేరని శ్రీనివాసరావు అతనికి నూరిపోశాడు. నచ్చిన పిల్లని మోహన్ పెళ్ళాడినందుకు సంతోషించి, అతన్ని మెచ్చుకోండి...."

"ఆ పిల్ల.... ప్రతిమ మరీ బరితెగించింది. అలాంటి తత్వం వున్న వాళ్ళు మా ఇంటి కోడలుగా...."

రాజారావు యేదో చెప్పబోయాడు.

"మిస్టర్ రాజారావ్, తన అన్న శ్రీనివాసరావు చేసిన పాడుపనిలో ఆమెకి వాటా వుందనుకోడం పొరపాటు. ఆడది తెగించడానికి కారణం మగాడే. మీ కొడుకే ఆమెకి ధైర్యం నూరిపోసి వుంటాడు."

రాజారావు తల బలహీనంగా ముందుకీ వెనక్కీ ఆడింది.

"టొంపో, రంగధామ్‌ని అరెస్టు చేశాక, నీ అనుమానం శ్రీనివాసరావు మీదికి ఎలా మళ్ళిందో అర్థంకాలేదు.." ఇన్‌స్పెక్టర్ పృథ్వీరాజ్ అన్నాడు.

"రంగధామ్‌ని పట్టిచ్చేలా ఒకేచోట, కళ్ళని పొడుస్తున్నట్టు కుప్పపోసిన సాక్ష్యాలే నాలో అనుమానం కలిగించాయి. రంగధామ్‌ని అపరాధిగా చూపించడానికి ఏర్పాటు చేయబడిన సాక్ష్యాలు అతను అమాయకుడంటూ తమ భాషలో నాతో బొబ్బలెట్టసాగేయి. ముందు చూపుతో. అసలు వ్యక్తిని ఏమార్చటానికి, రంగధామ్‌ని అరెస్టు చేయమన్నాను...." టొంపో ఆగి సిగరెట్ వెలిగించాడు.

ముగ్గురూ ఏకాగ్రతతో అతన్నే చూస్తున్నారు. టొంపో ప్రారంభించాడు:

"మోహన్‌ని తన చెల్లెలు ప్రేమిస్తోందన్న విషయం అతను దాచాడు. బాధ్యత కలిగిన అన్నయ్యగా నాముందు నాటకం ఆడాడు. అతను మాట్లాడుతున్నప్పుడు అతని భార్యనే చూస్తూ కూచున్న నాకు లీలగా అనుమానం వేసింది. భర్త పూర్తిగా నిజం చెప్పటంలేదన్న భావం ఆమె కళ్ళల్లో అమాయకంగా అవుపించింది.

"అంతేకాకుండా శ్రీనివాసరావు నాతో మొదటే అబద్ధమాడాడు. ప్రతిమ పేపర్లో చూసి, మోహన్ అంతర్ధానం గురించి తనకి చెప్పిందన్నాడు. నిజంగా ప్రతిమ టూరిస్టు బస్సులో వెళ్ళిననాటికి రాజారావుగారు పేపర్లో ప్రకటన వెయ్యలేదు! తనని చేరుకోడానికి శ్రీనివాసరావే నాకు క్లూలు ఏర్పాటు చేశాడు! పైకి కనిపించేలా అతను వేసిన పట్టాలమీదే వెళ్ళివుంటే రంగధామ్ బలయిపోయేవాడు...."

"గురూ, బీట్ కానిస్టేబుల్, అర్ధరాత్రి దాటేక శ్రీనివాసరావు గార్ని నేతాజీ రోడ్‌లో వదిలేయడం చూసినట్టు నాకు చెప్పలేదే!" పృథ్వీరావ్ నవ్వుతూ అడిగాడు.

టెంపో చిన్నగా నవ్వాడు. "బీటు కానిస్టేబుల్ చూసేగా చెప్పడానికి!"

"వాట్?" ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ అరిచాడు.

"శ్రీనివాసరావుని బోల్తాకొట్టించడానికి అలా బుకాయించాను! తరవాత — మద్రాసు పోలీసులు అతని భార్యనీ అయిదు లక్షల్నీ రైల్వేస్టేషన్‌లో రిసీవ్ చేసుకున్నారనీ బుకాయించాను!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"మొదట్లో నువ్వు నిజంగానే మద్రాసు పోలీసులుకి ఇన్‌ఫార్మ్ చేశావేమో అనుకున్నా!" పృథ్వీరావ్ పకపక నవ్వాడు.

"టెంపోగారూ, మీ ప్రవర్తన నన్నెంతో అఫెండ్ చేసింది. కేసులో ఇరికించి, తాట వొలిచేస్తారేమో అని నిజంగానే హడలిపోయాను. చివరికి, రక్షించారు; థాంక్స్!" రంగధామ్ నవ్వుతూ అన్నాడు.

"నిన్నూ. రాజారావుగార్ని అడకత్తెరలో ఇరికించా అనుకున్న శ్రీనివాసరావు అడకత్తెరలో తనే ఇరుక్కున్నాడు!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"రాజారావుగారో, శ్రీనివాసరావు అంతా కక్కేశాడు. మైసూర్లో ఉన్న మీ అబ్బాయితో మాట్లాడాం. తెల్లారేలోగా మీ కొడుకూ, కోడలూ మీ ఇంటికి చేరుకుంటారు. ఫార్మాలిటీస్ అన్నీ పూర్తయ్యాక మీరు

చెల్లించిన అయిదు లక్షలూ మీకు వాపసు చేయబడతాయి" అన్నాడు ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్.

"థాంక్స్ ఇన్‌స్పెక్టర్. రేపు సాయంత్రం మా ఇంట్లో రిసెప్షన్ ఏర్పాటు చేస్తున్నా. దానికి టెంపో గారూ, మీరూ, కమీషనర్ గారూ ముగ్గురూ వస్తున్నారు!" రాజారావు నవ్వుతూ అన్నాడు.

"ఠంగ థామ్స్, లెటస్ గో!" అంటూ టెంపో లేచాడు.

"మిస్టర్ టెంపో, మీ ఫీజు...." అంటూ కుర్చీ లోంచీ లేచాడు రాజారావు.

"కవర్లో పెట్టి రెడీగా ఉంచండి. రేపు రిసెప్షన్‌కి వస్తాగా!" టెంపో నవ్వుతూ అన్నాడు.

—:అ యి పో యి ం ది:—

# హై జాకర్స్

## సుంకరి రాంప్రసాద్

"నీ జాతి కోసం, నీ మతం కోసం, నీ ధర్మం కోసం
నీవు ఈ పని చేయక తప్పదు కర్తార్ సింగ్."

ఆ చిన్న గదిలో సంత్ దలీల్ సింగ్ గొంతు మంద్రంగా ధ్వనించింది.

"కాని.... నా ఉద్యోగం" సన్నగా గొణిగాడు కర్తార్ సింగ్.

"మతంకోసం ప్రాణాలనే తృణప్రాయంగా త్యజించిన సంత్‌లు జన్మించిన శిక్కు జాతిలో పుట్టికూడా ఇలా భీరువులా మాట్లాడతావేం బిడ్డా!

"మనం స్థాపించబోయే శిక్కు రాజ్యంకోసం, మన అఖండ ఖలిస్తాన్ కోసం.... నీ ఉద్యోగాన్ని త్యాగం చేయలేవూ?" అన్నాడు సంత్.

రాజైనా, రారాజైనా, మతాధికారి శాసనాన్ని ఉల్లంఘించడానికి వీలులేదట.... ... ఒకనాడు మధ్యయుగంలో.

కాని ఈనాడు.

ఈ ఇరవై ఒకటవ శతాబ్దంలో కూడా.

పాంచాల సీమలో మఠాధికారులు ప్రజలనూ, పాలకులనూ శాసించగల్గుతున్నారు.

ఒక దేశ రాష్ట్రపతి, ఒక రాష్ట్ర ముఖ్యమంత్రి (ప్రజా సంక్షేమ దృష్టిలో తాము చేసినవి ధర్మమని తెలిసి కూడా)...ఆ మఠాధికారుల ముందు మోకరిల్లి క్షమాభిక్షను వేడుకున్నారంటే...

ఒక రాష్ట్ర ముఖ్యమంత్రి, మఠాధికారుల ఆజ్ఞపై దేవాలయం ముందు భక్తులు విడిచిన పాదరక్షలను శుభ్రం చేశాడంటే...ఆ జాతిపై ఆ మఠాధికారుల ప్రభావం, ప్రాబల్యం యెంత ఉందో స్పష్టంగా తెలుస్తూంది.

అఫ్టరాల్ కర్తార్ సింగ్ ఒక చిన్న ఎయిర్ లైన్ ఆఫీసరు. అతడు ఆ మఠాధికారి ఆజ్ఞను శిరసావహించబోతున్నాడంటే అందులో ఆశ్చర్యమేముంది?

తక్తాపై పద్మాసనం వేసుకుని కూర్చున్న సంత్ దలీల్ సింగ్ పాదాలకు భక్తిపూర్వకంగా నమస్కరించి, అతని వద్ద శెలవు తీసుకొని వెళ్ళిపోయాడు కర్తార్ సింగ్.

కర్తార్ సింగ్ ఆ గదిలోనుండి వెళ్ళిపోయిన రెండు నిమిషాల తరువాత ఆ గదిలోనికి ప్రవేశించారు, ముగ్గురు శిక్కు యువకులు.

కాని, శిక్కులకుండాల్సిన, గడ్డాలూ, మీసాలూ వారికి లేవు. నున్నగా షేవ్ చేసుకున్నారు వారు. తలపై శిఖగాని, పగిడీ కాని లేవు. చక్కగా క్రాప్ చేసి ఉంది వారి జుత్తు.

వారిని చూసినవారు యెవరూ వారిని శిక్కులని

ఆయతారు. వారి వంక సంతృప్తిగా చూశారు సంత్ దలీల్ సింగ్.

"బిడ్డలారా! ఆయన యెవరో మీరు చెప్పగలరా?" గదిగోడకున్న పెద్ద చిత్రపటాన్ని వారికి చూపిస్తూ అడిగాడు దలీల్ సింగ్.

"మ హా రా జ్ గురు గోవింద్ సింగ్! సంత్ జీ" అన్నారు ముగ్గురూ ముక్తకంఠంతో.

వారివంక మెచ్చుకోలుగా చూశారు దలీల్ సింగ్.

"శిక్కుజాతి ధైర్యాన్ని, శౌర్యాన్ని ప్రపంచానికి చాటుచెప్పిన మహారాజ్ ఆయన. శిక్కుల పదవ గురు దేవులు.

ఒకనాడు తన అనుచరుల ధైర్యాన్ని పరీక్షించాలనే కోరిక కల్గింది వారికి.

తన గుడారం ముందు తన అనుచరులందరినీ వరుసగా నిలుచుండమన్నారు. ఒక్కొక్క అనుచరుడు గుడారం లోనికి ప్రవేశిస్తున్నాడు. మరుక్షణం భయంకరమైన ఆర్తనాదం, చావుకేక ఆ గుడారంలోనుండి వినిపించ సాగింది. గుడారంలోనుండి ఒక మూల నేలను తడుపుతూ ఎర్రని, చిక్కని రక్తం పైకి రాసాగింది.

లోపలకు వెళ్ళినవారు యెవరూ పైకి రావటంలేదు. చావుకేకలు వినిపిస్తూనే ఉన్నాయి. రక్తం ప్రవాహంలా కారుతూనే ఉంది.

అయినా.. గుడారం బయటనున్న అనుచరులు చలించ లేదు భీరువుల్లా పారిపోలేదు.

తమ మతంకోసం, తమ గురువాజ్ఞకోసం ఆత్మార్పణ చేయడానికి ముందుకే సాగిపోయారు వారు.

వారు నిజమైన శిక్కులు. ధీరులు.

అయితే గురు గోవింద్ సింగ్ జీ నిజంగా తన అను చరులను చంపలేదు. కేవలం మేక రక్తాన్ని గుడారం బయటకు ప్రవహింపచేశారు వారు.

ఇప్పుడు చెప్పండి బిడ్డలారా!

వారిలా...మన మతంకోసం....మన అఖండ ఖలిస్తాన్ కోసం మీరు ఆత్మార్పణ చేయడానికైనా సిద్ధంగా ఉన్నారా?" ఆ ముగ్గురివంకా సూటిగా చూస్తూ అన్నాడు దలీల్ సింగ్.

"అఖండ శిఖ్ఖు రాజ్య సంస్థాపనకోసం మా ప్రాణా లను చిరునవ్వుతో అర్పిస్తాం బాబా!" అన్నారు ఆ ముగ్గురూ.

మోకాళ్ళపై వంగి నమస్కరిస్తున్న ఆ ముగ్గురిపై చేయి పైకెత్తి ఆశీర్వదించారు దలీల్ సింగ్.

చిరుగాలికి వారి చేతిలోని తాపళం మెల్లగా కద లింది. విజయగర్వంతో ఒక చిరుహాసం అతడి గుబురు మీసాల మాటున మెరిసి, తటిల్లతలా మాయమయ్యింది.

## 2

న్యూ ఢిల్లీ...

పాలం ఇంటర్ నేషనల్ ఎయిర్ పోర్టు సందడిగా ఉంది. వివిధ దేశాలకు చెందిన ఎందరో ప్యాసెంజర్లు, వారిని ఆహ్వానించడానికి వచ్చిన వ్యక్తులతో లాంజ్ కిక్కిరిసి ఉంది.

ఢిల్లీనుండి వాషింగ్‌టన్ వెళుతున్న ఇండియన్ ఎయిర్ లైన్సువారి పాన్ అమ్ బోయింగ్ విమానం రన్ వే మీద నిలబడి వుంది.

394 మంది ప్రయాణీకులు పట్టే ఎయిర్ బస్ అది.

చెకింగ్ పూర్తి చేసుకున్న ప్యాసెంజర్లు...ఒక్కొక్కరుగా మెట్లు ఎక్కి విమానంలో ప్రవేశిస్తున్నారు.

ఎంట్రన్స్ వద్ద నిలుచుని, చిరునవ్వుతో వారిని ఆహ్వానిస్తూంది ఎయిర్ హోస్టెస్ రంజిత.

పచ్చని పసిమి ఛాయలో మెరిసిపోతూంది ఆమె మేని ఛాయ. సాంప్రదాయకమైన పంజాబీ కుర్తా, పైజామాలలోనుండి నిండయిన ఆమె అవయవాల సొంపులు చూపరులకు నోరూరిస్తున్నాయి.

అన్నిటికన్నా అద్భుతమైనది ఆమె నవ్వు. విడీ విడని ఎర్రని పెదవుల మధ్యనుండి, తెల్లగా దానిమ్మగింజలలా మిల, మిలా మెరుస్తున్న పలువరస. వెన్నెలలాంటి నవ్వు ఆమెది.

మకరందం గ్రోలడానికి వ్రాలిన తుమ్మెద బరువుకు క్రిందకు వంగిన మందార పూరెమ్మలా కొద్దిగా క్రిందకు వ్రాలిన ఎర్రని క్రింద పెదవి తడిగా మెరుస్తూంది.

ఒక్కసారి చూస్తే మరచిపోలేని అందం ఆమెది. గ్రుచ్చి గ్రుచ్చి చూస్తున్నట్లున్న కొందరు ప్యాసెంజర్ల చూపులు ఆమెకు ఇబ్బందికరంగా ఉన్నాయి.

కాని ఉద్యోగ నిర్వహణలో ఇలాంటివన్నీ సహించడం ఆమెకు మామూలైపోయింది. చెరగని చిరునగవుతో ఆమె ప్రయాణీకులను ఆహ్వానిస్తూనే ఉంది.

వాషింగ్‌టన్‌కు పోయే పాన్ అమ్ బోయింగ్ ఫ్లయిట్ బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నట్లు ప్రకటన వినిపించింది.

ప్రయాణీకుల్లో తొందర ఎక్కువయింది.

పైలట్, కో పైలట్ కాక్‌పిట్ లోనికి ప్రవేశించారు. కాక్‌పిట్ (పైలట్ గది) తలుపులు మూసుకున్నాయి. రేడియో, కమ్యూనికేషన్ పరికరాలు సక్రమంగా

ఉన్నదీ, లేనిదీ టెస్టు చేసుకుంటున్నాడు కో పైలట్.

ఇంజన్, ఫ్యూయల్ అన్నీ సక్రమంగా ఉన్నట్లు గ్రీన్ సిగ్నల్ యివ్వబడింది.

ఇండియన్ ఎయిర్ లైన్స్‌లో ప్రయాణిస్తున్నందుకు ప్రయాణీకులందరికీ కృతజ్ఞతలు తెలుపుతూ, వారు తీసుకోవాల్సిన జాగ్రత్తల గురించి.... ఒక ప్రకటన ప్లేన్‌లోని స్టీరియో బాక్సుల గుండా వినిపించింది.

కొందరు ప్రయాణీకులు అప్పుడే సీట్లకున్న బెల్టులను నడుములకు బిగుంచుకోవడం ప్రారంభించారు.

ఒక్కసారి ప్రయాణీకుల వంక చూసింది ఎయిర్ హోస్టస్ రంజిత.

సీట్లన్నీ ఫుల్ అయి వున్నాయి.

'మొత్తం 394 మంది వచ్చినట్లే' అనుకుంది ఆమె.

ఫ్లయింగ్‌కు అన్నీ క్లియర్ అయినట్లే. ఇక కొద్ది క్షణాలలో పాన్ ఆమ్ బోయింగ్ ఎయిర్ బస్ గాలి లోనికి దూసుకుపోతూంది.

సరిగ్గా ఆ క్షణంలో....

రన్ వేగుండా సర్రున దూసుకుంటూ వచ్చి బోయింగ్ విమానం ప్రక్కనే ఆగిందొక వ్యాను.

లేత నీలం, తెలుపు రంగులలో వుంది ఆ వ్యాను. వ్యాన్ ముందు భాగంలోనూ, వ్యాన్ టాప్ మీద కొన్ని లైట్లు ఒక ప్రత్యేక పద్ధతిలో అమర్చి వున్నాయి. వ్యాన్ అద్దంపై ఇండియన్ ఎయిర్ లైన్స్ వారి స్టిక్కర్ అంటించి వుంది.

చూడగానే ఆది ఇండియన్ ఎయిర్ లైన్స్ వారి వ్యాన్ అని సులువుగా పోల్చుకోవచ్చు.

వ్యాను ఆగిన వెంటనే, దానిలోనుండి ముగ్గురు వ్యక్త

గ్రూపులు ఘటాలున క్రిందకు దిగారు.

వారి వంక ఆశ్చర్యంగా చూసింది రంజిత్.

ఎయిర్ ఫోర్స్ భద్రతా సిబ్బందికి చెందిన మనుషుల్లా వున్నారు వారు. వారు ధరించిన దుస్తులు, భుజాల పై, గుండెల పై వున్న లేబిల్స్....అన్నీ వారి హోదాను తెలియజేస్తున్నాయి.

'ఫ్లయిట్ బయలుదేరుతున్న ఈ చివరి నిమిషంలో... అకస్మాత్తుగా ఈ సెక్యూరిటీ ఫోర్స్ విజిట్ ఏమిటో.. ఎందుకో అర్థంకాలేదు ఆమెకు.

అయితే ఇలాంటి సంఘటనలు....అసంభవాలేంకాదు. ఎయిర్ లైన్స్‌లో తిరిగేవారికి ఇవి మామూలే.

ఫ్లయిట్ బయలుదేరుతున్న చివరి క్షణంలో ఎవరో విమానాశ్రయ అధికార్లకు ఫోన్ చేస్తారు. 'ఆ విమానంలో బాంబు వుందని' అది నిజం కాకపోవచ్చు. వట్టి ప్రాక్టికల్ జోక్ కావచ్చు.

కాని చూస్తూ, చూస్తూ కొన్ని వందలమంది ప్రాణాలతో రిస్క్ చేయలేం కదా. ఎయిర్ లైన్స్ భద్రతా సిబ్బంది చెకింగ్ మొదలుపెడతారు. తీరా, ఇంత హంగామా చేస్తే ఆ విమానంలో యే బాంబూ లేదని తేలిన సంఘటనలు ఎన్నో వున్నాయి.

ఫ్లయిట్ యింకో అరగంట ఆలస్యంగా బయలుదేరుతుంది. అంతే!

"బహుశ, అలాంటి ఫోన్ యేదో వచ్చి వుంటుంది" అనుకుంది రంజిత ఆ భద్రతా అధికారులను చూస్తూ.

ఆ ముగ్గురు అధికారులూ టక, టకా మెట్లెక్కి విమానంలోనికి అడుగుపెట్టారు.

అప్పుడు ముడివడింది ఆమె భృకుటి.

ఆ అధికారులు వేగంగానే యెక్కారు ఆ మెట్లు. కాని, ఆ ఎక్కడంలో ఒక ఈజ్ లేదు. కమాండ్ లేదు. అలవాటువలన రావాల్సిన చురుకుదనం లేదు.

క్రొత్తగా విమానం ఎక్కేవారిలో కనిపించే బెరుకు, తడబాటు కనిపించాయి ఆమెకు. ఎంతో సునిశితంగా చూస్తే గాని గ్రహించలేరు ఎవరూ.

'ఎంతో సుశిక్షితులైన అధికార్లలో ఆ తడబాటు ఎందుకు వచ్చింది? ఆమెలో చిన్న అనుమానం చోటు చేసుకుంది.

అప్రయత్నంగానే వారికి విష్ చేసిందామె. వారూ తిరిగి విష్ చేశారు.

అంతే! గతుక్కుమంది ఆమె.

వారు రీ విష్ చేసిన విధానం ఎయిర్ లైన్స్ అధికారులు చేసినట్లు లేదు. ఎవరో మామూలు ప్రయాణీకులు చేసినట్లుగా వుంది.

వారి వంక తీక్షణంగా చూసిందామె.

సాధారణంగా అధికారులలో ఒక రకమైన హుందాతనం ఠీవి, వారి కదలికలలో హోదా కొట్టవచ్చినట్లు కన్పిస్తాయి.

కాని, వారి ముఖాలలో, కదలికలలో అధికార్లకుండాల్సిన దర్పం కనిపించలేదు ఆమెకు. ఒక రకమైన రఫ్ నెస్, క్రూరత్వం కన్పించాయి.

ఆమె మనస్సు కీడును శంకించింది.

“వారు అధికారులు కారని” ఆమె మనసు ఘోష పెట్టసాగింది.

“అధికారులు కాకుంటే....ఎవరు వారు?” ఆమె ఆలోచిస్తూంది.

అప్పుడు సడన్‌గా తట్టింది ఆమెకు వారు యెవరయి వుంటారో.

"హై....జా....క....ర్స్...!"

ఆ ఆలోచన రాగానే ఆమె భయంతో వణికి పోయింది. గొంతులో తడి ఆరిపోతుంటే అతికష్టంమీద తనను తాను కంట్రోల్ చేసుకొంది ఆమె.

షాక్ నుండి తేరుకున్న మరుక్షణం ఆమె మొదటగా చేసిన పని...శిక్షణా కాలంలో చెప్పిన రహస్యకోడ్‌ను ప్రయోగించి కాక్‌పిట్‌లోని సిబ్బందికి ప్రమాద సూచన చేయటం!

ప్రమాద సూచన అందిన వెంటనే, పైలట్, కో పైలట్ ఎలర్టు అయ్యారు.

విమానం లోపల ఏం జరిగిందో వారికి తెలియదు. కాని యేదో ప్రమాదం వాటిల్లబోతున్నదని వారికి సూచన అందింది. రాబోతున్న ప్రమాదం యేమిటో, తామేం చేయాలో కూడా వారికి అర్థంకాలేదు.

కాక్‌పిట్‌లోనుండి విమానంలోనికి చూసారు వారు. అప్పుడే ఎంట్రన్స్ గేటును దాటి లోపలకు అడుగు పెడుతున్నారు ఆ ముగ్గురు అధికారులు.

ప్రమాద సూచనను అందుకొని వచ్చిన సెక్యూరిటీ స్క్వాడ్ అనుకున్నారు వారు ఆ ముగ్గురినీ చూస్తూ.

ప్రమాదం యేమిటో వారిని కనుక్కొందామని అడుగు ముందుకు వేయబోయాడు పైలట్.

ఆదే క్షణంలో—

ఆ ముగ్గురూ తమ చొక్కాల క్రింద దాచిన రివాల్వర్స్‌ను పైకితీసారు.

అవి లేటెస్టు మోడల్ బెరెట్టా రివాల్వర్స్.

మామూలు రివాల్వర్ల బరువులో సగం వుంటాయి అవి. పదహారు బుల్లెట్లు వుండే ఆ బెరెట్టాలో మామూలు రివాల్వర్ కంటే రెట్టింపు వేగంతో షూట్ చేయవచ్చు.

అత్యాధునిక రివాల్వర్స్‌తో రాక్షసుల్లా నిలబడ్డ వారిని చూసిన వెంటనే పైలట్‌కు వారెవరో అర్థం అయిపోయింది.

"హై...జా...క...ర్స్" సన్నగా గొణుక్కున్నాడతడు.

'ఆ హైజాకార్స్ కాక్‌పిట్‌లోనికి ప్రవేశించకముందే యేదో ఒకటి చేయాలి' అతడు ఆలోచిస్తున్నాడు.

అప్పటికే అతడి కోపైలట్ కాక్‌పిట్‌లోని రహస్య మార్గం తెరిచి వుంచాడు. నేలకు 36 అడుగుల ఎత్తులో వుంది ఆ రహస్య ద్వారం.

ఏం చేయాలి?

ప్రాణాలతో వారికి పట్టుబడటంకన్న పారిపోవటం మేలేమో! అనుకున్నారు వారు.

వారు వెంటనే తెగించి క్రిందకు దూకేశారు. ప్లేన్-ఫేస్ షీట్ నుండి జారి క్రిందికి పడ్డారు వారు. పైలట్‌కు మోకాళ్ళు, మోచేతులూ కొట్టుకుపోయాయి. కోపైలట్‌కు మోకాలు బెణికింది. దానితో బోర్లాపడ్డాడు. నుదురు చిట్లింది. ముక్కు, పెదవులూ రక్తసిక్తాలయ్యాయి.

"హైజాకర్స్! హైజాకర్స్!" అంటూ డెస్పరేట్‌గా అరుస్తూ ఎయిర్‌పోర్టు ఆఫీసువైపు పరుగెత్తారు వారు.

'హైజాకర్స్' అన్నమాట వినిపించగానే ఎయిర్ పోర్టులో సంచలనం మొదలయింది.

ప్రాణ భీతితో ప్యాసెంజర్లు చెట్టుకొకరు, పుట్ట

కారుగా పారిపోయారు. కేవలం కొద్దినిమిషాలలో పాలం ఎయిర్ పోర్టు నిర్మానుష్యమయిపోయింది.

విమానాశ్రయ సిబ్బంది, సెక్యూరిటీ ఫోర్స్ తప్ప ఒక్క పురుగుకూడా మిగలలేదు అక్కడ.

ఈ కలకలానికి...లోపలనున్న హైజాకర్స్ ఎలర్టు అయ్యారు.

విమానం తలుపులూ, కిటికీలూ అన్నీ మూసేశారు వారు.

అదొక విచిత్రమైన పరిస్థితి.

విమానం హైజాక్ చేయబడింది. కాని విమానాన్ని నడిపేందుకు పైలెట్ గాని, అతడి సిబ్బందిగాని లేరు. తప్పించుకు పారిపోయారు.

ఆ విమానం అక్కడనుండి కదలదు. హైజాకర్స్ యెక్కడికీ పారిపోలేరు.

కాని....వారి చేతులలో బెరెట్టా రివాల్వర్స్ వున్నాయి. వారి దయాదాక్షిణ్యాలపై 394 మంది ప్రయాణీకుల ప్రాణాలు ఆధారపడి వున్నాయి.

వారు ఎక్కడికీ పోలేరు.

వారి దగ్గరకూ ఎవరూ పోలేరు.

ఏం జరగబోతూంది?

అటు అధికారులలోనూ, ఇటు హైజాకర్స్‌లోనూ... క్షణ, క్షణానికీ సందేహం మేరువులా పెరుగుతూంది.

టెన్షన్...!

# 3

చేతిలోని రివాల్వర్స్‌తో కాలరుద్రుల్లా నిలుచున్న ఆ ముగ్గురి వంకా భయం, భయంగా చూస్తున్నారు విమానంలోని ప్రయాణీకులు.

ఆ ముగ్గురిలో ఒకడు పెదవులను విప్పాడు. ఊపిరి బిగబట్టి మరీ అతడి మాటలను వినసాగారు ఆ ప్రయాణీకులు.

"చూడండి .... లేనిపోని రిస్కులు తీసుకొని మీ ప్రాణాలమీదకు తెచ్చుకోకండి. మా అనుమతిలేకుండా కదిలితే నిర్దాక్షిణ్యంగా కాల్చిపారేస్తాం.

మేం ముగ్గురమే కదా మీరు 494 మంది కదా అని మీరేమైనా అతిగా ఆలోచిస్తున్నారేమో!

మా దగ్గరున్న బెరెట్టా రివాల్వర్స్‌లో ఒక్కొక్క దానిలో పదహారు బుల్లెట్స్ వున్నాయి. అంటే మొత్తం నలభై ఎనిమిది...బుల్లెట్లు.

నలభై ఎనిమిదిమందిని చంపాక మేం పట్టుబడటం అంటూ సంభవిస్తుంది.

ప్రాణాలకు తెగించే మేం ఈ హైజాకింగ్‌కు సిద్ధపడ్డాం. అఖండ ఖలిస్తాన్ కోసం ఆత్మార్పణ చేయడానికి ధీరులైన శిక్కులెవరూ వెనుకంజ వేయరన్న నిజం మీకు తెలుసనుకుంటాను.

సో...మాతో సహకరించండి.

ప్రభుత్వం మా డిమాండ్లను అంగీకరించిన మరుక్షణం మిమ్మల్ని క్షేమంగా విడుదల చేస్తాం. అంతవరకూ మీరంతా బుద్ధిగా వుంటారనే ఆశిస్తాను."

సూది క్రిందపడితే వినిపించేంతటి నిశ్శబ్దం అలుముకుంది ఆ విమానంలో.

రెండు క్షణాల తరువాత మళ్ళీ అతడే మాట్లాడటం ప్రారంభించాడు.

"మీకు తెలుసో, తెలియదో...ఈ విమానంలోని పైలట్, కో పైలట్ క్రిందకు దూకి పారిపోయారు.

నా. .విమానాశ్రయంలోని అధికారులతో మాట్లాడటానికి వైర్‌లెస్ సెట్ ఆపరేషన్ తెలిసినవారు ఎవరైనా కావాలి. మీలో అలాంటి వారు ఎవరైనా వున్నారా? వుంటే... పైకి లేచినిలబడండి. ఎంత వేగంగా మనం విమానాశ్రయ అధికారులను కంటాక్ట్ చేయగల్గితే... అంత వేగంగా మీరు విడుదల గావచ్చు.

“సో,..మీ కోసం మీ విడుదలకోసమైనా మీరు మాతో సహకరించాలి.”

ప్రయాణీకులంతా ఒకరి, ముఖాలొకరు చూసుకున్నారు. ‘ఆ వైర్‌లెస్ ఆపరేషన్ తెలిసిన వారెవరైనా వుంటే లేచి, పుణ్యంకట్టుకోండిరా బాబూ!’ అన్న అభ్యర్థన వారి కళ్ళల్లో కదలాడుతూంది.

ఆ ముగ్గురూ, ప్రయాణీకుల వంక అసహనంగా చూస్తున్నారు.

రెండు క్షణాల తరువాత...

ఒక ప్రయాణీకుడు మెల్లగా లేచి నిలబడ్డాడు.

‘తమను ఆదుకోడానికి వచ్చిన ఆపద్బాంధవుడు ఎవరా’ అని అతడి వంక ప్రయాణీకులంతా ఆత్రంగా చూశారు.

అంతే!

అతడిని చూసిన మరుక్షణం వారి ముఖాలు నల్లగా మాడిపోయాయి. భయాశ్చర్యాలతో వారు నోళ్ళు తెరిచారు.

అతడి వంక సాదరంగా చూశారు ఆ ముగ్గురు హైజాకర్లూ. వారి పెదవులపై చిరునవ్వు చిందులేసింది.

అతడు...

ఆ లేచిన ప్రయాణీకుడు...ఒక శిష్యు..!

'అగ్నికి వాయువు తోడయినట్లు, వున్న ముగ్గురూ చాలక, వీరికి తోడు మరొకడా!' అనుకున్నారు ప్రయాణీకులు.

“ఐ యామ్ జోగిందర్ సింగ్.”

భీకరంగా, డబ్బాలో గులకరాళ్లు వేసినట్లు ధ్వనించింది అతడి గొంతు.

అతడి కళ్ళు ఎర్రగా, చింతనిప్పుల్లా వున్నాయి. కందగడ్డలా వుంది ముఖం. చూడగానే దయా, దాక్షిణ్యాలు లేని కసాయివాడులా అవుపిస్తాడు అతడు.

పెద్ద, పెద్ద అంగలు వేసుకుంటూ ముందుకు నడిచాడు అతడు.

“వెల్‌కమ్ జోగిందర్ సింగ్! వెల్‌కమ్! మాతో మరో శిక్కు సోదరుడు చేతులు కలుపుతున్నందుకు మాకెంతో సంతోషంగా వుంది.”

జోగిందర్‌ను కాక్‌పిట్ వైపు ఆహ్వానిస్తూ అన్నాడు ఒకడు. మిగిలిన ఇద్దరూ జాగ్రత్తగా ప్రయాణీకులను కవర్ చేస్తూ నిలుచున్నారు.

ఒక్కొక్క క్షణం భారంగా దొర్లుతోంది.

## 4

ఎయిర్ పోర్టు అంతా హడావుడిగా వుంది.

ఓ ప్రక్క అధికారులు ఆదుర్దాగా తిరుగుతున్నారు. మట్టిరంగు యూనిఫారాలు ధరించిన పదిమంది కమెండోలు అధికారుల ఆజ్ఞకోసం ఎదురుచూస్తూ నిలుచున్నారు. వారి చేతులలో శక్తివంతమైన స్టెన్ గన్స్ వున్నాయి. వారి భుజాలపై టియర్ గ్యాస్ సిలిండర్లు బెల్టులతో బిగించబడి వున్నాయి.

మరో ప్రక్క లౌడ్ స్పీకర్‌ను పట్టుకొని 'హైజాకర్స్‌ను

లాంగిపొమ్మని' హెచ్చరికలు పంపుతున్నా డోక అధికారి.

యింకో ప్రక్క ఎయిర్‌ఫోర్ట్ చీఫ్ కంట్రోలర్ రూమ్‌లో సి.బి.ఐ. ఆఫీసర్లతో రహస్య సమావేశం జరుగుతుంది.

అధికారులంతా తీవ్రంగా ఆలోచిస్తున్నారు.

'ఏం చేయాలి? ఈ రాన్‌సమ్‌ను ఎలా టాకిల్ చేయాలి?'

విమానంనుండి తప్పించుకు వచ్చిన పైలట్ మాటలను బట్టి హైజాకర్స్ ముగ్గురేనని తెలుస్తూంది.

కాని, వారి చేతులలో బెరెట్టా రివాల్వర్స్ వున్నాయని కూడా తెలుస్తూంది.

కమెండోలను పంపి, విమానాన్ని ముట్టడించి, హైజాకర్స్‌ను బంధించడం పెద్ద సమస్య కాదు. కాని, కమెండోల ఎటాక్ గురించి హైజాకర్స్‌కు తెలిసిందంటే....

కమెండోలు విమానాన్ని ముట్టడించే లోగానే కొందరు అమాయకులైన ప్రయాణీకుల ప్రాణాలను పొట్టన పెట్టుకుంటారు వారు. విమానాన్ని ధ్వంసం చేయవచ్చు.

మరి ఎలా? ఎలా ఈ చిక్కుముడిని విప్పడం?' అదే వారు తీవ్రంగా ఆలోచిస్తున్నారు.

అదే సమయంలో....

కంట్రోల్ రూమ్‌లో....

వైర్‌లెస్ సెట్ ముందు ఆత్రంగా నిలబడి ఎదురు చూస్తున్నారు మరికొందరు ఎయిర్‌లైన్స్ అధికారులు.

'హైజాకర్లు ఏవో గొంతెమ్మ కోర్కెలు కోరతారని, ప్రయాణీకులను విడిచిపెట్టడానికి ఏవో కండిషన్లను విధి

స్తారని' ఆ అధికార్లకు తెలుసు.

అందుకే వారు ఆత్రంగా ఎదురు చూస్తున్నారు.

హైజాక్ చేయబడ్డ విమానంతో సంబంధాలను పున రుద్ధరించడానికి ఆపరేటర్ నిర్విరామంగా ప్రయత్నిస్తు న్నాడు. కానీ అటునుండి ఏ విధమైన రెస్పాన్సూ రావటంలేదు.

అలసటతో అతని నుదుట చెమట పట్టింది.

రెండు నిముషాలు ఆగి, మళ్ళీ ప్రయత్నిద్దామని, హెడ్ ఫోన్సును తీసి ప్రక్కను పెట్టబోయాడతడు.

అదే క్షణంలో....

అతని ఎదురుగా నున్న వైర్‌లెస్ సెట్ ప్రాణంపోసు కున్నట్లు 'బీప్ ....బీప్' మంటూ అరవసాగింది.

ఆ శబ్దాలను విన్న మరుక్షణం అతడిలోని అలసట మాయమైపోయింది.

"కనెక్షన్ లభించింది" అన్నాడతడు ఉత్సాహంగా తన అధికారులవంక చూస్తూ.

అతడి వెనుక నిలుచున్న ముగ్గురు అధికారులూ ఆత్రంగా ముందుకు వంగారు.

ప్రక్కనే వున్న టేప్‌రికార్డర్‌ను ఆన్ చేశాడు ఆపరే టర్. అదే చేత్తో స్టీరియో బాక్సులకు కనక్షన్ యిచ్చాడు.

చీఫ్ కంట్రోలర్ రూంలో వున్న ఉన్నతాధికార్లు స్టీరియోగుండా వినవస్తున్న మాటలను ఆలకించసాగారు.

వైర్‌లెస్ సెట్ ద్వారా ప్రసారమవుతున్న హైజా కర్స్ మాటలను రికార్డ్ చేస్తూ టేప్‌రికార్డర్ లోని స్పూల్ మెల్లగా తిరుగుతూంది.

హైజాకర్స్ చెబుతున్న ఒక్కొక్క కండిషన్నూ

వింటున్నకొద్దీ....అధికారుల నుదుట చెమటలు పట్ట సాగాయి.

హైజాకర్లు ముచ్చటగా మూడే కోర్కెలను కోరారు. అవి:

ఒకటి: పది మిలియన్ల అమెరికన్ డాలర్లను ఒక బాక్సులో పెట్టి, వారికి అందించాలి. ఆ బాక్సును మోసుకొని విమానం దగ్గరకు వచ్చే వ్యక్తి, వంటిమీద కేవలం డ్రాయర్ మాత్రమే ధరించాలి.

ఆ డబ్బు అందిన తరువాత, మొదటి విడతగా నూరు మంది ప్రయాణీకులు విడుదల చేయబడతారు.

రెండు: ఖలిస్తాన్ ఉద్యమంలో తీవ్రవాదులుగా అరెస్టు చేయబడి, తీహార్ జైలులో శిక్షననుభవిస్తున్న టెర్రరిస్టులను విడుదల చేయాలి. వారు విడుదలయ్యారని ధృవపరచుకున్నాక .... రెండవ విడతగా మరో నూరు మంది ప్రయాణీకులు విడుదల చేయబడతారు.

మూడు: పైలట్‌నూ, అతడి సిబ్బందినీ పంపి, విమానం అక్కడనుండి కదిలే ఏర్పాట్లు చేయాలి. విమానాన్ని క్షేమంగా అమెరికాలోని 'ఈక్వెడర్' కు చేర్చాలి.

ఈక్వెడర్ చేరిన తరువాత మిగిలిన ప్రయాణీకులు విడుదల చేయబడతారు.

వీటిలో ఏ ఒక్కదానికి వ్యతిరేకంగా జరిగినా ఆ విమానాన్ని బాంబులతో పేల్చేస్తారు.

హైజాకర్ల కోర్కెలను విన్నమీదట అధికార్లకు కాళ్ళూ, చేతులూ ఆడటం మానేశాయి.

'తాము ప్రభుత్వంతో సంప్రదించడానికి కనీసం ఎనిమిది గంటల వ్యవధి అయినా కావాలి' అన్నారు అధికా

రులు.... ఆ హైజాకర్లతో.

కాని, హైజాకర్లు దానికి అంగీకరించలేదు. కేవలం మూడు గంటల వ్యవధి యిచ్చారు వారు. ఆ మూడు గంటలలో ప్రభుత్వం తమ కోర్కెలను సమ్మతిస్తున్నట్లు మెసేజ్ రాకుంటే....

ఆ క్షణం నుండీ మారణహోమం ప్రారంభమవుతుందని' అన్నారు వారు.

'ప్రతి పది నిముషాలకూ ఒక్కొక్క ప్యాసెంజరు శవ రూపంలో రన్ వే మీదకు విసిరివేయబడతారు.'

అదీ వారి చివరి హెచ్చరిక!

అప్పుడు సమయం సరిగ్గా అయిదుగంటలు.

## 5

విమానంలోని ప్రయాణీకుల పరిస్థితి మరింత అధ్వాన్నంగా వుంది.

టెన్షన్ వలన పట్టిన చెమట, ధారగా కారసాగింది. ఎయిర్ కండిషనర్లు పనిచేస్తున్నా ఒకటే వుక్కగా వుంది వారికి.

కాస్త కదలాలంటే భయం. బిగుసుకొని కూర్చోవడం వలన వారి వెన్నుముకలు లాగేస్తున్నాయి. ఈ మధ్యలో ఒకరిద్దరు పిల్లలు ఏడుపులు మొదలు పెట్టారు.

మామూలుగా అయితే .... ఈ పాటికి, ఎయిర్ హోస్టెస్ టీ, బిస్కట్లను సర్వ్ చేసేది. ఎంచక్కా చాక్ లెట్లో, పేపరోస్ యిచ్చేది.

ప్రయాణీకుల్లో మూడువంతుల మందికి పైగా 'ఒక కప్పు టీ యైనా' త్రాగాలని వుంది. కాని ధైర్యంచేసి అడిగేదెవరు?

లేచి, నిలబడి, అడిగేలోగానే కాల్చి పారేస్తారేమో

నన్న భయం.

అందరి గుండెలూ భయంతో వణికిపోతున్నాయి.

ప్రయాణీకుల దుస్థితిని గమనించిన మొదటి వ్యక్తి ఎయిర్ హోస్టెస్ రంజిత.

"భాయిరో!" అంది ఆమె మెల్లగా ఆ హైజాకర్లను సంబోధిస్తూ.

ఆ మిత్రంక చిరాకుగా చూశారు వారు.

"ఐయామ్ రంజితా. నేనూ పంజాబీ అమ్మాయినే" అంది ఆమె చిన్నగా నవ్వడానికి ప్రయత్నిస్తూ.

"అయితే ఏం?" అన్నట్లు చూశారు వారు.

అయితే వారి చూపుల్లో ఇంతకు క్రితం వున్న చిరాకు లేదు. కాస్త ప్రసన్నంగా వున్నాయి వారి చూపులు.

"మీరు అనుమతిస్తే మీకు తలా ఒక కప్పు టీ కలుపుకు రానా, అలాగే పాపం ఈ ప్రయాణీకులకు కూడా"

ఎంతో నమ్రతతో అంది ఆమె.

వారు ఒక్క క్షణం సంశయంగా చూశారు.

'నిజమే! వారికీ ఒక కప్పు టీ త్రాగాలనే ఉంది.' వారు ఒకరినొకరు చూసుకుని తలలు పంకించుకున్నారు.

"సరే! ముందుగా నాలుగుకప్పుల టీ తీసుకొని రా! బట్ బేబీ! ఒక్క విషయం గుర్తుంచుకో....

ఏమయినా చీప్ ట్రిక్స్ మామీద ప్రయోగించాలని చూస్తే మాత్రం....ప్రాణాలు పోతాయి జాగ్రత్త!" అన్నాడు ఆ ముగ్గురిలో ఒకడు.

రంజిత మౌనంగా ముందుకు నడిచింది.

అయిదు నిముషాల తరువాత....

పొగలు క్రక్కుతున్న టీని నాలుగు కప్పులలో పోసి,

ట్రేలో పెట్టుకొని వచ్చింది రంజిత.

అత్రంగా కప్పులను అందుకోబోతున్న తన ఇద్దరు సహచరులనూ, ఆగమని వారించాడు వారిని లీడ్ చేస్తున్న మూడవ యువకుడు.

ఒక సాసర్ను తీసుకొని, అందులో నాలుగు కప్పుల లోని టీని కొంచెం, కొంచెంగా పోసాడు. అప్పుడు ఆ సాసర్ను రంజితకు అందించాడు.

"కమాన్ బేబీ! సిప్ ఇట్!

ఇందులో విషమో. మత్తుమందో కలిపి వున్నట్లయితే ఆ రిస్క్ ఏదో నీవు తీసుకుందువుగాని." అన్నాడతడు క్రూరంగా నవ్వుతూ.

రంజిత ఆ సాసర్ను అందుకుని, నిర్భయంగా అందు లోని టీని త్రాగింది. ఆమె ముఖంలో కలవరంగాని, భయంగాని మచ్చుకైనా కన్పించలేదు వారికి.

కడిగిన ముత్యంలా స్వచ్ఛంగా, నిర్మలంగా వుంది ఆమె ముఖం.

అప్పుడు.... వారు నిస్సంకోచంగా ఆ కప్పులలోని టీని త్రాగారు.

ఆ ముగ్గురు హైజాకర్లతోపాటు వాళ్ళ కప్పును తీసుకు న్నది జోగిందర్ సింగ్.

రివాల్వర్ పట్టుకున్న ఆ ముగ్గురు హైజాకర్లకన్నా, ఆ విమానంలోని ప్రయాణీకులను ఎక్కువగా భయకంపితు లను చేస్తున్నది జోగిందర్ సింగ్,

అత్యంత క్రూరంగా వున్నాయి అతడి చూపులు. రక్తం త్రాగే రాబందులా వున్నాడతడు.

హైజాకర్లతో ఏదో నవ్వుతూ మాట్లాడుతున్నా

డతడు. అది నవ్వులా లేదు. పిశాచం పళ్ళికిలించినట్లు వుంది. అతడివంక చూడలేక కొందరు ప్రయాణీకులు భయంతో కళ్ళు మూసుకున్నారు.

హైజాకర్ల అనుమతితో.... ప్రయాణీకులకు టీని సర్వ్ చేయటం ప్రారంభించింది రంజిత.

అలసట కనిపించని ముఖంతో, చెరగని చిరునగవుతో ఆమె అలా నిర్విరామంగా తిరుగుతూనే వుంది.

అయితే, కప్పులలో టీని పోసుకొని వచ్చే కాస్త వ్యవధిలోనూ ఆమె... టీరూమ్ వున్న కిటికీలో నుండి ఎయిర్ పోర్ట్ అధికారులకు సంజ్ఞల ద్వారా ఒక మెసేజ్ ను పాస్ చేసిందన్న విషయం.... హైజాకర్లు గమనించలేదు.

ఆ మెసేజ్ సాయంతో.... అధికారులు ఒక అద్భుతమైన వ్యూహం పన్నగలిగారు.

అప్పుడు సమయం ఆరుగంటలు.

# 6

కొన్నిగంటల క్రితం.... సి.బి.ఐ. ఆఫీసులో....

“ఆఫీసర్స్!

హైజాకర్స్ యొక్క డిమాండ్లను బట్టి, వారు ఎంచుకున్న ఎయిర్ రూట్ ను బట్టి వారు ఖలిస్తాన్ వేర్పాటువాదులన్న విషయం స్పష్టమౌతూంది.

వారు ఎయిర్ లైన్స్ కు సంబంధించిన దానిలా కనిపించే సుజుకి వ్యానులో వచ్చారు. విమానాశ్రయ భద్రతా సిబ్బంది ధరించే దుస్తులనూ, బాడ్జీలను ధరించారు.

ఇవన్నీ వారికెలా వచ్చాయి?

ఎయిర్ లైన్స్ కు సంబంధించిన వారెవరో ఆ టెర్రరిస్టులకు సహాయం చేసివుండాలి.

అతదెవరో ఆఫీసరు రాంకు వారై వుండాలి. ఎందుకంటే. సామాన్యులకు ఇన్ని చేయటం సాధ్యంకాదు.

సో! పాలం విమానాశ్రయానికి సంబంధించిన ఎయిర్ లైన్స్ ఆఫీసర్ల లిస్టును తీసుకోండి. వారిలో శిక్కులను పైకి తీయండి.

వారు గత కొద్దికాలంగా, తరచుగా గాని, అప్పుడప్పుడుగాని పంజాబులోని తమ స్వగ్రామాలకు వెళ్లారా అన్నది పరిశోధించి ఒక రిపోర్టు తయారుచేయండి.

ఈ గాలింపు పూర్తయితే....

తెర వెనుకనుండి ఈ హైజాకర్స్‌కు సాయంచేసిన ఆ కల్ప్రిట్ ఎవడో చిక్కుతాడు మనకు.

దూ క్విక్!”

యిక చెప్పాల్సినదేమీ లేనట్లు రిలాక్సింగ్ గా వెనక్కు వ్రాలాడు సి.బి.ఐ. చీఫ్ కరుణాకర్.

అతని వద్ద శెలవు తీసుకుని ఆ గది బయటకు నడిచారు ఆ సి.బి.ఐ. ఆఫీసర్లు.

పాలం విమానాశ్రయంలో విమానం హైజాక్ చేయబడిందని తెలిసిన వెంటనే విమానాశ్రయ అధికారులు ఆ విషయాన్ని హోం డిపార్ట్‌మెంట్‌కు తెలియజేశారు.

హోం డిపార్ట్‌మెంట్ ఆజ్ఞపై సి.బి.ఐ. రంగంలోనికి దిగింది.

మొదట....సి.బి.ఐ. ను రెండు వింగ్‌లుగా విభజించాడు సి.బి.ఐ. చీఫ్ కరుణాకర్.

ఒక వింగ్ రెస్క్యూ ఆపరేషన్ కోసం ఎయిర్‌పోర్ట్‌కు పంపబడింది.

ఇంకొక వింగ్ .... ఈ హైజాకింగ్ వెనుకనున్న

అదృశ్య హస్తాలను అన్వేషించడానికి బయలుదేరింది.

ఇక్కడ ఇలా అన్వేషణ జరుగుతూండగా....

అక్కడ....

పాలం విమానాశ్రయంలోని ఒక ఛాంబర్ లో.

ఎదురుగా ఎటెన్షన్ లో నిలబడ్డ కమెండోల వంక చూసి మెల్లగా చెప్పడం ప్రారంభించాడొక సి.బి.ఐ. సీనియర్ ఆఫీసర్.

"నేను చెప్పబోయేది జాగ్రత్తగా వినండి.

హైజాక్ చేయబడ్డ విమానంలోనున్న ఎయిర్ హోస్టెస్ రంజిత దగ్గరనుండి ఇప్పుడే మనకొక కోడ్ మెసేజ్ వచ్చింది.

ఆమె సూచన ప్రకారం ఒక పథకం వేయబడింది. లుక్ ఎట్ ఒన్స్. ఒక్కసారి ఈ బ్లాక్ బోర్డువంక చూడండి."

కమెండోలు గోడకు వ్రేలాడదీయబడ్డ బ్లాక్ బోర్డు షీట్ వైపు చూసారు. దానిపై ఒక విమానం బొమ్మ గీయబడి వుంది.

"రన్ వే మీదనున్న ఈ విమానాన్ని ఒక్కసారి పరిశీలనగా చూడండి. తోక భాగం ఎయిర్ పోర్టువైపు, తల భాగం అవుట్ వే వైపు వున్నాయి.

అవుట్ వేలో....విమానం కొంతసేపు రన్ వే మీద పరుగెత్తి ఆ తరువాత గాలిలోకి యెగరటం ప్రారంభిస్తుందన్నమాట.

అక్కడ రన్ వేకు ఇరువైపులా పచ్చగా మోకాళ్ళ ఎత్తున ఎదిగిన గడ్డిగుబ్బులున్నాయి. వాటి మధ్య మనుషులు ప్రాకుతుంటూ వచ్చినా యెవరూ గమనించలేరు.

మీరంతా కారుల్లో యెక్కి, ఎయిర్ పోర్టు బయటకు

వెళ్ళిపోతారు. చుట్టూ తిరిగి అవుట్ వే గుండా, గడ్డి దుబ్బుల మధ్యనుండి ప్రాకుతుంటూ విమానాన్ని సమీపిస్తారు.

ఇప్పుడు సమయం ఆరుగంటలు దాటింది. అప్పుడే మసకచీకట్లు క్రమ్ముకుంటున్నాయి. రన్ వే ప్రక్క లాండింగ్ ప్లేస్‌లోనూ లైట్లు వెలిగించబడవు.

అవుట్ ఫీల్డు అంతా చీకటిగా వుంటుంది. కేవలం ఎయిర్‌పోర్టు బిల్డింగ్‌లో మాత్రమే లైట్లు వెలుగుతూ వుంటాయి.

అంటే.... చీకటి మీకు సహాకరిస్తుందన్న మాట. విమానాన్ని సమీపించేటంత వరకూ మీరు నేలమీద ప్రాకుతుంటూనే పోవాలి. మీ బూట్లను విడిచిపెట్టండి. లేకుంటే శబ్దం చేస్తాయి.

ఇక, విమానం క్రింది భాగానికి చేరుకున్నాక మీరు రెండు జట్లుగా విడిపోతారు.

ఒక జట్టు కాక్‌పిట్ క్రింద భాగం దగ్గరకు చేరుకుంటారు. అక్కడ మన పైలట్స్ పారిపోయి వచ్చిన రహస్యద్వారం వుంటుంది. అయితే భూమికి 36 అడుగుల ఎత్తులో వుంటుంది.

ఏ ఆధారమూ లేకుండా, నున్నగా వుండే ప్లేన్ బాడీ షీట్ మీద ప్రాకుతుంటూ మీరెలా పైకి వెళ్తారు?"

చెప్పడం ఆపి ఒక్క క్షణం ఊపిరి పీల్చుకున్నాడు ఆ ఆఫీసర్. ఆ కమెండోల వంక సాలోచనగా చూశాడు. తరువాత ప్రక్కనున్న పెద్ద కార్డ్‌బోర్డు బాక్స్ నుండి కొన్ని వస్తువులను పైకితీశాడు.

అవి అన్నీ ఒకేలా వున్నాయి. పది అంగుళాల పొడవున్న అల్యూమినియం గొట్టాలవి. పది మిల్లీమీటర్ల

వ్యాసార్థం వుంటుంది వాటి భూతలం. వాటికి రెండు వైపులా రెండు రబ్బరు కప్పెలు అతికింపబడి వున్నాయి. వాటిని కమెండోలకు చూపించాడతను.

"ఇవి రబ్బరు వాక్యూమ్ స్టిక్స్. వీటిని ప్లేన్ బాడీకి ఆన్చి వుంచండి. అల్యూమినా స్టిక్కు వున్న ఈ చిన్ని బుడిపెను నొక్కండి. అప్పుడు ప్లేన్ బాడీకి, రబ్బరు కప్పెకూ మధ్యనున్న గాలి పైకి వచ్చేస్తుంది. దానితో రబ్బరు కప్పెలు ప్లేన్ బాడీకి గట్టిగా అతుక్కుపోతాయి రెండు కప్పెల మధ్యనున్న అల్యూమినా స్టిక్ నిచ్చెన మెట్టులా ఉపయోగపడుతుంది.

ప్లేన్ బాడీకి రెండు వరుసలలో, అరవై డిగ్రీల వాలుతో ఈ స్టిక్స్‌ను అతికించండి. వాటి సాయంతో మీరు సులువుగా, ఐ మీన్ మెట్లమీద నడిచినంత సులువుగా ప్లేన్ మీదకు చేరుకోవచ్చు.

అయితే మీకో సందేహం రావచ్చు. ఈ వాక్యూమ్ రబ్బరు కప్పెలు మీ బరువును భరించగలవా? అని.

వాయు శూన్యతలం గురించి సైన్స్‌లో ఒక అద్భుత రహస్యం వ్రాయబడింది.

అర్ధగోళాకారంలోనున్న రెండు గిన్నెలను ఒకదానితో వొకటి కలిపి, ఆ రెండింటి మధ్యనున్న గాలిని తీసివేయగలిగినట్టయితే....

అతుక్కుపోయిన ఆ గిన్నెలను ఇరువైపులా బలిష్టమైన ఆరు గుర్రాలకు తాళ్ళతో కట్టి. వ్యతిరేక దిశలో లాగించినా, ఆ గిన్నెలు విడిపోవు.

వాయుశూన్య ప్రదేశానికి వున్న పట్టు అలాంటిది. ఆ ఫార్ములాలో చేయబడ్డ రబ్బరు కప్పెలివి. ఒకసారి అతుక్కున్నాక వీడిపోతాయేమోనన్న సమస్యే లేదు.

ఒక్కొక్కరు పదేసి స్టిక్స్‌ను తీసుకోండి."

కమెండోలు వరుసలో వచ్చి ఆ స్టిక్స్‌ను తీసుకొన్నారు. ఆ ఆఫీసర్ వారి వంక చూసి మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు.

"అయితే మన పైలట్లు దూకి వచ్చిన కాక్‌పిట్ క్రిందనున్న రహస్య మార్గాన్ని ఈ పాటికి హైజాకర్లు క్లోజ్ చేసి ఉండవచ్చు.

అప్పుడు మీరు అక్కడే మాటువేసి వుండాలి. వెరీ ఛాన్స్, ఒకవేళ ఆ ద్వారం మూయబడకుండా వుంటే, దానిగుండా మీరు విమానంలోనికి ప్రవేశించాలి.

ఇదంతా మొదటి బ్యాచ్ చేయాల్సిన పని.

ఇక రెండవ బ్యాచ్.

విమానం ఎడమ రెక్క క్రిందకు వెళ్ళండి. ఆ రెక్కపై భూమికి 14 అడుగుల ఎత్తున ఒక తలుపు వుంటుంది. ఆ తలుపువరకూ వస్త్రెలతో నిచ్చెనలు అమర్చుకొని పైకి ప్రాకుకొని పొండి. సరిగ్గా తలుపుదగ్గరే పొంచివుండండి. వెయిట్ దేర్ పేషెంట్లీ.

వీలు చూసుకొని ఎయిర్ హోస్టెస్ రంజిత ఆ తలుపును తెరుస్తుంది.

మరుక్షణం....మీరు మెరపుతీగల్లా లోపలకు చొరబడాలి. ఆ హైజాకర్స్ తేరుకొనే లోగానే వారిపై ఎటాక్ చేయండి. వీలుంటే వారిని ప్రాణాలతో బంధించండి.

లేకుంటే... షూట్ దెమ్ అవుట్!"

ఒక్క క్షణంసేపు ఆ గదిలో నిశ్శబ్దం రాజ్యమేలింది. గాలికూడా స్తంభించినట్లుయింది.

మనిషి మృగంగా మారినప్పుడు, మానవత్వం మరచి

పాటి మనిషి ప్రాణాలను తీయడానికి సిద్ధపడినప్పుడు... మృగంలాంటి ఆ మనిషిని వేటాడి చంపాలి.

చంపి తీరాలి!

కాలం మారినా, మనుషులు మారినా, నీతి సూత్రాలు మారినా. ధర్మ శాస్త్రాలు మారినా....

ఈ సిద్ధాంతం మాత్రం మారదు.

## 7

తన అపార్ట్‌మెంట్‌లో బెడ్ మీద ముసుగు తీసుకొని పడుకొని ఉన్నాడు కర్ తార్ సింగ్.

ఏదో తెలియని భయంతో అతని గుండెలు వణికిపోతున్నాయి. ఫుల్ స్పీడ్‌తో ఫాన్ తిరుగుతున్నా అతడి శరీరం, చెమటలు పడుతూంది.

గోడ గడియారం వంక చూశాడతను.

ఆరూ నలభై అయిదు.

'ఈపాటికి ప్లేన్ హైజాక్ చేయబడి వుంటుందా? అన్నీ సవ్యంగానే జరిగి, విమానం టెర్రరిస్టుల చేతిలోనికి వస్తే, ఈపాటికి ప్లేన్ పాలం విమానాశ్రయాన్ని వదలి పెట్టి ఉండాలి.

ఏం జరిగింది? ప్లేన్ వెళ్ళిపోయిందా?'

అతడి మెదడులో అనంతమైన ప్రశ్నలు.

'ఏం జరిగిందో తెలుసుకుందామంటే....' ఎవరయినా అనుమానిస్తారేమోనన్న భయం.

పైకి రావాలంటే భయం!

ఎవరినైనా పలకరించాలంటే భయం!

ఆ టెన్షన్‌ను భరించలేకే అతడు శెలవు పెట్టి, గదిలో పడుకున్నాడు.

ఆ రోజు...

మతం నుండి వెలి వేస్తారన్న భయంతో, తమ మతాధికారి మాటలకు ఎదురుచెప్పలేక, హైజాకర్స్‌కు సహకరించడానికి అంగీకరించాడు.

వారికి సహకరించాడు.

కాని, నిజం బయటపడితే ...తాను కల్ప్రిట్‌నన్న విషయం తెలిసిపోతే యేమౌతుందన్న భయంపట్టుకుంది ఇప్పుడు.

ఉద్యోగం పోతుంది.

పదిమందిలో పరువుపోతుంది.

నలుగురూ ఛీ కొడతారు. దేశద్రోహి అని అసహ్యించుకుంటారు.

తను జైలు పాలవుతాడు.

ఎందుకు? ఎందుకు చేసాడిదంతా?

అతని మనసులో సంఘర్షణ మొదలయింది.

హాయిగా, దర్జాగా, పదిమంది మన్ననలు పొందే ఆఫీసరు స్థాయినుండి ఒక ఖైదీ స్థాయికి ఒక్కసారిగా దిగజారిపోవడమంటే...అతడికి ఆ నిజం జీర్ణంకావటం లేదు.

ఎత్తయిన జైలు గోడల మధ్య, చారల జైలు లాగు, బనీను ధరించి, జొన్న సంకటిని తినే ఖైదీ స్థానంలో తనను తాను ఊహించుకోలేక పోతున్నాడతను.

'ఎందుకు? ఎవరి కోసం చేసాడిదంతా?!' తనను తానే ప్రశ్నించుకున్నాడతడు డెస్పరేట్‌గా.

“నీ జాతికోసం....నీ మతంకోసం....నీవీ పని చేయక తప్పదు కర్ తార్ సింగ్!”

సంత్ దలీప్ సింగ్ మాటలు గుర్తుకు వచ్చాయి

అతడికి. 'అవును మతంకోసం తానీ పని చేశాడు'.

ఎప్పుడో యూనివర్శిటీ గోడలమధ్య వ్రాయబడ్డ మాటలు అతడి కళ్ళముందు కదలాడాయి.

"మతం ఒక మత్తు మందు,
కులం ఒక వెంట తుప్ప!"

నిజమే.... హెరాయిన్ కన్న, నల్లమందుకన్న, ఎల్. ఎస్. డి కన్నా, బ్రౌన్ష్కన్నా ప్రమాదకరమైన మత్తు మందు.... మతం!

'ఆ మతం మత్తులో.... ఆ మత్తునుండి వచ్చిన ఉన్మాదంలో.... తనేం చేస్తున్నాడో తనకే తెలియని స్థితిలో తన జీవితాన్ని తనే సర్వ నాశనం చేసుకున్నాడు.'

అతడిలో క్షీరసాగర మధనం మొదలయ్యింది. ఆలోచనల సుడిలో అతడు కొట్టుకుపోతున్నాడు.

అదే సమయంలో....

ఆ అపార్టమెంట్ ముందు ఆగిందొక జీపు. ఒక యువకుడు జీపు దిగి, చకచకా మెట్లెక్కి అతడి అపార్టమెంట్ను సమీపించాడు.

ఎంతో పరిచయమున్నవాడిలా... సూటిగా ఆ అపార్ట మెంట్ ముందుకు వచ్చి ఆగాడు.

కాలింగ్ బజర్ను నొక్కాడు.

కాలింగ్ బజర్ శబ్దానికి ఉలిక్కిపడ్డాడు కర్తార్ సింగ్. ఒక్క ఉదుటున మంచంమీదనుండి లేచాడు.

"ఎవరూ...?"

ఎంత నిగ్రహించుకున్నా అతడి గొంతు సన్నగా వణికింది. తడబడుతున్న అడుగులతో అతడు మెల్లగా తలుపు దగ్గరకు నడిచాడు.

'తన విషయం అప్పుడే పోలీసులకు తెలిసిపోయిందా?

తనను అరెస్టు చేయడానికి పోలీసులు వచ్చారా?'

భయంతో అతడి గొంతులో తడి ఆరిపోతూంది. వణుకుతున్న చేతులతో మెల్లగా తలుపులను తెరిచాడతడు.

ఎదురుగా ఉన్నది...ఎవరో అపరిచిత యువకుడు.

"అమ్మయ్య! పోలీసులు కాదు!" భారంగా నిశ్వసించాడు కర్తార్ సింగ్.

ఒక్క క్షణం తరువాత..

"ఎవరు మీరు?" ఆ యువకుని వంక చూస్తూ అడిగాడు కర్తార్ సింగ్.

ఆ యువకుడు సమాధానం చెప్పలేదు. మౌనంగా గదిలోనికి అడుగు పెట్టాడు. తలుపులను దగ్గరగా వేశాడు. కర్తార్ ఆ యువకుని వంక ఆశ్చర్యంగా చూశాడు. ఇదంతా ఒక్క అరనిమిషంలోనే జరిగిపోయింది.

"సంత్ దలీల్ సింగ్ పంపారు నన్ను" అన్నాడా యువకుడు నెమ్మదిగా.

దలీల్ సింగ్ పేరు విన్న వెంటనే కర్తార్ సింగ్ ముఖం నల్లగా మాడిపోయింది.

"ఎందుకు?" అన్నాడు హీనస్వరంతో.

"హైజాక్ కేసులో సి.బి.ఐ. రంగంలోనికి దిగింది కర్తార్ సింగ్!

ఈ హైజాక్‌కు సహాయపడిన ఎయిర్ లైన్స్ ఆఫీసర్ .... అంటే నీకోసం అన్వేషణ మొదలయింది. ఇక నీవు తప్పించుకోలేవు. జస్టు యూ కానిట్ ఎస్కేప్!

పోలీసులకు పట్టుబడతావు.

నీవు పట్టుబడితే.

నీద్వారా....కొన్ని తెలియకూడని స్థలాలూ, కొందరి

పేర్లూ సి.బి.ఐ కు తెలుస్తాయి."

"నో.... నేనెందుకు చె బు తా ను" డెస్పరేట్ గా అన్నాడు కర్ తార్ సింగ్.

"నీవు చెప్పవు కర్ తార్ సింగ్!

వారు నీతో చెప్పిస్తారు చిత్రహింసలు పెట్టి. ఈ ఆధునిక కాలంలో చేజిక్కిన శత్రువు నోటినుండి రహస్యాలను పైకి కక్కించడానికి ఎన్ని ఆధునిక పరికరాలు వచ్చాయో నీకు తెలియదు కర్ తార్ సింగ్.

ఎంత మొండివాడయినా, ఎంత ఆత్మ నిగ్రహం కలవాడయినా ఆ యంత్రాలముందు తలవంచక తప్పదు.

మా శిక్కు సోదరుడు అన్ని చిత్రహింసల పాలవటం మాకిష్టంలేదు. అందుకే...."

ఆ యువకుడు చెప్పటం ఆపాడు. అతడి కుడిచెయ్యి మెల్లగా పాములా పాంటుజేబులోకి ప్రాకుతుంది.

"అందుకే...." అనుమానంగా అడిగాడు కర్ తార్ సింగ్. ఏదో అనిశ్చిత భావం అతడిని కదలించి వేస్తూంది.

"మీరు చిత్రహింసల పాలవకముందే....

మీరు పోలీసుల ముందు పెదవి విప్పకముందే....

ఇప్పుడే....

మిమ్మల్ని చంపేస్తాను."

—నవ్వుతూ అన్నాడా యువకుడు.

"నో...." అంటూ గట్టిగా అరిచాడు కర్ తార్ సింగ్.

కాని, అప్పటికే ఆ యువకుని చేయి పాంట్ జేబులో నుండి పైకి వచ్చింది. అతడి పిడికిలిలోని చిన్న రివాల్వర్ ఆరుసార్లు గర్జించింది వరుసగా.

సైలెన్సర్ అమర్చబడటంవలన చిన్న శబ్దంకూడా వినిపించలేదు.

ఆరు గుళ్ళూ సూటిగా కర్తార్ సింగ్ గుండెల్లో దూసుకుపోయాయి. గొంతులోనుండి చావుకేక బయటకు రాకుండానే అతడి ప్రాణాలు అనంత విశ్వంలో కలిసి పోయాయి.

వచ్చినంత వేగంగానే, ఆ యువకుడు ఆ గదిలోనుండి అదృశ్యమయ్యాడు.

## 8

అసహనంగా వాచీ వంక చూశాడు ఒక హైజాకర్.

“ఆరూ....ఏభై.”

“ఇంకో గంటసేపు వెయిట్ చేయాలి” అనుకున్నాడతడు విసుగ్గా.

సుమారు రెండుగంటలసేపు అలా నిలబడి వుండటం వలన సన్నగా కాళ్ళు లాగుతున్నాయి వారికి.

‘కాని, తప్పదు. ఈ ప్లయిట్ ఇక్కడినుండి టేక్ ఆఫ్ తీసుకున్నంతవరకూ తమ కీ పాట్లు తప్పదని వారికి తెలుసు.

కార్యసిద్ధికి కావలసింది పట్టుదల, దీక్ష.

వారు తీవ్రవాదులే కావచ్చు. వారు చేస్తున్నది దేశ ద్రోహమే కావచ్చు. కాని. తమ మతంకోసం, తాము నమ్మిన సిద్ధాంతం కోసం వారు సహిస్తున్న శ్రమా, వారు చూపుతున్న సహనం....నిజంగా ఎన్నదగినవి.

ఒక ఆదర్శం కోసం వారు ప్రాణత్యాగానికి కూడా సిద్ధపడ్డారంటే వారెంత కార్యదీక్షాదక్షులో అర్థం అవుతూంది.

వారిని చూస్తుంటే రంజితకు చిన్నప్పుడు చదువుకున్న రవీంద్రనాథ్ టాగూర్ పద్యం గుర్తుకువచ్చింది.

“ఎక్కడ విజ్ఞాన నదము చెడు అలవాట్లనెడి ఎడారి

లోనికి ప్రవహింపవో ....

ఎక్కడ ఈ సమాజము జాతి, కుల, మత, వర్గ భావాలతో ముక్కలు కాదో....

ఆ స్వేచ్ఛా స్వర్గం వైపు....

నా దేశాన్ని నడిపించు భగవాన్ !"

నిజమే. మత విద్వేషమన్న విషబీజం వీరి హృదయాల్లో అంకురించకపోతే, జాగృతమైన ఈ యువశక్తి దేశం కోసం నడుం బిగిస్తే.... ఈ దేశం నిజంగా సస్యశ్యామల మౌతుంది. సుసంపన్న మౌతుంది.

రంజిత మనసులో ఏదో భావ సంచలనం!

నిస్త్రాణగా కుర్చీలో వ్రాలి ఉన్న ప్రయాణీకులలో కొందరు నిద్రపోవడానికి ప్రయత్నిస్తున్నారు. కొందరు భగవంతుని ప్రార్థిస్తున్నారు. మరికొందరు మొక్కులతో ముడుపులతో ఆ దేవుని ఆకట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నారు.

హైజాకర్లు సిగరెట్లు ముట్టించారు. వారితో పాటుగా జోగీందర్ సింగ్ కూడా.

రంజితలో కూడా టెన్షన్ పెరిగిపోతూంది.

అదే సమయంలో....విమానం క్రింద భాగానికి చేరుకున్నారు కమెండోలు.

పైలట్లు దూకివచ్చిన కాక్‌పిట్ లోని రహస్య ద్వారం మూసివుండటం గమనించారు వారు.

అక్కడ ఒక బ్యాచ్ వుండిపోయింది.

రెండవ బ్యాచ్ ఎడం రెక్క వైపు కదిలింది రబ్బరు చెప్పులతో నిచ్చెనలను అమర్చుకుంటూ పైకి ప్రాకసాగారు వారు.

తలుపు దగ్గర నిలబడివున్న రంజిత వైపే వస్తున్న

కమెండోలు అస్పష్టంగా కన్పిస్తున్నారు.

సుమారు ఎనిమిది అడుగులు పైకి వచ్చేసారు వారు.

'యింకొక్క ఆరడుగులు....అంతే!' అనుకుంది ఆమె.

అంతవరకూ ఎంతో నిబ్బరంగా వ్యవహరించిన ఆమెలో కూడా టెన్షన్ విపరీతంగా పెరిగిపోసాగింది. అరచేతులలో పడుతున్న చెమటను కుర్తాకు వ్రాసుకుంది ఆమె.

నెమ్మదిగా, క్యాజువల్ గా ... మరికొంచెం తలుపుకు దగ్గరగా జరిగింది ఆమె. ఆమె ఎడంచేయి మెల్లగా పైకి లేచింది. తలుపుకున్న నాబ్ వైపు మెల్లగా జరుగుతూంది.

కమెండోలు మరింత పైకి వచ్చారు.

సన్నని ఆమె చేతివ్రేళ్ళు డోర్ నాబ్‌ను తాకుతున్నాయి. ఆమె ఓరకంట హైజాకర్ల వంక చూసింది.

వారు జోగిందర్ సింగ్‌తో కబుర్లలో పడ్డారు.

'చాలు! ఆమాత్రం ఏమరుపాటు చాలు' అనుకుంది ఆమె.

అదే సమయంలో....

తలుపులూ, కిటికీలు మూసివేయటంవలన, తాము త్రాగుతున్న సిగరెట్ల పొగ అక్కడే వుండిపోవడాన్ని గమనించాడొక హైజాకర్.

అప్పటికే సిగరెట్ పొగ పడని ఒకరిద్దరు ప్యాసెంజర్లు దగ్గడం ప్రారంభించారు కూడానూ.

అతడు కొద్దిగా ప్రక్కనున్న సీటుమీద నుండి వంగి కిటికీని కొద్దిగా తెరిచాడు.

అతనివంకే ఊపిరి బిగపట్టి చూస్తూంది రంజిత. కిటికీ రెక్కగుండా అతడు కాస్త పైకి చూసి వుంటే పైకి ప్రాకుతున్న కమెండోలు అతడికి కనిపించి వుండేవారు.

"అమ్మయ్య! ఒక గండం గడిచింది" అనుకుంది రంజిత దీర్ఘంగా నిట్టూర్పు విడుస్తూ.

రంజిత అంత బరువుగా నిశ్వసించడం వారికి కొద్దిగా ఆశ్చర్యాన్ని కలిగించింది.

కాని, సిగరెట్ పొగ పడక. ఆమె అంతవరకూ ఊపిరి బిగపట్టింది కాబోలు ననుకున్నారు వారు.

ఇంకొక్క నిముషంలో కమెండోలు తలుపును సమీపిస్తారు. రంజిత క్షణాలను లెక్కిస్తూంది.

కాని.... ఇంతలో....

"అయ్యో! వారు ఎలా ప్రాకుకుంటూ వస్తున్నారో" అన్న చిన్నిపాప కంఠం....

ఆ విమానంలో బాంబులా ప్రేలింది.

సాధారణంగా ...బస్సులలో గాని, రైళ్ళలో గాని, విమానాలలో గాని ప్రయాణాలు చేసేటప్పుడు కిటికీల గుండా పైకి చూడటం పిల్లలకు సరదా.

కిటికీ ప్రక్కనే కూర్చున్నా. అంతవరకూ కిటికీ బంధింపబడి వుండటంతో ఎనిమిదేళ్ళ తనూజకు చెప్పలేనంత చిరాకుగా వుండేది.

కిటికీ రెక్క తెరిచిన వెంటనే ఆత్రంగా క్రిందకు చూసింది ఆ చిన్నారిపాప.

మరబొమ్మల్లా పైకి ప్రాకుకుంటూ వస్తున్న కమెండోలు కనిపించారు ఆ పాపకు.

అంతే....!

"అయ్యో! వారు ఎలా ప్రాకుకుంటూ వస్తున్నారో" అంది గట్టిగా.

చిన్నారి తనూజ కంఠం విన్న వెంటనే మెరుపుతీగల్లా రిఫ్లెక్ట్ అయ్యారు ఆ హైజాకర్లు ముగ్గురూ.

ఒకడు ఒక్క అంగలో తలుపును సమీపించి, తలుపు దగ్గరున్న రంజిత్‌ను విసురుగా వెనక్కు లాగాడు. మరొకడు చటుక్కున కిటికీ తలుపులను మూసేసాడు. తలుపులను మూస్తూ ఒక్కసారి క్రిందకు చూశాడు.

ప్రాకుతుంటూ పైకెక్కుతున్న కమెండోలు కనిపించారతడికి. అతడు గిరుక్కున తనవారి వంక తిరిగాడు.

“కమెండోలు....” అన్నాడతడు.

మూడవ వ్యక్తి....జోగిందర్ సింగ్‌ను తీసుకొని కాక్‌పిట్‌లోనికి పరుగెత్తాడు.

ఎయిర్‌పోర్ట్‌లోని కంట్రోల్ రూమ్‌ను కంటాక్ట్ చేశాడు జోగిందర్ సింగ్.

లైన్ కనెక్ట్ చేయబడ్డాక మైకును తన చేతిలోనికి తీసుకొన్నాడు హైజాకర్.

“ఆఫీసర్స్! కాల్ ద కమెండోస్ బ్యాక్....ఇమ్మీడియట్లీ! ఇఫ్ నాట్ వుయ్ విల్ బ్లాస్టు ద ప్లేన్!”—పిచ్చెక్కినట్లు గట్టిగా అర్చాడతడు.

ఎయిర్‌పోర్ట్‌లలోని అన్ని స్టీరియోలలో ఒకేసారి అతడి గొంతు మార్మోగింది....

....ప్రళయ గర్జనలా!

“ఆఫీసర్స్! నేను చెబుతున్నది వినిపిస్తుందా? కమెండోలను వెనక్కు పిలవండి.

నేను కేవలం పది అంకెలు లెఖ్ఖపెడతాను. ఓన్లీ టెన్ నంబర్స్, ఆలోగా కమెండోలు వెనక్కు వెళ్ళిపోవాలి. లేకుంటే.... ఈ విమానం ముక్కలయిపోతోంది. వుయ్ బ్లాస్టు ఇట్! వందల మంది ప్రయాణీకుల శరీరాలు ముక్కలై ఆకాశంలోకి ఎగిరిపోతాయి. మంటల్లో మాడి,

మసైపోతాయి.

"నేను అంకెలను లెఖ్ఖపెట్టడం ప్రారంభిస్తున్నాను.

ఒకటి.... రెండు... మూడు.... నాలుగు...."

అతడు లెక్కిస్తున్న ఒక్కొక్క అంకె సమ్మెట పోటులా .. అధికారుల కర్ణపుటాలకు తాకుతుంది.

ఆలోచించడానికి కూడా వారికి వ్యవధిలేదు.

ఏదో ఒక నిర్ణయం తీసుకోవాలి.

ఏమిటి చేయాలి?

391 మంది ప్రయాణీకుల ప్రాణాలతో ఎవరూ జూదం ఆడలేరు.

ఒక నిశ్చయానికి వచ్చినట్లు. సి బి ఐ. సీనియర్ ఆఫీసర్ ముందుకు కదిలాడు. లౌడ్ స్పీకర్‌ను చేతిలోనికి తీసుకున్నాడు.

"కమెండోస్! రిటర్న్ బ్యాక్ ఇమ్మీడియట్లీ. తక్షణం వెనక్కు వచ్చేయండి."

మైకులో అతడి గొంతు కంచులా మ్రోగింది.

రెక్కవైపున్న తలుపును సమీపించబోతున్న కమెండోలు ఆ ఎనౌన్స్‌మెంట్‌ను ఆలకించి టక్కున ఆగిపోయారు.

చివరి క్షణంలో ఈ విచిత్రమైన నిర్ణయాన్ని తమ అధికార్లు ఎందుకు తీసుకున్నారో వారికి అర్థం కాలేదు.

ఏది ఏమయినా....

ఏన్ ఆర్డర్ ఈజ్ ఏన్ ఆర్డర్!

అధికారుల ఆజ్ఞ ఉల్లంఘనీయం కాదు కదా! కమెండోలు మౌనంగా వెనుతిరిగారు.

ఎయిర్ పోర్టు వంక మరలిపోతున్న కమెండోల వంక సంతృప్తిగా చూశారు హైజాకర్లు.

కొండంత బరువు గుండెల మీదనుండి దిగినట్లు ఎంతో రిలీఫ్‌గా వుంది వారికి.

రంజిత్‌కు నాలుగు కప్పుల టీ తెమ్మని చెప్పాడొకడు ఉల్లాసంగా.

కాక్‌పిట్‌లో....వైర్‌లెస్ సెట్ దగ్గరున్న మూడవ హైజాకర్ ....

'ఇంకొకసారి ఇలాంటి పిచ్చిప్రయత్నం చేస్తే....దాని ఫలితం చాలా తీవ్రంగా వుంటుందని' ఎయిర్‌పోర్టు అధికారులను హెచ్చరించి మరీ విమానంలోనికి వచ్చాడు.

విమానంలోని ప్యాసెంజర్లకు ఏం జరిగిందో అర్థం కాలేదు. ఏదో అసాధారణమైన సంఘటన సంభవించిందని తెలుస్తూంది. కాని, అదేమిటన్నదే ఎవరికీ తెలియటం లేదు.

వారు ఉత్కంఠతో ఎదురుచూస్తున్నారు.

ఇక్కడ....ఎయిర్‌పోర్టులో.

అద్భుతమైన తమ ప్లాన్ అలా ఘోరంగా విఫలం కావటంతో....అధికార్లకు పిచ్చెక్కినట్లుంది.

కాలుకాలిన పిల్లుల్లా తిరుగుతున్నారు వారు.

ఏం చేయాలి?

హైజాకర్ల గొంతెమ్మకోర్కెలను తీర్చడమేనా? మరో మార్గమే లేదా?"

టెన్షన్‌తో వారి మెదడులోని నరాలు బ్రద్దలయిపోతాయా అన్నట్లుంది వారి స్థితి.

ఎవరూ, ఏమీ మాట్లాడ్డం లేదు. అంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు.

నిశ్శబ్దం!....తుఫాన్ ముందు ఏర్పడే ప్రశాంతతలాంటి నిశ్శబ్దం!

ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ గోడగడియారం టంగ్ మని ఒక గంట కొట్టింది.

అంతా ఉలిక్కిపడి దానివంక చూశారు.

"ఏడూ....ముప్పయి!"

అంతే!

వారి ముఖాలు తెల్లగా పాలిపోయాయి. అరచేతులకు పట్టిన చెమటను అప్రయత్నంగా తమ ట్రౌజర్స్‌కు రుద్దుకున్నారు వారు.

"యింకో ముప్పయి నిముషాలు!" అన్నాడొక అధికారి అసహనంగా.

"య్యాస్....యింకో ముప్పయి నిముషాలలో వారు పెట్టిన గడువు తీరిపోతుంది.

వుయ్ హావ్ నో కార్డ్స్ టు ప్లే!

తప్పదు. తప్పదేమో!

వారి కోర్కెలను అంగీకరించక తప్పదేమో!" బాధగా నిట్టూరుస్తూ అన్నాడు సి.బి.ఐ. అధికారి.

# 9

"ఇంత బృహత్తర పథకమూ వృధా అయిపోయింది.

మరో అవకాశమే లేదా!

ఈ హైజాకర్ల బారినుండి తప్పించుకొనే మార్గమే లేదా?" రంజిత ఆలోచిస్తున్నది.

"భగవాన్!

కష్టాల్లో వున్నప్పుడే మనిషి నిన్ను తలుస్తాడంటారు. తన స్వార్థం కోసమే నిన్ను కొలుస్తాడంటారు.

అది....నాపట్ల ఎంత నిజమో నాకే తెలియదు. కాని ఉన్నావో, లేవో తెలియని ఓ భగవంతుడా!

ఈ క్షణం నిన్ను చేతులు జోడించి అర్థిస్తున్నాను.

సాహ ఒక్క అవకాశాన్ని కల్పించు.

ఈ బలహీనమైన చేతుల కరవ్వంత శక్తిని ప్రసాదించు తండ్రీ!

అమాయకులైన ఈ ప్రయాణీకుల ప్రాణాలను రక్షించ డంలో....నా ప్రాణాలు బలైపోయినా పర్వాలేదు. కాని, ఆ రాక్షసుల బారినుండి మాత్రం వీరిని రక్షించు"

పెదవులు విడకున్నా, కన్నులు అర మోడ్చకున్నా, కనుపించని ఆ దేవుని మనసులోనే ధ్యానించింది ఆమె.

ఇప్పుడామెలో ఏదో నూతనోత్సాహం. తనపై తనకే కొండంత విశ్వాసం!

ఇక్కడ... దేవుడున్నాడా? లేడా? అన్నది ప్రశ్న కాదు. ఆ చిన్న ప్రార్థన....ఆమెలో అనంతమైన ఆత్మ విశ్వాసాన్ని కల్గించిందంటే....అది నిజంగా గొప్ప విష యమే.

దీనినే ఆత్మశక్తి అన్నారు ఆధ్యాత్మికులు. దైవ కృప అంటారు భక్తులు. సెల్ఫ హిప్నాటిజం అంటారు ఆధు నికులు.

ఉన్నట్లుండి ఆ విమానంలోని లైట్లు చటుక్కున ఆరి పోయాయి. ఎయిర్ కండిషనర్లు ఆగిపోయాయి.

ఒక్క క్షణం తరువాత....

మళ్ళీ మామూలుగా లైట్లు వెలిగాయి. అయితే ఈ సారి ఎయిర్ కండిషనర్లు పనిచేయుడం మానేశాయి.

జరిగిందేమిటో ఎవరికీ అర్థంకాలేదు.

లైట్లు ఆరిపోయినప్పుడు మాత్రం హైజాకర్లు కంగారు పడ్డారు.

'కమెండోలు మళ్ళీ తిరిగి వచ్చారేమోనని' ఆందోళన

చెందారు వారు. కాని, ఆరిపోయినంత వేగంగానే తిరిగి లైట్లు మామూలుగా వెలగటంతో వారిలోని సంశయాలు పటాపంచలయిపోయాయి.

'ఏదో లూజ్ కాంటాక్టయి ఉంటుంది' అనుకున్నారు వారు. ఆగిపోయిన ఎయిర్ కండిషనర్ల గురించికూడా వారు పెద్దగా పట్టించుకోలేదు.

కాని.... జరిగిందేమిటో, లైట్లు ఎందుకలా ఆరి, మళ్ళీ వెలిగాయో, ఎయిర్ కండిషనర్లు ఎందుకు ఆగిపోయాయో.. గ్రహించినది ఒక్క రంజితే!

అఫ్ కోర్స్! ఎయిర్ లైన్స్‌లో పని చేసే వారు మాత్రమే జరిగిందేమిటో పోల్చగలరు.

బోయింగ్ విమానాల్లోని అమరిక ప్రకారం, విమానంలో ఉండే లూబ్రికేషన్ ఆయిల్ గనుక ప్రమాదకరంగా మరీ తక్కువ స్థాయికి చేరుకుంటే, దానికి అనుసంధింపబడి వుండే రెండు సెన్సార్లలో ఏదో ఒకటి టక్కున విమానంలోనికి విద్యుత్ సరఫరాలను ఆపేసి, సూచనను చేస్తూంది.

వెంటనే విమానంలోని లైట్లు ఆరిపోతాయి. ఎయిర్ కండిషనర్లు ఆగిపోతాయి.

అయితే, వెను వెంటనే, బ్యాటరీతో పనిచేసే ఎమర్జెన్సీ లైట్లు ఆటోమాటిక్‌గా వెలుగుతాయి.

రంజిత్‌కు తెలుసు___బ్యాటరీతో పని చేసే ఆ ఎమర్జెన్సీ లైట్లు ఎంతసేపో వుండవని, కొద్దిసేపట్లో ఆరిపోతాయని.

మామూలు పరిస్థితులలో అయితే, కాక్‌పిట్‌లో వుండే పైలట్ ఆ లైట్ల సూచనను గమనించేవాడు. లూబ్రికేషన్ ఆయిల్‌ను రీఫిల్ చేసి, విద్యుత్ సరఫరాను క్రమపరిచేవాడు.

కాని, ఇప్పుడు అవన్నీ చూసేందుకు విమానంలో పైలట్ లేడు. అదృష్టమో, దురదృష్టమో....అవి ఆ పని చేస్తున్నవి వీక్ బ్యాటరీలు. బ్యాటరీలలో పవర్ లేక పోవడంతో లైట్ల వెలుగు క్రమేపీ తగ్గిపోసాగింది.

ఒక్కొక్క క్షణం గడిచేకొద్దీ, లైట్లకాంతి పూర్తిగా పలుచబడసాగింది.

హైజాకర్లలో కంగారు మొదలయ్యింది.

'ఏమిటి?

ఏమిటి జరుగుతుంది?

లైట్లు ఎందుకిలా కాంతివిహీనాలయిపోతున్నాయి?' - వారికేమి పాలుపోలేదు.

వారు కలవరంగా చుట్టూ చూస్తున్నారు.

తమ తుదిశ్వాస విడుస్తున్నట్లుగా లైట్లు మిణుకు మిణుకు మంటున్నాయి.

అదే సమయంలో రంజిత వారిని సమీపించింది. ఆ హైజాకర్ల వంక చూసిందామె.

ఆ లైట్లు ఇంకొక్క క్షణంలో పూర్తిగా ఆరిపోతాయని ఆమెకు తెలుసు.

ఆమె వంక జోగీందర్ సింగ్ చూసాడు.

కళ్ళతోనే మాట్లాడుకున్నారు వారు.

పరిస్థితి తమ చేజారిపోతున్నదని గ్రహించారు హైజాకర్లు. అకస్మాత్తుగా ఉప్పెనలా ముంచెత్తుకు వచ్చిన చీకటి వారి ధైర్యాన్ని కొద్దిగా సడలించింది.

“ఎక్కడివారు అక్కడే కూర్చోండి. కదలిన సవ్వడి వినిపించినా, నిర్దాక్షిణ్యంగా కాల్చిపారేస్తాం” పిచ్చిగా అరిచాడొక హైజాకర్.

'ఇది కమెండోల పనే!' అనుకున్నారు వారు.

"కమెండోస్! లోపలకు రావడానికి సాహసించ కండి. మీరు మాపై ఎటాక్ ప్రారంభించిన మరుక్షణం.. ఈ విమానాన్ని పేల్చేస్తాం మేం" గట్టిగా అరిచాడు యింకొక హైజాకర్.

అంతలో....

ఎవరో ఉఫ్ అని ఊదేసినట్లు ఆ విమానంలోని లైట్ లన్నీ ఆరిపోయాయి.

చీకటి. కటిక చీకటి.

కళ్ళు చించుకున్నా, ఎవరికీ, ఏమీ కనిపించటంలేదు. ప్రయాణీకులు భయంతో హాహాకారాలు చేయడం ప్రారం భించారు.

ఏడ్పులు.... పెడబొబ్బలు.

భయం! బీభత్సం ఒక్కసారిగా స్వైరవిహారం చేశాయి ఆ విమానంలో.

అదే సమయంలో....

తన చేతిలోనున్న ట్రేలోని టీని....కప్పులతో సహా విసురుగా హైజాకర్ల ముఖాలపై విసిరింది రంజిత.

పొగలు క్రక్కుతున్న వేడి టీ ముఖాన్ని తాకేసరికి బాధగా అర్చారు వారు.

ఆ దేక్షణంలో ఇద్దరు హైజాకర్ల చేతులలోని రివాల్వ ర్లను ఎగురగొట్టాడు జోగిందర్ సింగ్. ఈలోగా, మూడవ హైజాకర్ పిచ్చివానిలా చీకట్లో కాల్పులు ప్రారంభిం చాడు.

అది బెరెట్టా రివాల్వర్ కావడంచేత చాలా వేగంగా కాల్పులు జరుపగల్గా డతడు.

వరుసగా మూడురౌండ్లు కాల్చాడతడు.

ఒక గుండు విమానం బాడీకి తగిలింది. ఇంకొక గుండు

ఎదురుగానున్న రంజిత భుజంలో నుండి దూసుకుపోయింది. మూడవకుండు ఒక ప్యాసెంజర్ చెవిని రాసుకుంటూ సీటును ఛిన్నాభిన్నం చేసింది.

ఒక నిప్పుకణంలా, తుపాకి గుండు భుజంలోనుండి దూసుకుపోగానే, కెవ్వుమని కేక వేస్తూ బోర్లా పడిపోయింది రంజిత.

ఆ పడటం సరిగ్గా కాల్పులు సాగిస్తున్న హైజాకర్ కాళ్ళదగ్గర పడింది ఆమె. యిక తాత్సారం చేయలేదు ఆమె. చటుక్కున అతడి పాదాలను పట్టుకొని బలంగా లాగిందామె.

అంతే! వెల్లకిలా పడిపోయాడతడు. అతడి చేతిలోని రివాల్వర్ దూరంగా తుళ్ళిపోయింది.

ఓ ప్రక్క....

జోగింధర్ సింగ్ మిగిలిన ఇద్దరు హైజాకర్లతో పెనుగులాడుతున్నాడు.

చీకటిలో ఎవరు, ఎవరిని కొడుతున్నారో, ఎక్కడ కొడుతున్నారో తెలియని పరిస్థితి.

ఓ హైజాకర్ నడుముకున్న బాకును తీశాడు. జోగింధర్ సింగ్ వట్టి చేతులతోనే పోరాడుతున్నాడు.

మోచేయి చీరుకుపోయింది. భుజంపై బలంగా దిగిందొక కత్తిపోటు. పొట్టదగ్గర చర్మం కోసుకుపోయింది. అతడి శరీరం రక్తసిక్తమౌతూంది.

అయినా .... అతడు మొండిగా పోరాడుతూనే వున్నాడు.

యిక్కడ....

క్రిందపడ్డ రంజిత మెల్లగా ప్రాకుతుంటూ తలుపును సమీపించింది. ఆమె చేయి డోర్ నాబ్‌పై పడింది.

అదే సమయంలో వెల్లకిలా పడ్డ మూడవ హైజాకర్ పైకి లేచాడు. తలుపును తెరవబోతున్న రంజిత మీదకు భల్లూకంలా పడ్డాడు. అతడి ఉక్కు కౌగిలిలో ఆమె నలిగిపోతూంది.

ఆమెకు ఊపిరి ఆడటంలేదు. ఒకప్రక్క విపరీతంగా బాధపెడుతున్న భుజం. అయినా ఎలాగో బాధను పళ్ళ మధ్య బిగపట్టి డోగ్ నాబ్ ను తిప్పింది.

డోర్ తెరుచుకుంది.

అయితే డోర్ ను అనుకొని పెనుగులాడుతున్న రంజిత, ఆ హైజాకరు, ఆ అదటుకు, విమానం రెక్కనుండి క్రిందకు రాలిపోయారు.

పద్నాల్గు అడుగుల ఎత్తునుండి క్రిందకు రాలడంతో రంజితకు స్పృహతప్పింది. హైజాకర్ కు నడుం విరిగి పోయింది.

రంజిత అదృష్టం....! ముందు హైజాకర్, అతడి మీద రంజిత పడటంతో ఆమెకు ప్రమాదకరమైన దెబ్బ లేమీ తగులలేదు.

మోచేతులు కొట్టుకుపోయాయి, షాక్ వలన స్పృహ తప్పింది అంతే!

కొన్ని నిముషాల క్రితం....

ఎప్పుడయితే విమానంలోని లైట్లు, ఆరి, మళ్ళీ వెలిగాయో, వెలిగిన లైట్లు క్రమేపీ కాంతివిహీనమౌతున్నాయో! అప్పుడే ఎయిర్ పోర్టులోని అధికారులు జరిగిందేమిటో గ్రహించారు.

కాసేపట్లో ఏర్పడబోతున్న చీకటిని సద్వినియోగం చేసుకోవాలనుకున్నారు.

కమెండోలు మళ్ళీ రంగంలోనికి దిగారు.

పిల్లుల్లా అడుగులు వేసుకుంటూ, విమానాన్ని చుట్టుముట్టారు వారు. కొందరు ఎడంరెక్క పైభాగానికి ఎక్కి తలుపుదగ్గర సిద్ధంగా మాటువేసుకొని కూర్చున్నారు.

ఎప్పుడయితే రంజిత తలుపును తెరిచిందో....మరుక్షణం మెరుపుతీగెల్లా వారు లోనికి ప్రవేశించారు. వారి చేతులలోని శక్తివంతమైన టార్చిలైట్ల కాంతి ఒక్కసారిగా విమానంలోనికి ప్రసరించింది.

ఆ కాంతి వెలుగులో....

జోగీందర్ సింగ్ ఒక హైజాకర్‌తో పెనుగులాడుతున్నాడు. రెండవవాడు బాకును ఎత్తి బలంగా అతడి వెన్నులో పొడవబోతున్నాడు.

మరుక్షణం....తన చేతిలోని టార్చిలైటును బలంగా, సూటిగా అతడి చేతికి గురిచూసి విసిరాడొక కమెండో..

హైజాకర్ చేతిలోని కత్తి పడిపోయింది. వెనువెంటనే హైజాకర్లను చుట్టుముట్టారు కమెండోలు.

రంజిత, జోగీందర్ సింగ్....హాస్పిటల్‌లో ఎడ్మిట్ చేయబడ్డారు.

అంతవరకూ శిక్కు అన్న కారణంగా అపార్థం చేసుకొని, ఎంతో క్రూరుడుగా భావిస్తూ వచ్చిన జోగీందర్ సింగే, ప్రాణాలకు తెగించి తమ ప్రాణాలను రక్షించాడన్న నిజం తెలుసుకున్న ప్రయాణీకుల కళ్ళు చెమర్చాయి!

• • •

తెల్లని మల్లెపూవులాంటి హాస్పిటల్ బెడ్‌లపై

శాండేక్ లతో పడుకుని వున్నారు రంజిత, జోగిందర్ సింగ్.

వారి వంక ఆర్ద్రంగా చూశాడు సి.బి.ఐ. చీఫ్ కరుణాకర్.

"అమ్మా! రంజితా!

మిమ్మల్నిద్దరినీ ఎలా అభినందించాలో నాకు తెలియటం లేదమ్మా!

ఆడపిల్ల వయినా నీవు చూపిన తెగువ, ధైర్యం...."

"నాదేముంది సర్! ఆ క్రెడిట్ అంతా జోగిందర్ సింగ్ గారిదే. సెలవుమీద యింటికి వెళుతున్న ఆయన ఈ విమానంలోనే ప్రయాణం చేయటం, ఒక ఎయిర్ లైన్స్ పైలట్ గా ఆయన నాకు అంతకుముందే పరిచయస్థులు కావడం....అంతా ఇట్స్ అవర్ లక్!" అంది ఆమె చిన్నగా నవ్వుతూ.

"యస్....ఇట్స్ అవర్ లక్ బేబీ!

కొందరు శిక్కులు మతం పేరుతో దేశాన్ని భక్షించచూనడం, అదే మతానికి చెందిన మీరు ప్రాణాలకు తెగించి మరీ ఈ అమాయకులైన ప్రయాణీకులను రక్షించడం!

చూసారా విచిత్రం!

ఇక్కడ భక్షకులూ, రక్షకులూ....శిక్కులే!" కరుణాకర్ గొంతులో ఏదో విషాదం తొణికిసలాడింది.

అంతవరకూ మౌనంగా ఉన్న జోగిందర్ సింగ్, తన ప్రక్కనున్న టేప్ రికార్డర్ ను ఆన్ చేశాడు.

"హిందూ హై హమ్!

హిందూ హై హమ్!

సారే జహాఁసె అచ్ఛా!

హిందూ సితా హమారా....హమారా!

సారే జహాఁసె అచ్ఛా!"

అది వారి మనసులలోని భావం!

"మతాలు వేరైనా, జాతులు వేరైనా మనమంతా భారతీయులం! యన్ వుయ్ ఆర్ ఇండియన్స్!"

—: అ యి పో యి ం ది :—

సీరియల్

వి.యస్.రావ్



(గత సంచిక తరువాయి)

"విరూపాక్షరావు గురించి నువ్వు వినలేదనుకుంటాను!" అతను సూటిగా చూస్తూ అన్నాడు.

"వాడెవడు?" మనోజ్ నిర్లక్ష్యంగా అడిగాడు.

అతని మొహం బిగుసుకుపోయింది. బుర్రమీసాలకింద పెదవులు వణికాయి. వాటిమధ్య కరోనా సిగార్ని ఇరికించి, పొగలాగాడతను.

"మనోజ్, వాడెవడు అని నువ్వడిగిన విరూపాక్ష రావుని నేనే!" అతని కంఠంలో గర్వం గంటలా ధ్వనించింది.

మనోజ్ ఆశ్చర్యంగా చూశాడు. పెదవులు బిగబట్టి, పైకి తన్నుకొస్తున్న నవ్వుని మింగేశాడు. "బెలూన్నీ, న్యూస్ పేపర్నీ నా వెంట యెందుకు పంపించావు?" ఏక

వచనంతో ప్రశ్నించాడు. తన పక్కనే నుంచున్న సింహం ఊపిరి బిగబట్టడం అతనికి వినిపించింది.

విరూపాక్షరావు మొహం మళ్ళీ రాయిలా బిగుసుకు పోయింది. ఏకవచనంలో సంబోధించడం అతనికి అల వాటు లేనట్టుంది. అతను మౌనంగా మనోజ్‌ను చూస్తూ ఉండిపోయాడు. మనోజ్ ఓరగా చూశాడు. సింహం వేళ్లు పిడికిళ్ళుగా బిగుసుకున్నాయి. తన యజమానిని అటాక్ చేయబోతున్న అపరిచిత వ్యక్తిని చూస్తున్న ఆల్సేషియన్ చూపుల్లా వున్నాయతని చూపులు.

“సింహం, అతని బేడీలు తీసెయ్!” విరూపాక్షరావు మాటలు వినిపించి, మనోజ్ నమ్మలేనట్టు అతన్ని చూశాడు. సింహం అతని వెనక్కి జరిగాడు. విడుదల పొందిన తన చేతుల్ని మనోజ్ క్షణకాలం చూశాడు. రాగికడియాల్లా వాతలు పడ్డాయి.

“సింహం, వెళ్ళు!” విరూపాక్షరావు కంఠం గంభీరంగా ధ్వనించింది. మనోజ్ ఆశ్చర్యంతో అతన్నే చూస్తున్నాడు. విరూపాక్షరావు తదేకంగా చుట్టకొసని పరీక్షిస్తున్నాడు. తలుపు మూసుకున్న చప్పుడు వినిపించి, మనోజ్ తిరిగిచూశాడు. హాలు ఖాళీగా వుంది.

మనోజ్ మెరుపులా కదిలాడు. విరూపాక్షరావు ముందు టేబుల్ మీదున్న తన కత్తిని అతని వేళ్ళు చుట్టేశాయి.

“మనోజ్ విగ్రహంలా నుంచో!” విరూపాక్షరావు కంఠం గంభీరంగా ధ్వనించింది. ఏదో చప్పుడు మనోజ్ చెవులకి లీలగా వినిపించింది. కత్తిని పట్టుకున్న చెయ్యి గాలిలో ఆగింది.

“మనోజ్, మెల్లిగా తలతిప్పి, నీ కుడివైపుకు

చూడు!" విరూపాక్షరావు కంఠంలో బెదిరింపులేదు.

మనోజ్ తలతిప్పి చూశాడు. ఇందాక గోడకి ఆనుకొని కనిపించిన ఆరడుగుల ఆయిల్ పెయింటింగ్ లేదు. అస్థిపంజరంలా సన్నగా వున్న వ్యక్తి గోడలో యేర్పడిన అరలో విగ్రహంలా నిలబడ్డాడు. అతని పాము కళ్ళు మెల్లిగా కదిలాయి. అతని చేతుల్లో నిర్లక్ష్యంగా పట్టుకున్నట్టున్న గన్ తన ఛాతీమీదకి గురిపెట్టడ్డట్టు మనోజ్ గుర్తించాడు. ఆ వ్యక్తి మొహంమీద చిరునవ్వు ప్రత్యక్షమైంది.

చుట్టూ ఆవరించిన నిశ్శబ్దాన్ని చిన్న చప్పుడు భంగం చేసింది. ఆ చప్పుడేమిటో మనోజ్‌కి బాగా తెలుసు. గన్ సేఫ్టీ కాచ్ రిలీజ్ చేయబడింది! అప్రయత్నంగా మనోజ్ తల ఇంకొంచెం తిరిగింది. రెండో ఆయిల్ పెయింటింగ్ స్థానంలో ప్రత్యక్షమైన మరో వ్యక్తిని అతను ఆశ్చర్యంతో చూశాడు.

ఉక్కు బంతిలా నున్నగా మెరుస్తున్న బోడిగుండు. కాకి ఈకల్లాంటి మీసాలు. వాటికింద తెల్లగా మెరుస్తున్న గొగ్గిరిపళ్ళు. రక్తదాహంతో చూస్తూన్నట్టున్న ఎర్రటి కళ్ళు. అతని చేతుల్లోని సాన్ఆఫ్ షాట్‌గన్ రంధ్రం తన పొట్టని చూస్తోంది.

గదిలోకి వచ్చాక తను చూసిన ఆరు ఆయిల్ పెయింటింగ్స్ మనోజ్‌కి గుర్తొచ్చాయి. అతని కళ్ళు గోడవెంట పరుగెత్తాయి. ఆయిల్ పెయింటింగ్స్ బదులు, గన్స్ పట్టుకొని, తననే ఆకలిగా చూస్తున్న వ్యక్తుల్ని మనోజ్ రెప్పపాటులో చూశాడు.

"మనోజ్, నీ ఎడమవైపు కూడా ఆరుగురు వ్యక్తులు నిన్నే చూస్తున్నారు. వాళ్ళ కళ్ళకి నువ్వు 'బుల్స్ఐ'లా

వున్నావ్. కావాలంటే చూసుకో!" విరూపాక్షరావు కంఠం హెచ్చరించింది.

మనోజ్ చూస్తున్నాడు. విరూపాక్షరావు కంఠం నవ్వుతూ సగర్వంగా శబ్దం చేసింది.

"మనోజ్..."

మనోజ్ తలతిప్పి అతన్ని చూశాడు. అతని కళ్ళు మెరుస్తున్నాయి. అతని పెదాలమధ్య ఇరుక్కున్న చుట్ట ఎర్రగా వెలిగింది. ఆ వెల్తురు అతని కళ్ళకి ఎర్ర రంగు పూసింది.

"నా ఎడమకాలికిందున్న బటన్ నొక్కబడితే, తుపాకులు పేలుతాయ్! నీ శరీరం ఏకిన దూదిపింజల్లా ఎగిరిపోతుంది! కత్తిని వదిలెయ్!"

అప్రయత్నంగా మనోజ్ వేళ్ళు వదులయ్యాయి. కత్తి బల్లమీదపడుతూ చిన్నగా చప్పుడు చేసింది.

విరూపాక్షరావు కత్తినితీసి, జేబులో పడేసుకున్నాడు. విజయవంతంగా నవ్వుతూ మనోజ్ వైపు చూశాడు. జేబులోవున్న సన్నటి దంతం దువ్వెనని వేళ్ళమధ్య ఇరికించి, బుర్రమీసాల్ని జాగ్రత్తగా దువ్వుకున్నాడు. నవ్వుతున్న కళ్ళని మనోజ్ వైపు తిప్పాడు. కుర్చీలోంచి లేచి, ఎత్తుగా ఠీవిగా నిలబడ్డాడు.

"మిస్టర్ మనోజ్, గురి పెట్టిన డజను తుపాకులమధ్య నీకు ఇబ్బందిగా వుంటుంది. నా గదిలోకి వెళ్దాం...."

"ఎందుకు?" మనోజ్ లేస్తూ ప్రశ్నించాడు. విరూపాక్షరావు ప్రవర్తనా, మాటలూ అతనికి అగమ్యగోచరంగా వున్నాయి.

విరూపాక్షరావు సిగార్‌ని పైకెతిప్పి పట్టుకున్నాడు. కాలుతున్న కొసని పొగతో ఊదాడు. మనోజ్‌ని తదేకంగా చూశాడు.

"నన్ను నీకు శత్రువుగా నువ్వు భావిస్తున్నావు. నేను నీ శత్రువు కానని నిరూపించడానికి!" అంటూ విరూపాక్ష రావ్ వెనక్కి తిరిగాడు.

వెనకవైపున వాల్ పేపర్‌తో పూర్తిగా కప్పబడిన గోడ మధ్యభాగంలో ఆగాడు. అతని ఎడమచెయ్యి పైకి లేచింది. వాల్ పేపర్ డిజైన్‌లో వున్న పులిబొమ్మ ముఖంవైపు అతని చూపుడువేలు సాగింది.

మనోజ్ కదలకుండా చూస్తున్నాడు. విరూపాక్ష రావు చూపుడు వేలు పులిబొమ్మ ఎడమ కంటిని తాకింది. అతనిముందు ద్వారబంధం సైజులో వాల్ పేపర్ కదిలింది. నిశ్శబ్దంగా. గుమ్మంలా ప్రత్యక్షమైన ప్రదేశాన్ని మనోజ్ ఆశ్చర్యంతో చూశాడు.

లోపలికి అడుగు వేసి, విరూపాక్షరావు వెనుదిరిగి నిలబడ్డాడు. బలంగా, పొడుగ్గా వున్న విరూపాక్షరావు నకిలీ గుమ్మంలో, ఫ్రేములో ఇరికించబడిన యెవరో రాజాగారి ఆయిల్ పెయింటింగ్‌లా అవుపిస్తున్నాడు. కదలకుండా చెట్టులా నిలబడ్డ మనోజ్‌ని అతను చిరునవ్వుతో చూశాడు

"మనోజ్, ప్రస్తుతం నువ్వు నా గుప్పిట్లో వున్నావు. నేను అనుకుంటేగాని నువ్వు బైటపడలేవు! లోపలికిరా సత్యాన్ని చూపిస్తాను!" విరూపాక్షరావు కంఠం గంభీరంగా ధ్వనించింది.

తన చుట్టూ సిపాయిల్లా తుపాకులు గురిపెట్టి నుంచున్న

వ్యక్తుల్ని వోసారి కలియజూసి మనోజ్ మెల్లిగా కదిలాడు.

• • •

చిన్న గదిలో టేబుల్ ముందు నిలబడి విరూపాక్ష రావు మనోజ్ వైపు నవ్వుతూ చూశాడు.

"సిడౌన్, మనోజ్!"

మనోజ్ కూచోలేదు, బాక్స్‌లా వున్న గదిని పరిశీలనగా చూస్తూ ఉండిపోయాడు. ఎదురుగా వున్న గోడని సముద్రంమీద, దిక్చక్రంలో ఎర్రగా అస్తమిస్తున్న సూర్యుడున్న చిత్రం పూర్తిగా కప్పేసింది. తతిమ్మా మూడు గోడల్ని రకరకాల ప్రకృతి దృశ్యాలు మరుగుపరిచాయి. గజిబిజిగా ఉన్న ఆ చిత్రంలో ఎక్కడ ఏ మాట ఉందో తెలుసుకోడం కష్టం.

"మనోజ్, నువ్వు గోవుని చూసి గుంటనక్క అనుకున్నావు!" విరూపాక్షరావు కంఠం మనోజ్ దృష్టిని మళ్ళించింది. అతను విరూపాక్షరావుని తీక్షణంగా చూశాడు.

"మా వదినా, గీతా మరణించడానికీ, మా అన్నయ్య జైలుపాలవడానికీ కారణం నువ్వే!"

విరూపాక్షరావు నవ్వుతూ కుర్చీలో కూచున్నాడు.

"నీకోసం వెతుకుతున్న నన్ను నీ శిష్యులు నీ దగ్గరకు లాక్కొచ్చారు. వాళ్ళకి నేను ఋణపడ్డాను..నువ్వు.."

"నిప్పుని జేబులో పడేసుకునేంత మూర్ఖుణ్ణి కాను నేను!" విరూపాక్షరావు అడ్డుకుంటూ, బిగ్గరగా అన్నాడు. "మొదట్నుంచీ నీ పరిశోధన తప్పుదారిన వెళ్తోంది. వేరే కారణంగా నిన్ను వెంటాడుతున్న నా అనుచరుల్ని నువ్వు అసలు వ్యక్తులుగా భావించావు!"

మనోజ్ విరూపాక్షరావు కళ్ళల్లోకి చూస్తూ ఉండిపోయాడు. అతని కళ్ళు తీక్షణంగా వున్నాయి. వాటిలో దాపరికం, నటన కనిపించడంలేదు. మరి విరూపాక్షరావు తనని ఎందుకు ఫాలో అయ్యాడు?

"జరిగిందానికి కారకులైన వ్యక్తులు వేరే వున్నారు! నీ పక్కనే వున్న వాళ్ళని నువ్వు పోల్చుకోలేక పోయావు. నువ్వు కలుసుకోబోయే ప్రతి వ్యక్తినీ వాళ్ళు హత మార్చారు! నా అనుచరుల ద్వారా నిన్ను చూసినట్టే, వాళ్ళనీ నేను చూశాను; చూస్తున్నాను చూస్తూ వుంటాను?"

"ఎందుకు?" మనోజ్ ప్రశ్నించాడు. విరూపాక్షరావు మాటల్ని యెందుకో నమ్మాలనిపిస్తోంది అతనికి.

"ఒంటామెని కల్సుకోవాలనుకున్నావు. ముందుగా వెళ్ళి 'వాళ్ళకి' నీ ఉద్దేశాన్ని తెలియజేశావు....!"

"ఎవరు వాళ్ళు?"

విరూపాక్షరావు చిన్నగా నవ్వాడు. "మస్తాన్ రావునీ, టాక్సీ డ్రైవర్ని కల్సుకోబోయావు. వాళ్ళు లోయలోకి తోయబడ్డారు!" విరూపాక్షరావు మనోజ్ ప్రశ్నను నిర్లక్ష్యం చేస్తూ అన్నాడు.

"ఎవరు వాళ్ళు?" మనోజ్ అరిచాడు.

"చెప్తాను. అందుకే నిన్ను రప్పించాను. మొదట్నుంచీ నువ్వు సింహాన్నీ, హనుమాన్ నీ అనుమానించావు...."

"హనుమాన్ .... బెలూనా?" మనోజ్ అడ్డుకగిలాడు.

విరూపాక్షరావు అవునన్నట్లు తలాడించాడు. మనోజ్ అతన్ని తీక్షణంగా చూశాడు.

"మిస్టర్ విరూపాక్షరావ్, నువ్వు చెప్పేది నిజమైతే, నీ తోకల్ని నా తోకలుగా మార్చి, నన్ను తప్పుదారి

పట్టించింది నుక్వే! అసలు వ్యక్తుల్ని పోల్చుకోకుండా నీ శిష్యులు అడ్డుతగిలారు!" మనోజ్ కంఠంలో ఆక్షేపణ ధ్వనించింది.

చిన్నగా నవ్వుతూ విరూపాక్షరావు సిగార్ వెలిగించాడు. "కూర్చో. అంతా వివరిస్తాను...." అన్నాడు తను సిగార్‌తో కుర్చీ చూపుతూ. మనోజ్ అప్రయత్నంగా కూచున్నాడు.

"నీ అన్వేషణ ఎలా సాగుతోందో తెలుసుకోడానికి నా మనుషులు ప్రయత్నించారు; దానికి కారణం వుంది. అమెరికాని గడగడలాడిస్తున్న మాఫియా ఫక్కీలో తన నేర పరంపరని జయప్రదంగా సాగించుకుపోతున్న ఒక ముఠా దీనికంతటికీ కారణం...."

మనోజ్ ఆశ్చర్యంగా చూశాడు. "మీకెలా తెలుసు?" మొదటిసారిగా తనని బహువచనంలో మన్నించిన మనోజ్‌ని విరూపాక్షరావు చిరునవ్వుతో చూశాడు.

"ఇలాంటి విషయాల గురించిన రన్నింగ్ కామెంటరీ యెప్పుడూ నాకు వినిపిస్తూ ఉంటుంది!" సగర్వంగా అన్నాడతను.

"ఆ ముఠాకి మా అన్నయ్య యేం అపకారం చేశాడు?" మనోజ్ ప్రశ్నించాడు.

విరూపాక్షరావు రెప్పవేయకుండా చూశాడు. "నిజం చెప్పాలంటే నాకు తెలీదు! కానీ ఒక్కటి మాత్రం చెప్పగలను: చీకట్లో చూడకుండా తొక్కి తొక్కినా కూడా త్రాచుపాము బుసకొట్టి కాటేస్తుంది! మీ అన్నయ్య విషయంలో అదే జరిగిందని నా నమ్మకం. మీ అన్నయ్య గురించి నాకు తెలుసు. అతను నిజాయితీపరుడు...."

మనోజ్ విరూపాక్షరావుని చిరునవ్వుతో చూశాడు. "మీరే ఇదంతా చేయించారన్న అనుమానం పొరపాటని నాకు అనిపిస్తోంది. చెప్పండి. వాళ్ళెవరు?"

విరూపాక్షరావు చిన్నగా నవ్వాడు. "మనోజ్, వాళ్ళెవరో తెలుసుకునేలోగా, మరికొన్ని విషయాలు నువ్వు తెలుసుకోవాలి!"

మనోజ్ అతని కళ్ళల్లోకి చూశాడు. విరూపాక్షరావు కళ్ళు మెరుస్తున్నాయి. ఆరిపోయిన కళ్ళని వెలిగించి అతను ప్రారంభించాడు:

"చట్టం, కోర్టూ మా అన్నయ్య నిర్దోషిత్వాన్ని గుర్తించి, అపరాధుల్ని శిక్షిస్తాయని నేను ఆశించాను. కానీ చెవులు మాత్రం వున్న కోర్టు ఎవరో పలికించిన ఎన్నో అసత్యాల్ని వింది; సత్యాన్ని చూడలేకపోయింది. పాటి లాయర్లు కరుణాకర్‌కి సహాయం చేయలేకపోయారు. నువ్వు రంగంలోకి దిగావు. కానీ మనోజ్, అసలు వ్యక్తుల్ని పసిగట్టడంలో నువ్వూ విఫలమయ్యావు! అంచేత నిన్ను తప్పుదారినుండీ సరైన దారికి మళ్ళించాలని నిర్ణయించుకున్నాను..."

"ఎందుకు?" మనోజ్ అడ్డొస్తూ ప్రశ్నించాడు. "మా అన్నయ్యమీద మీకెందుకంత ప్రేమ?"

విరూపాక్షరావు చిన్నగా నవ్వాడు. అతని కళ్ళు పెన్సిల్‌టార్చిలైట్లలా మనోజ్‌ని తీక్షణంగా చూశాయి. "మీ అన్నయ్యమీద ప్రేమకాదు; అన్యాయంమీద ద్వేషం!"

మనోజ్ కనుబొమలు పైకిలేస్తూ అతని ఆశ్చర్యాన్ని ప్రకటించాయి.

"అమాయకులు అన్యాయానికి బలైపోవడం నేను

సహించను! నా ప్రయత్నం లేకుండా కరుణాకర్ కి న్యాయం జరుగుతుందని ఆశించాను; వేచిచూశాను. అక్రమాన్ని దండించి, అమాయకత్వాన్ని రక్షించడంలో చట్టం విఫలమైంది! ఆ వైఫల్యాన్ని, బాధ్యతగల పౌరుడిగా నేను సహించను!" విరూపాక్షరావు కంఠం ఆవేశంతో గంటలా ధ్వనించింది.

"ఏం చేస్తావు?" మనోజ్ నవ్వుతూ ప్రశ్నించాడు.

"రాజమార్గంలో వీలుకానప్పుడు దొడ్డిదారిగుండా న్యాయాన్ని వెలికి రప్పించి, పునఃప్రతిష్ఠ చేసే ప్రయత్నం చేస్తాను!" విరూపాక్షరావు కంఠంలో ఏదో విప్లవశంఖం మ్రోగింది. అతని కళ్ళు రవ్వల్లా తళుక్కుమంటున్నాయి.

"చట్టం చేతికి చిక్కకుండా దుర్మార్గులు, అవినీతిపరులు మీ వదినను హతమార్చారు. గీతను మానభంగం చేసి రాక్షసంగా చంపారు. దాన్నంతా అతి తెలివిగా కరుణాకర్ నెత్తిన రుద్ది, అతన్ని నిలువవేశారు. అలాగే చట్టం చేతికి చిక్కకుండా వాళ్ళని హతమార్చే ప్రయత్నంలో నీకు పరోక్షంగా సహాయం చేస్తాను!" విరూపాక్షరావు ఉద్రేకంగా అన్నాడు.

మనోజ్ ఆవేశంతో లేచి నిలబడ్డాడు. ఉత్సాహంగా అతని మొహంలోకి చూశాడు. "విరూపాక్షరావుగారూ, మీ మోటివ్ ని నేను మెచ్చుకుంటున్నాను. హృదయపూర్వకంగా మీ సహాయాన్ని స్వీకరిస్తాను! వాళ్ళెవరో నాకు చెప్పండి!"

"మనోజ్, సిడౌన్!" విరూపాక్షరావు చిరునవ్వుతో అన్నాడు.

మనోజ్ కూచున్నాడు.

"నీ హృదయాన్ని దారుణంగా గాయపరిచిన క్రూర

మృగాల్ని నీకు నేను చూపిస్తాను....అయితే, నువ్వు నాకో సాయం చేయాలి...."

"చెప్పండి. నా పగ తీర్చుకోడంలో సహకరిస్తున్న మీకు ఏ సహాయం కావాలన్నా చేస్తాను!" మనోజ్ ఉద్రేకంతో అన్నాడు.

"మనోజ్, బుద్ధిబలంతో, నిజాయితీగా నేను ఎంతో పెద్దవాణ్నయ్యాను. వ్యాపారంలో ఘన విజయాల్ని సాధించాను. ఐశ్వర్యం, పలుకుబడీ నాచుట్టూ కోట గోడల్లా ఎదిగాయి. అలాగే, నన్నూ నా నీతిని ద్వేషించే స్వార్థపరులైన శత్రువులూ పెరిగారు. ధర్మయుద్ధంలో ధైర్యంగా నాతో ఢీకొనే శక్తిలేని ఆ పిరికిపందలు దొంగచాటుగా నన్ను దెబ్బతీయడానికి కుట్రలు పన్నుతున్నారు. వాళ్ళ పథకాల్ని ఎప్పటికప్పుడు నేను గోటితో ఛిన్నాభిన్నం చేస్తూ వచ్చాను. కానీ...." విరూపాక్షరావు తన ఆవేశాన్నీ, ఆగ్రహాన్నీ దిగమింగుతూ ఆగాడు.

"కానీ, పదిరోజుల క్రితం, నా అనుచరులు ముగ్గుర్ని వాళ్ళు బంధించి తీసుకెళ్ళారు. వాళ్ళని ఎక్కడో దాచి వుంచారు...."

"మీ అనుచరులు....ఎవరు?" మనోజ్ అడ్డొస్తూ ప్రశ్నించాడు.

"నాకున్న మూడు కుడిభుజాలు! నా మూడుకళ్ళు!" విరూపాక్షరావు పళ్ళుకొరుకుతూ అన్నాడు.

"వాళ్ళని బంధిస్తే వాళ్ళకి ఏమిటి లాభం?"

విరూపాక్షరావు చిన్నగా నిట్టూర్చాడు. "మనోజ్, నువ్వు సమాజానికి మేలు చేయాలంటే తగిన పదవిలో వుండాలి ఆ పదవికి ఎక్కాలంటే సూటిగా మెట్లు ఉపయోగించలేవు. అడ్డదిడ్డంగా, దొంకతిరుగుడుగా వస్తేగానీ

నువ్వు పై మెట్టు చేరుకోలేవు. ప్రజలకి ఉపయోగపడాలన్న ధ్యేయంతో నేను పైకి ఎగబాకాను. ఆ ప్రయత్నంలో ముక్కుసూటిగా వెళ్ళడం సాధ్యంకాలేదు. అవన్నీ నా విజయరహస్యాలు. అవన్నీ నా అనుచరులకి శుభ్రంగా తెలుసు. అవి నా శత్రువులకి తెలియడం ప్రమాదం....”

“మిమ్మల్ని భయపెట్టే గతం మీకుందని అంగీకరిస్తున్నారు!” మనోజ్ చిరునవ్వుతో అన్నాడు.

“అంతస్థు లెక్కువ వ్యక్తికి గతం సాధారణంగా అద్దంలా వుండదు! ఇతర్లకి అపకారం చేయకపోయినా, నా గతం కొన్ని సందర్భాల్లో నా పరపతికి భంగం కలిగిస్తుంది....” విరూపాక్షరావు ఆగి, మనోజ్ ని తదేకంగా క్షణకాలం చూశాడు.

“మనోజ్, ప్రజలకోసం నేనో బ్రహ్మాండమైన పథకం రూపొందిస్తున్నాను. వాళ్ళ జీవితాల్ని స్వర్గంలా చేయకపోయినా, నరకం కాకుండా చూడ్డానికి ‘మానవత’ అనే సరికొత్త పార్టీని స్థాపించబోతున్నాను. నా మానవత పార్టీ అధికారంలోకి వస్తుందని నాకు తెలుసు. అది జరిగే సమయంలో నా గతం వెలికి రాకూడదు! అందుకే నా రహస్యాలు తెలిసిన నా శిష్యుల్ని శత్రువుల ఉక్కుపిడికిళ్ళ నుండి విడిపించుకురావాలి!”

“ఇప్పటికే వాళ్ళు మీగురించి బుర్రకథలు చెప్పేసి వుండొచ్చు” మనోజ్ నవ్వుతూ అన్నాడు.

విరూపాక్షరావు తల అడ్డంగా ఆడించాడు. “వాళ్ళ గురించి నీకు తెలీదు. మొదట నయానా భయానా వాళ్ళని మాట్లాడించడానికీ, వాళ్ళని తమలో చేర్చుకోడానికీ శత్రువులు ప్రయత్నిస్తారు. తరవాత టార్చర్

ప్రారంభిస్తారు. కొంత లిమిట్ దాకా టార్చర్ని నా వ్యక్తులు తట్టుకోగలరు. వాళ్ళు పూర్తిగా లొంగిపోయే లాగా వాళ్ళని మనం విడిపించుకోవాలి!"

"అంటే, నేను వాళ్ళని విడిపించుకు రావాలి! అంతేగా?" మనోజ్ ప్రశ్నించాడు.

విరూపాక్షరావు చిరునవ్వు నవ్వాడు. "సరిగ్గా ఊహించావ్!"

మనోజ్ అతన్ని సూటిగా చూశాడు. "మీకు ధన బలం వుంది. జనబలం వుంది. ఆ పని మీరే ఎందుకు చేయకూడదు?"

"నా వాళ్ళందరిగురించీ నా శత్రువులకి బాగా తెలుసు. ఆ ప్రయత్నంలో నా మనుషులు కదిలితే వాళ్ళు పసిగడతారు! వాళ్ళకి అపరిచితుడైన కొత్త వ్యక్తి, పట్టుదలా సాహసం వున్న వ్యక్తి నాకు కావాలి! ఆ వక్తి నువ్వే!"

మనోజ్ కుర్చీలో వెనక్కి వాలాడు. "ఆ పని నేను చేయనంటే ఏం చేస్తారు?"

విరూపాక్షరావు చిన్నగా నవ్వాడు. "చేయనని నువ్వు అనలేవు! ఎందుకంటే—ఆ పని చేస్తేగానీ, నీ శత్రువుల్ని నీకు చూపించడం జరగదు!"

మనోజ్ లోపల్లోపలే పళ్ళు కొరుక్కున్నాడు. "మిస్టర్ విరూపాక్షరావ్, మీరు చూపించకపోయినా నేను కనుక్కుంటాను!" అన్నాడు గంభీరంగా.

విరూపాక్షరావు బిగ్గరగా నవ్వాడు. "మనోజ్, నీకు అనుభవం తక్కువ. నువ్వు వెతకడం ప్రారంభించేసరికి పక్షులు ఎగిరిపోతాయ్! వలవిసిరి వాట్ని పట్టేసరికి మీ అన్నయ్య జీవితఖైదు పూర్తయిపోతుంది!"

మనోజ్ మాట్లాడకుండా చూశాడు. జరిగిందాన్నిబట్టి

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందచేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా 'బుక్ పోస్టు'లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి— దానికి మీరు అర్ధ సంవత్సర చందా రు. 84/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించ నవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి.



చూస్తే విరూపాక్షరావు చెప్తోంది నిజమే అనిపిస్తోంది....

"నువ్వు కల్సుకోడానికి ప్రయత్నించే ప్రతీ వ్యక్తీ అచిర కాలంలో శవంగా మారుతాడు! చివరకు నువ్వు కూడా. నేనుగురించి ఏమీ తెలీకపోడం ఇందులేఖ ప్రాణాల్ని కాపాడింది...." విరూపాక్షరావు మెల్లిగా ఆగి, మరో సిగార్ వెలిగించాడు.

ఇందులేఖ! ఆమెగురించి కూడా విరూపాక్షరావుకి తెలుసు! పంటితో పెదవిని నొక్కుకుంటూ మనోజ్ ఆలోచిస్తూ చూశాడు.

"మనోజ్, ఆదమరిచి వున్న సమయంలో నువ్వు బెబ్బులి మీదికి లంఘించాలి! అది జరగాలంటే ఆ బెబ్బులి ఎక్కడుందో నీకు తెలియాలి. తెలియాలంటే నేను చూపించాలి!"

"ఆల్ రైట్! మీ షరతు అంగీకరిస్తున్నా. నేను వెతుకుతున్న వ్యక్తి ఎవరో, ఎక్కడున్నాడో చెప్పండి!" మనోజ్ తనలో నిర్ధారణ చేసుకొని అన్నాడు.

"సారీ మనోజ్. నా పని పూర్తిచేసేదాకా చెప్పను. అసలు వ్యక్తుల్ని నీకు చూపిస్తే నా పని విస్మరించి వాళ్ళ మీదికి దూకుతావు!" విరూపాక్షరావు చిన్నగా నవ్వాడు.

మనోజ్ కళ్ళు పెద్దగా చేస్తూ చూశాడు. "పనయ్యాక మీరు నాకు సహాయం చేస్తారన్న గ్యారంటీ ఏమిటి?"

విరూపాక్షరావు గొల్లున నవ్వాడు. "విరూపాక్షరావు మిత్రుల్ని దగా చెయ్యడు."

మనోజ్ తటాలున లేచాడు. రెండు చేతుల్నీ టేబుల్ మీద ఆన్చి, తీక్షణంగా అతని కళ్ళల్లోకి చూశాడు. "మిస్టర్ విరూపాక్షన్, మీ శిష్యుల్ని బంధించిన వాళ్ళే ఇదంతా చేశారా?"

విరూపాక్షరావు పెదవులు నవ్వుతో విచ్చుకున్నాయి. "మనోజ్, వాళ్ళే నీ శత్రువులని చెప్తే, నాకు సాయం చేయమని నిన్ను అడిగే అవసరం వుండదు! కానీ, నేను అబద్ధాలాడను! ఆ మాటా నిజం. నా శిష్యుల్ని తీసుకుని తిరిగి రా. నీ శత్రువుల్ని నీకు చూపిస్తాను!"

మనోజ్ చిరునవ్వు నవ్వాడు. విరూపాక్షరావు నిజాయితీ అతని మాటల్లో ధ్వనిస్తోంది. నిజమే. వాళ్ళే వీళ్ళని తనకి చెప్తే తను వీళ్ళని సర్వనాశనం చేస్తాడు! తప్పుచేసింది ఒకరైతే, శిక్ష వేరొకరు అనుభవిస్తారు. మనోజ్ కుడిచేతిని ముందుకి చాచాడు.

"మిస్టర్ విరూపాక్షరావ్, మీ నిజాయితీని మెచ్చుకోకుండా వుండలేను. మీ పని చేసిపెడతాను: నాకు మీ సహకారం అందించండి!" అన్నాడు ఉద్రేకంతో.

విరూపాక్షరావు పైకి లేచాడు. సిగార్ని యాష్ ట్రే మీద పెట్టి, మనోజ్ చేతిని పట్టుకున్నాడు. నవ్వుతూ చూశాడు. "మనోజ్, ఈ క్షణంనుంచి మనం స్నేహితులం!"

"చెప్పండి, మీ శిష్యుల్ని బంధించిందెవరు?" మనోజ్ కంఠంలో ఆతృత ధ్వనించింది.

"మనోజ్. ముందుగానే చెప్తున్నా! నువ్వు ప్రమాదంలోకి అడుగు పెడ్తున్నావు. అడుగుకో పద్మవ్యూహం నీకు అడ్డుతగులుతుంది. జాగ్రత్తగా జయించుకురావాలి! ఏమాత్రం పొరపాటు...."

"ఎవరో చెప్పండి!" మనోజ్ అడ్డుతగులుతూ అన్నాడు.

విరూపాక్షరావు చిన్నగా నవ్వుతూ అతని చేతిని వదిలేశాడు. "మనోజ్, మనుషుల్ని చంపడం నాకు

ఇష్టం లేదు. అవసరమైతే గానీ ఎవర్నీ చంపను...."

"మీరు నాకు చెప్పాల్సిన అవసరంలేదు. నిజా, ఎదుటివ్యక్తి అన్న పరిస్థితి ఉద్భవిస్తే గానీ నేను చంపను! ఆర్మీ నన్ను అలా తయారు చేసింది! కానీ, అసలు వ్యక్తిని అందుకోడానికి ఎన్ని శవాల మీదెక్కుతానో నాకు తెలీదు. అడ్డొచ్చిన ప్రాణి ఆరిపోతుంది!" మనోజ్ గంభీరంగా అన్నాడు.

విరూపాక్షరావు తలపంకించాడు. మళ్ళీ మధ్యలో కూచున్నాడు. "శత్రువులు నా అనుచరుల్ని ఎక్కడ దాచారో ఖచ్చితంగా తెలీకపోయినా, చూచాయగా తెలుసు. నేను క్లూ మాత్రం ఇవ్వగలను. నువ్వే పరిశోధించుకుంటూ ముందుకు వెళ్లాలి! కూచో, నేను తెలుసుకున్నది నీకు తెలియజేస్తాను...." అన్నాడు మెల్లిగా.

మనోజ్ కూచుని, రెప్పవేయకుండా అతన్నే చూడసాగేడు. విరూపాక్షరావు ప్రారంభించాడు.....

• • •

చెప్పడం ముగించి విరూపాక్షరావు కుర్చీలో వెనక్కి వాలాడు. అతని చెయ్యి టేబుల్ కిందికి పోయింది.

నిమిషం తరవాత తలుపు తోసుకుని సింహం, హనుమాన్ లోపలికివచ్చారు. మోసుకువచ్చిన ట్రేని టేబుల్ మీద పెట్టి హనుమాన్ చేతులు కట్టుకు నిలబడ్డాడు. అతని కళ్ళు వోరగా మనోజ్ నే చూస్తున్నాయి. అతని మోహంలో నవ్వులేదు.

"హనుమాన్, మనోజ్ ఈ క్షణంనుంచీ మనవాడు!" విరూపాక్షరావు నవ్వుతూ అన్నాడు.

(ఇంకావుంది)

